మాండలిక కోశం-2

# మాండలిక పదకోశం







తెలుగు అకాడమి
హైదరాబాదు

మాండలిక కోశం-2



# మాండలిక పదకోశం

సంకలనకర్త, సంపాదకుడు

డా॥ అక్కిరాజు రమాపతిరావు

రిసెర్చ్ ఆఫీసర్, తెలుగు అకాడమి



తెలుగు అకాడమి

హైదరాబాదు

1985

# పరిచయం

తెలుగు అకాడమిలోని పరిశోధన శాఖ సామాజిక భాషాపరిశీలన ఫలితంగా తెలుగు మాండలికాలను ప్రచురిస్తున్నది. ప్రత్యేకించి నేటి తెలుగు సాహిత్యంలో అర్థచ్ఛాయా భేదాలతో ప్రయుక్తమవుతున్న మాండలికపదాలను సేకరించి ప్రచురిస్తున్న ప్రత్యేక కోశగ్రంథమిది. ఈ కార్యక్రమాన్ని ఈ శాఖలోని సీనియర్ రిసర్చిఆఫీసర్ డా॥ అక్కిరాజు రమాపతిరావుకు పూర్తి బాధ్యతలతో అప్పగించగా, ఆయన 1980-82 మధ్యకాలంలో భిన్నరచనలను పరిశీలించి భిన్నవిద్వాంసులతో చర్చించి భిన్నగ్రంథాలయాల్లోని విశిష్ట గ్రంథాలనూ పత్రికలనూ పరిశీలించి 'అకటావికటం' నుంచి 'హైరాను' దాకా రమారమి 6000 పదాలతో ఈ కోశాన్ని 1982 డిసెంబరునాటికి సిద్ధంచేశారు. పద, పదార్థ సేకరణ పద్ధతులు, నిఘంటు స్వరూపం వంటి సమస్త విషయాలనూ ఆయన స్వయంగా రూపొందించారు. అనివార్య కారణాలవల్ల ఈ 'మాండలిక పదకోశ' ముద్రణ ఇప్పటికిగాని పూర్తి కాలేదు.

ఈ కోశంలో ఏ పదం ఏ ప్రాంతంలో ఏ అర్థవిశేషంతో ప్రయుక్తమయిందో సూచితమయింది. అముద్రిత సిద్ధాంత వ్యాసాలనుంచి మారేపల్లివారి 'నుడికడలి' నుంచి కూడా అర్థ విశేషాదులను సేకరించారు. డా॥ రమాపతిరావు పరిశ్రమకు మా కృతజ్ఞత. ఈ కోశాన్ని ముద్రించిన ఏవన్ ప్రింటింగ్ వర్క్సు, హైదరాబాద్ వారికి మా కృతజ్ఞత.

బూదరాజు రాధాకృష్ణ
పరిశోధనశాఖాధిపతి

# భూమిక

స్వాతంత్ర్యానంతరం సృజనాత్మకరచయితలదృష్టి మాండలిక భాషా వైవిధ్యం పట్ల ప్రసరించింది. ఇతివృత్తం ఏవ్యక్తులను గురించి ఏ రంగస్థలంగురించి ఏ పరిసరాలనుగురించి ఉంటుందో ఆ భాషనే స్వీకరించటం సబబుఅని ఆధునిక రచయితలు భావించారు. అందువల్ల తెలుగుదేశంలోని వివిధ ప్రాంతాలలో ఆయాస్థానిక రచయితలు ముఖ్యంగా సృజనాత్మక రచనలలో పూర్తిగా కాకపోయినా సందర్భాన్ని బట్టి మాండలికపదాలను ప్రయోగిస్తూ వచ్చారు. అంతేకాక సాహిత్య అకాడమి ముఖ్యమైన వృత్తులకు సంబంధించి మాండలిక పదనిఘంటువులను నిర్మింపచేయడానికి కూడా పూనుకున్నది. పత్రికలలో మాండలిక భాషనుగురించి రచనలు వెలువడ్డాయి. తెలంగాణ, కోస్తా, రాయలసీమ మాండలిక భాషలోనే కొన్ని కథలు, నవలలుకూడా వెలువడ్డాయి.

ఇప్పటివరకు వెలువడ్డ సంప్రదాయ ప్రామాణిక తెలుగు నిఘంటువులలో మాండలిక పదాలను చేర్చడం జరగలేదు. వృత్తి పదకోశాలు కేవలం ఆయావృత్తులకే పరిమితమైనవి. కాబట్టి ఆధునిక రచనలనుంచీ, ఇదివరకు మాండలిక పదాలవిషయమై జరిగినకృషిని సంప్రదించీ, తెలుగునాట ఆయా మాండలికాల ప్రాతినిధ్యం వహించగల కొన్ని కేంద్రాలు పర్యటించీ పదసేకరణం జరిపి ఒక మాండలిక పదకోశాన్ని రూపొందించాలని తెలుగు అకాడమీ ఒకపథకాన్ని చేపట్టింది.

ఈ పదకోశానికి పదాలు

1. ప్రాంతీయ స్థానిక మాండలికాలలో నవలలు కథలురాసిన సృజనాత్మక రచయితల పుస్తకాల నుంచీ,
2. భాషాభిమానులైన భిన్నప్రాంతాల పండితుల సలహా సంప్రదింపులద్వారాను, సేకరించాలని నిర్ణయించడం జరిగింది.

ముఖ్యంగా యీ పదకోశంలో ఆయాప్రాంతాలలో విలక్షణంగా కన్పించే, ఇదివరకు నిఘంటువులలోకి ఎక్కనటువంటిపదాలు సేకరించాలని నిర్ణయించడం జరిగింది. బంధుత్వ బోధకపదాలు, రుతువులు, కాలభేదాలు, పెంపుడుజంతువులు, పరిసరవాతావరణం, ఆహారనియమాలు, వినోదాలు, పండుగలు పబ్బాలు, నగానట్రా, చెట్టూ చేమా, వృత్తులూ ఉద్యోగాలు మొదలైన విషయాలకు సంబంధించి ఈ పదాలు ఉంటాయి.

ఈ నిర్ణయంమేరకు భిన్నప్రాంతాలలోని లబ్ధప్రతిష్ఠులైన సాహిత్యవేత్తలకు సుమారు ఏభై మందికి యీ విషయమై తమసలహా సంప్రదింపులు అందజేయవలసిందిగా అర్థిస్తూ లేఖలు వ్రాయటం జరిగింది. కాని పదిమంది మాత్రమే సమాధానాలు వ్రాశారు. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి, శ్రీ వై. సి. వి. రెడ్డిగారలు స్థూలంగా మార్గదర్శనసూత్రాలు

తెలియజేశారు. డా॥ దేవరాజు, మహరాజు, డా॥ కేతు విశ్వనాథరెడ్డి, శ్రీ అల్లం రాజయ్య, డా॥ వెలగా వెంకటప్పయ్యగారలు తమ అభిప్రాయాలు, సూచనలు అందజేస్తూ కొన్నిపదాలుకూడా వ్రాసి పంపించారు.

అటు పిమ్మట ఉత్తరాంధ్రంలోని శ్రీకాకుళం విజయనగరం ప్రాంతాలు మధ్యాంధ్రంలో ప్రకాశం, గుంటూరు, కృష్ణా జిల్లాలు, దక్షిణాన తిరుపతి, చిత్తూరు, నెల్లూరు ప్రాంతాలు, రాయల సీమలో కడప, అనంతపురం ప్రాంతాలలో కొన్ని కేంద్రాలు పర్యటించి అక్కడి పెద్దలతో సంప్ర దించి స్థానికంగా ఉండే గ్రంథాలయాలు దర్శించి విషయ సేకరణ చేయడం జరిగింది. వేటపాలెంలోని సారస్వత నికేతనం, విజయవాడలోని దుర్గామల్లేశ్వర గ్రంథాలయం, నెల్లూరులోని వర్థమానసమాజగ్రంథాలయం యీ సందర్భంగా ముఖ్యంగా పేర్కొనవలసినవి. స్వర్గీయ పురిపండా అప్పలస్వామి గారితో సంప్రదించి వారివద్ద ఉన్న కీ. శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి నుడికడలినుంచి కొన్ని పదాలు ఎత్తి వ్రాసుకోవడం జరిగింది. కాకినాడలో శ్రీ వెంపరాల సూర్య నారాయణశాస్త్రిగారితో, నెల్లూరులో శ్రీ ఎన్. ఎస్. కృష్ణమూర్తిగారితో, విజయనగరంలో శ్రీ చాసో గారితో, జగ్గయ్యపేటలో శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదు గారితో, చిత్తూరులో చేకుమళ్ళ కామేశ్వరరావుగారితో, కడపలో శ్రీ వై. సి. వి. రెడ్డిగారితో సంప్రదించి పదసేకరణ చేయడం జరిగింది.

ఇదివరకు మాండలిక పదాల విషయమై జరిగిన కృషికూడా సంప్రదించటం జరిగింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన మాండలిక పదకోశంకూడా సంప్రదించి కొన్ని పదాలు స్వీకరించడం జరిగింది. అయితే యీ కోశంలోని మాండలిక పదాల ప్రాంతీయతను స్థూలంగా నిర్ధారించడం జరిగింది. ప్రధానమైన ఐదు మాండలిక ప్రాంతాలనే అంటే కోస్తా, కళింగాంధ్రం, రాయలసీమ, దక్షిణాంధ్రం, తెలంగాణాలుగా ఈ మాండలిక పదాలను గుర్తించటంలో వాటిని సంజ్ఞలుగా పేర్కొనటం జరిగింది.

ఇటువంటి కృషి జరగటానికి ఇదే ప్రథమ ప్రయత్నం కాబట్టి విస్తృత ప్రాతిపదికపై విశ్లేషణకు పూనుకోవడం జరగలేదు. స్వీయచరిత్ర, విమర్శ, సాహిత్య చరిత్ర, సృజనాత్మక సాహిత్యం, మొదలైన ఆకరాలు సుమారు నూరు పుస్తకాలదాకా పరిశీలించి ఇందులో పదాలు సేకరించడం జరిగింది. సుమారు 6 వేల వరకూ యీ పదకోశంలో ఆయా ప్రాంతీయ విలక్షణార్థ బోధక పదాలు, పదబంధాలు చేరాయి. ఈ కోశం నిర్మాణంలో దొరలిన ఏవైనా లోపాలు తర్వాత ముద్రణలో సవరించుకోవటానికి అనువుగా విజ్ఞులైనవారు, భాషా సాహిత్యరంగాలలో విశేషించి కృషిచేస్తున్నవారు తెలియజేస్తే వచ్చే ముద్రణలో సరిదిద్దు కోవడానికి దోహదం చేసినవారవుతారు. ఆయా సలహాలు అభిప్రాయాలు కృతజ్ఞతతో స్వీకరించి తర్వాత ముద్రణలో పొందుపరచగలము.

## సంజ్ఞా పరిభాష

| | |
|---|---|
| కో. | కోస్తా |
| తె. | తెలంగాణా |
| క. | కళింగాంధ్రం |
| క,నుడి. | కళింగాంధ్రం, నుడికడలి |
| క,కన్యా. | కళింగాంధ్రం, కన్యాశుల్కం |
| ద | దక్షిణాంధ్రం |
| రా | రాయలసీమ |
| తె,కరీం. | తెలంగాణం, కరీంనగరం |
| క,వ్యా,మ,భా | కళింగాంధ్రం, వ్యావహారికాంధ్ర మహాభారతం (వచనం) |
| తె,ప్రకీర్ణ. | తెలంగాణం, ప్రకీర్ణోపన్యాసాలు |
| ద,నె. | దక్షిణాంధ్రం, నెల్లూరు |
| నె,పొ. | నెల్లూరు, పొదిలి |
| మా,రా. | మారేపల్లి రామచంద్రశాస్త్రి |
| క,గా. | కథలు – గాథలు |
| ద,చి. | దక్షిణాంధ్రం, చిత్తూరు |
| రా,అ, | రాయలసీమ, అనంతపురం |
| రా,కర్నూ. | రాయలసీమ, కర్నూలు మొ॥నవి. |

# ఉపయుక్త గ్రంథాలు


వ్యావహారికాంధ్ర వచన భారతం — పురిపండా అప్పలస్వామి

అమృత సంతానం (నవల) — అను. పురిపండా

స్వీయ చరిత్ర — రాంభట్ల జగన్నాథశాస్త్రి

స్వీయచరిత్ర — వల్లూరి సూర్యనారాయణరావు

నా ఎఱుక (స్వీయచరిత్ర) — అజ్జాడాదిభట్ల నారాయణదాసు

నా జీవితయాత్ర (స్వీయచరిత్ర) — టంగుటూరి ప్రకాశంపంతులు

స్వీయచరిత్ర — దువ్వూరి వెంకటరమణశాస్త్రి

వ్యావహారిక భాష - రచనకు కొన్ని నియమాలు — చేకుమళ్ళ కామేశ్వరరావు

ప్రకీర్ణోపన్యాసాలు — పానుగంటి లక్ష్మీనరసింహారావు

కథలు - గాథలు — చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి

మాలపల్లి — ఉన్నవ లక్ష్మీనారాయణ

చిల్లర దేవుళ్ళు — దాశరథి రంగాచార్య

ముత్యాల పందిరి — డా॥ పోరంకి దక్షిణామూర్తి

తరంమారింది — శ్రీమతి మాదిరెడ్డి సులోచన

చాసో కథలు — చాసో

మా గోఖలే కథలు — మా. గోఖలే

బిళ్ళల మొలత్రాడు — కరుణకుమార

ప్రజల మనిషి — వట్టికోట ఆళ్వారుస్వామి

కన్యాశుల్కం — గురజాడ

ప్రహసనాలు — వీరేశలింగం

పాలేరునుంచి పద్మశ్రీ వరకు — శ్రీమతి బోయి హైమవతి

హిందువుల పండగలు — తిరుమల రామచంద్ర

నుడి - నానుడి — తిరుమల రామచంద్ర

మరల సేద్యానికి — అను. తిరుమల రామచంద్ర

అతడు - ఆమె — ఉప్పల లక్ష్మణరావు

స్వీయచరిత్ర — చిలకమర్తి

మునిగోరింట, రంగవల్లి, అల్లోనేరేడు మొదలైన కథాసంపుటాలు — మల్లాది రామకృష్ణశాస్త్రి

| | | |
|---|---|---|
| కాశీయాత్రా చరిత్ర | — | యేనుగుల వీరాస్వామయ్య |
| తాతాచార్ల కథలు | — | సం॥ సి. పి. బ్రౌన్ |
| అనుభవాలూ - జ్ఞాపకాలూను (స్వీయచరిత్ర | — | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి |

ఇవికాక శ్రీ మధురాంతకం రాజారాం, శ్రీ కలువకొలను సదానంద, శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి, శ్రీ అల్లం రాజయ్యల కథల పుస్తకాలు, వ్యాసాలు, ఇతర ప్రక్రియల రచనలు, విక్రమ సింహపురి మండల సర్వస్వంవంటి మండల సమాచార గ్రంథాలు చదివి ఆయా ప్రాంతీయతా ముద్ర గల మాండలిక పదాలు సేకరించడం జరిగింది.

# అ

అకటావికటం వేళాకోళం (క,నుడి.) సామర్థ్యం (ద.)

అకం అధికారం (తె.) అకం మించిన పని చేయటం రోత, వాడు అకంమించి పనిచేశాడు.

అకారతుగా నిష్కారణంగా (క.)

అక్కర మోజు, ఇష్టం, అనురాగం, అభిమానం, గోము, గారాబం (రా.) శుభకార్యం, శోభనం, నిషేకం, గర్భాధానం (కో.)

అక్కల ముత్తయిదువ కన్య పెళ్ళయి అత్తారింటికి వెళ్ళేప్పుడు కొన్ని కుటుంబాలలో గతించిన పెద్దముత్తయిదువులను తలచుకొని చీరెపెట్టి ఆరాధించే సందర్భంలో పూజించే గృహదేవత. కొన్ని కుటుంబాలలో పెళ్ళయి 'మరులు పెండ్లి' అంటే గృహప్రవేశానికి వచ్చినపుడు పెళ్ళికొడుకు వాళ్ళు 'గురప్పపొంగలి' అని పొంగలి పొంగించే ఆచారం కూడా ఉంది (తె,కో.)

అక్కల్ల అక్కయ్య (కో,ద.)

అక్కసు అలుక, కోపం. (క,నుడి.)

అక్కించుకోవడం అనుభవించడం (రా.)

అక్కుపక్షి నిరసనార్థంలో, నిందార్థంలో, బలహీనుడు, దిక్కులేనివాడు, పనికిమాలినవాడు, దద్దమ్మ (ద.)

అక్కెడబెట్టడం మెట్ట సాగుచేసే పొలంలో జొన్న మొదలైన పంటలమధ్య, వేరే చాళ్ళుగా కంది, మొదలైన పైరుపెట్టడం, సామాన్యార్థంలో ఎదబెట్టడం అనిగూడా అంటారు, అక్కెడ వేయడం అనీ అంటారు (ద.)

అక్షరాలా రూఢిగా, తప్పనిసరిగా (క,ద,కో.)

అక్షింతగడ్డి చూ. అక్షింతముళ్ళు (రా.)

అక్షింతముళ్ళు వరిగింజల కోసుల్లాగా ఉండి చాకళ్ళు ఉతికి ఆరవేసి మడిచి తెచ్చేటప్పుడు ఆ బట్టలకు అంటుకొని ఇంటికిచేరే చిన్న చిన్న ముళ్ళు (ద,తె.)

అక్షింతలపురుగు కాకరతీగపై కనబడే పసుపుపచ్చని పురుగు (కో.)

అక్షింతలు చీవాట్లు, మందలింపులు, అసంతృప్తి, అసమ్మతితెలిపే హెచ్చరికలు; ఆఫీసర్లకు అక్షింతలు (25-9-81 ఆంధ్రప్రభ పతాక శీర్షిక)

అఖండం ఆరిపోకుండా చూస్తూ ఒక నియమితకాలం వెలిగే జ్యోతి, అఖండ దీపారాధన (కో.)

అఖాడా కసరత్తుచేసే స్థలం, వ్యాయామశాల, తాలింఖానా (క,కన్యా.)

అఖిలాండం ఏదైనా మొక్కుబడి ఉన్నవాళ్ళు ఆరిపోకుండా నలభై రోజులవరకు వెలిగించేజ్యోతి, దేవాలయాలలో ఈ జ్యోతిని వెలిగించి కాపాడుతారు. దీన్ని 'అఖండమ'ని కూడా ఇతర ప్రాంతాలలో అంటారు (ద.)

అగచాం గ్రహచారం (క.)

అగచాట్లు ఇబ్బందులు, కష్టాలు, ఆపదలు (కో.)

అగడ సంచకరువు, బయానా, అగావు

అగడా బగడా దోరగా మాగటం, సరిగా పక్వానికి రాని స్థితి (కో.)

**అగడు** ఆగడు అనే రూపాంతరంకూడా ఉంది. అధికమైన ఆశ, ఎండతీక్షణత, నిప్పుసెగ, మరీ అంత అగడు పనికిరాదు (తె.)

**అగడుపరచడం** బెదిరించడం, వేరుచేయడం (తె.)

**అగపడు** కనబడు (కో.)

**అగరు** రోజులో ఒకవేళ (తె.)

**అగాయి** గాలిలోకి తుపాకిపేల్చడం, భయపెట్టడానికి ఆకాశంలోకి విడిచే తుపాకిదెబ్బ (తె.)

**అగావ** దబాయింపు, నీ అగావేంది? (రా.)

**అగావు** ముందుగానే చెల్లించాల్సినడబ్బు, భూమికౌలు సంవత్సరారంభంలోనే అగావు ఇవ్వాలి (తె,రా.) ప్రయత్నంలేకుండానే దొరికేది, అగావు వచ్చింది (ద.) అన్యాయంగా లభించేది (రా.)

**అగావుబగావు** అధికారదర్పం (కో.)

**అగుడుచేయటం** ఆగడంచేయటం, అల్లరి పాలుచేయటం (తె.)
అగుడు మొగుడుది, అనుభవం లోకులది.

**అగుబడి** సంసారపక్షంగా నడచుకోని వాడు, వృథా వ్యయంచేసేవాడు (ద.) బోగుబడి (కో.)

**అగులుబిగులుగాఅనిపించు** హెచ్చు వేదన గానుండు (క,నుడి.)

**అగులుబుగులు** ఆందోళన, మనసంతా అగులు బుగులవుతున్నది (తె.)

**అగో** అదిగో (క,తె.)

**అగోరించు** మొత్తుకొను, లబలబలాడు (సందార్థంలో ఏడ్చాడు అనే అర్థం) (తె,ద.)

**అగ్గగు** మండిపోవు, చాలాకోపం తెచ్చుకొను (రా,కో.)

**అగ్గజం** నదురు, ఇంపు, ఆకర్షణీయం (క.)

**అగ్గనగండ్లు** కష్టకాలం, కరువుకాలం (తె.)

**అగ్గారు** కాలిపోవు, మండిపోవు, నశించు, నీ దంతా అగ్గార, అంటే నీ దంతా కాలిపోను, మండి పోను అని తిట్టటం; చెరువుకట్టమీద నిర్మించిన అక్కల గుళ్ళు (చిత్తూరు ప్రాంతం) (ద.)

**అగ్గారుపూజ** సప్తమాతృకలకు (ఏడుగురు కన్నెలకు) చెరువుగట్టుమీద పచ్చని రంగుపూసి, పాలపొంగలి అర్పించి పూజ చేయటం (ద,చి.)

**అగ్గి** ఎండ (కో.)

**అగ్గికురియు** మండిపోవు, ధరలు మండి పోతున్నాయనే అర్థంలో ధరలు అగ్గి కురుస్తున్నాయి (తె.)

**అగ్గిచూచు** కళ్ళెర్రజేసి కోపంతో చూడటం (క.)

**అగ్గితెగులు** వరితెగులు, చుట్టూ మట్టిరంగుతో బూడిదరంగు మచ్చలు ఆకులపైన ఏర్పడతాయి (క,నుడి.)

**అగ్గిదాకు** ఆకలికావటం, ముఖంవాడిపోవటం, బిడ్డలు అగ్గిదాకినారు (ద,తె.)

**అగ్గిదాహం** చాలాదప్పిక, ఆరనిదప్పిక(ద.)

**అగ్గినిప్పు** అగ్గికణిక, తీవ్రతను సూచించే జంటపదం, నిప్పుకు పర్యాయపదం విశాఖ, విజయనగర ప్రాంతాలలో (క,వ్యా.మ.భా.)

**అగ్గి పంతులు** ముక్కోపి, చాలాకోపం ప్రదర్శించే వ్యక్తి (తె)

**అగ్గిపిండం** చురుకైన స్వభావంకల వ్యక్తి, తీక్షణమైన స్వభావం ప్రదర్శించే వ్యక్తి (ద.)

**అగ్గిపిడుగు** చాలా సమర్థుడు (ద.)

**అగ్గిపెట్టడం** జగడం తెచ్చిపెట్టడం, పోట్లాట కల్పించటం (క.)

**అగ్గిబొద్దు** నిప్పుతో కాలుతున్న వెంటి,
ఎవి (క)

**అగ్గిరాముడు** బహుకోపిష్టి, దుర్మార్గుడు,
ంపు చేయడంలో సమర్థుడు (ద,క.)

**అగ్గివేయు** వంట ప్రారంభించు (క,నుడి.)
ాయిలో పిల్లిలేచింది అని అర్థం)

**అగ్గురారం** అగ్రహారం (తె,కో.)

**అగ్గువ** చవక, సమృద్ధి, తక్కువ ధరకు
ంచటం, అగ్గువఅయితే అంగడికి వస్తుంది,
ఎవఅయితే అందరూ కొంటారు-అని సామెతలు.

**అఘముడి** మొదలియర్లు అనే కులంలో
తెగ (ద.)

**అఘోరి** ఒంటరిగాడు, (క.)

**అంకటం** దక్కించు కోవటం, స్వాధీనమయ్యేట్లు
ంకోవటం (తె.)

**అంకడం** పట్టుబడటం, స్వాయత్తంకావటం
ో.)

**అంకణం** ఇంట్లో రెండు స్తంభాల మధ్య,
ా రెండు దూలాలమధ్య ఆవరించుకొన్న నివాస
ం, రెండంకణాల ఇల్లు (కో,ద,చి.)
న్నండడుగుల పొడవు ఆరడుగుల వెడల్పు
గి 72 చదరపు అడుగుల వైశాల్యం ఉంటే
టి కట్టుబడి స్థలమని నెల్లూరు జిల్లావ్యవహారం.
పై అంకణాలచోటు. వరసల ప్రాంగణాలతో
దే ఇల్లు. రెండంకణాలు ఇల్లు (కో.)

**అంకపొంకాలు** జ్వరబాధ, జ్వరంవల్ల పుట్టిన
ంం (ద.)

**అంకమ్మ** చూ. అంకాళమ్మ, గ్రామదేవత,
కమ్మ కొలువులు, (ద.) వ్యక్తినామంగా
డ గుంటూరుజిల్లాలో వినపడుతుంది.

**అంకమ్మ సోకాలు** ఊరంతా పోగయ్యేట్లు
పెద్దపెట్టున శోకాలు తీయటం. (కో.)

**అంకసిరి** అరవైయేళ్ళ తర్వాత వార్ధక్య
సూచకమైన, రోజులు తీరి పోతున్నాయని సూచన
చేసే ఒక వ్యాధి, నెల్లూరు, పొదిలి ప్రాంతపు
వాడుక (ద.)

**అంకాతాపా** కోపతాపాలు (క.)

**అంకాళమ్మ** చూ. అంకమ్మ ఒక గ్రామ
దేవత (కో.)

**అంకిళ్ళు పడు** నక్కిళ్ళు పడు, అంకిళ్ళు
స్వాధీనంలో ఉండక పోవటం. "అంకిళ్ళు పడ్డ
తర్వాత అరిశెలు తింటావా అత్తా అన్నట్లు" అని
కోడలు అత్తమీద ప్రేమ చొలక బోయడం అనే
ఈ సామెత నుడి కడలిలో మారేపల్లి నమోదు
చేశారు (క,కో.)

**అంకు** అంకె, ఒకటి రెండు మొదలుగా లెక్క
పెట్టు (తె.)

**అంకువలు** తాలువులు, అంకిళ్ళు (ద,నె.)

**అంకె** స్వాధీనం, లొంగుబాటు (కో,తె,రా.)

**అంకెం** పొగాకు కట్ట, బేలు, గోనెసంచి,
గోతం (క,ద,కో.) నలభై మానికల ఘన
పరిమాణం (కో.) రెండు బస్తాలు కలిపి కట్టినది,
గోనెకి అంకెలు లాభం వేశాడు (క.)

**అంకెళ్ళు** గొర్రె చెక్కలకు తగిలించి ఉండే
కొక్కెలు (ద.)

**అంగ** అచ్చగా (క.)

**అంగడం** నేర్పు లేనివాడు, వాడు ఒక
అంగడం (తె,కరీం.)

**అంగడాలు** పశువులు (క.)

**అంగడాలుగ** పోకిరిగా, హద్దు పద్దు లేకుండా
(కో.)

**అంగడి** వీధిగది, బజారు మీది కుండే కచ్చేరి గది (క.)
అల్లరి, అల్లరి పిల్లలు అంగడి చేశారు (తె.)

**అంగడి లెట్టకు** అటూ ఇటూ వస్తువులు పరిచి ఉంచకు (తె.)

**అంగమణి** వివాహ సమయంలో వరుడి విడిదికి పంపే పదార్థాలు, పాత్ర (రా.)

**అంగము** రూ. హంగాం, కడప, చిత్తూరు ప్రాంతాలలో పండ్లచెట్ల మొదటి పంటకారు, ఈ ప్రాంతంలో పండ్ల చెట్లు ముక్కారు ఫలిస్తాయి. రెండో కాపు గైరంగం, మూడో కాపు ఎడకారు చూ. ఎడకారు, గైరంగం (రా,ద.)

**అంగము దప్పు** సిగ్గు, భయము మొదలైన వాటిని వదిలి పెట్టు (రా.)

**అంగ రంగ వైభవం** ఉత్సవాదులలో దేవాలయాలలో చేసే అలంకారం, సంపన్నత, ఒంటికి ఇంటికి చేసుకొనే అలంకారం (కో,రా,ద.)

**అంగరిల్లు** తలుపులు, తాళం మొదలైనవి లేని ఇల్లు (ద.)

**అంగలు పంగలు** త్వరత్వరగా ఒక చోటికి పోవటం, రావటం (కో.)

**అంగలం** ముంగిలి (తె.)

**అంగలార్చటం** దుఃఖించటం (కో,తె.)

**అంగడి** దుకాణం (కో,తె,రా.)

**అంగామా** గలాభా, గందరగోళం చాలా అంగామా జరుగుతున్నది (తె.)

**అంగామీ** వర్షాలు ఎక్కువగా కురిసిన సంవత్సం చూ. గైరంగామీ వర్షాలు అసలు కురియని సంవత్సరాన్ని గైరంగామీ అంటారు, చెరువులు కుంటలు నిండని సాలును గైరంగామీ అంటారు, అనావృష్టి సంవత్సరం (తె.)

**అంగాము** మార్పిడులకాలం చూ. హంగాము (తె.)

**అంగారు** చాదు, బొట్టెపెట్టుకొనే నల్లటి పదార్థం (క.)

**అంగి** చొక్కా (తె,కో.)

**అంగీ** కాళ్ళవరకూవచ్చే పొడవైన చొక్కా, చొక్కాయి, కమీజు, జుబ్బా అనికూడ వేరు ప్రాంతాల వ్యవహారం ఉంది (క.)

**అంగు** రూ. హంగు పద్ధతి, స్వాధీనము, వీలు, ఉపాయము (తె,క.)

**అంగుడుముల్లు** చిన్నపిల్లల మొలకు కట్టే ఒక నగ, అలంకారం (క.)

**అంగుకొనె** ఊరకనే (క.)

**అంగులు** డబ్బు (క.)

**అంగుష్టనిషాని** వేలి ముద్రలు (తె.)

**అంగూర్** ద్రాక్ష (తె.)

**అంగే** ఓసే అనే విధంగా సంబోధన (తె.)

**అంగోత్రపు పొట్ట** ఎంత తిన్నా బయటకు కనిపించని పొట్ట (కో.)

**అచార్లు** ఊరగాయ పచ్చళ్ళు (తె.)

**అచిత్తు** జబ్బుచేసి ఒంట్లో సత్తువక్షీణించిన స్థితి, రోగ దౌర్బల్యము (ద.)

**అచ్చంగా** పూర్తిగా, స్పష్టంగా, యథాతథంగా, స్వయంగా (కో,ద,క.)

**అచ్చన గాయలు** చిన్న చిన్న గులక రాళ్ళు చిన్న చిన్న కుప్పలుగా పెట్టి ఒకరాయి పైకి ఎగరేసి అది మళ్ళీ కిందికి వచ్చేలాగా కింద ఉన్న ఒక కుప్పను వొడిసి పైనుంచి పడే రాయితో సహా అరచేతిలో పట్టుకొనే బాలక్రీడ. చిత్తూరు మండలంలో ఈ ఆటను పల్లంచి అంటారు. (కో,క.)

**అచ్చుమ్మ పనస పండు** బాగా ఉరువైన పనస పండు, చక్కగా పక్వానికి వచ్చినది (క,నా,యె.)

**అచ్చురాలు** పిల్లలకు వచ్చే ఒక గొంతు జబ్బు (ద,నె.)

**అచ్చాజీ** పెద్ద మనిషి, సత్ప్రవర్తనకు, శీల సంపదకు పేరు పడ్డ వ్యక్తి (క,కన్యా.)

**అచ్చింతలు, అచ్చెంతలు** అక్షతలు (తె.)

**అచ్చి ఉండు** ఋణపడి ఉండు, బాకీ ఉండు (క.)

**అచ్చిరావటం** లాభించటం, కలిసిరావటం (కో,ద,రా,తె.)

**అచ్చు** తిరగలి రాతిలో ఉండే మేకు, పిడి (ద,రా.)
నేతనేస్తూ నూలు పోగులు అతికినది (ద.)

**అచ్చు కట్టుగా** చక్కగా దిద్ది తీర్చినట్లుగా (తె.)

**అచ్చుకొను** చెల్లించు, పూటపడు (క,రా,ద.)

**అచ్చుపాటు** అచ్చిరావటం, కుదురు పాటు (ద,తె.)

**అచ్చుపాలు** అనుకూలం (కో.)

**అచ్చుబోయు** కుదిరికగా ఒక పనిని నిర్వహించు, చక్కగాచేయు (తె); స్వేచ్ఛగా విడిచిపెట్టు (కో.)

**అచ్చుమాను** భూమిని చదునుగా చేసి, కయ్యలుగా చేసే సాధనం (క.)

**అచ్చువేయు** గ్రామంలో మంచి కోడెదూడెను చూసి అంబోతుగా దానిని విడిచిపెట్టు, ఒక వ్యక్తి హద్దుపద్దు లేకుండా వ్యవహరిస్తూ ఉంటే వాడి విషయం పట్టించుకోకుండా ఉండు (ద,కో.)

**అచ్చుబోసిన ఆబోతు** దేవరెద్దు, బసవెద్దు (ద,చి.)

**అచ్చకాలు బుచ్చకాలు** ఇద్దరిమధ్య ఒకరిపట్ల ఒకరికి లాభించే అనుకూలతలు. వాళ్ళిద్దరి మధ్యా అచ్చకాలు బుచ్చకాలు (తె.)

**అచ్చరు** గంజి వార్చకుండా ఉడికించినది, అత్తెసరు, పిల్లలకు పొద్దున్నే అచ్చరు పెట్టిరి (తె.)

**అచ్చా** మంచిది, సంతోషం– అని అంగీకారాన్ని సంతోషాన్నీ ప్రకటించే పదం (తె.)

**అజ** భోగట్టా, సమాచారం, సంగతి (కో.)
**అజ అయిపు** జాడ, ఉనికి అజాపజా అని కోస్తా వాడుకలో ఉంది (తె.)

**అజగజాంతరం** బొత్తిగా పొందికలేనిది, చాలా అంతరం కలది, అజం అంటే మేక, గజం ఏనుగు (రా,ద.)

**అజలేదు** లక్ష్యం లేకపోవటం, నిర్లక్ష్యం (కో.)

**అజాపజా** అయుపూ ఆనవాలూ, చిరునామా ఉనికిని గూర్చిన వివరం, జాడ (కో.)

**అజీలుగా** సర్వదా, సంసిద్ధంగా (ద,రా.)

**అజ్జా** అంచనా (క.)

**అజ్జాపడు** దొరకు, బోధపడు ప్రయత్నపడు, సిద్ధపడు (క,నుడి.)

**అజ్జాయించు** ముందువెనుకలు ఆలోచించు (ద.) ఓర్చుకొను (కో.)

**అజ్జాయింపు** ఉజ్జాయింపు, అజ్జాయింపుగా చెప్పాను (క,నుడి.)

**అజ్జి** మొండి (రా.)

**అజం** తరచుగా, సదా, ఎల్లప్పుడు (ద,నె.) ఆయన అజంగా ఇక్కడికి వస్తూ ఉంటాడు.

అంచ మెట్టు, పడికట్టు (ద,చి.)

**అంచన** అజ్ఞాయింపు (క,నుడి.)

**అంచనాలు** పంటల పరిమితి తెలియచెప్పే పదం (క.)

**అంచిన** తరువాత (ద,చి.)

**అంచీలు** మెట్లు, చీడీలు (ద.)

**అంచుకట్టు** అనుకూలమగు, ఆ విషయం అంచుకట్టుకొని వస్తున్నది, కురుపు చెక్కుగట్టు, మాన్పుకివచ్చు (తె.)

**అంచుకు** నంచుకోవటానికి అన్న అర్థంలో (తె.)

**అంచున** సమీపంలో, వద్ద (రా.)
నా అంచున ఏమీలేదు

**అంచెబుట్టి** ఎక్కువ లోతులేకుండా వెడల్పుగా అల్లిన బుట్ట (తె.)

**అంచెలు** వరుసలు (కో,రా.)

**అంచోడించు** ముందు వెనకలాడు (తె.)

**అంజ** అంగ, ఒక అడుగుకు, ముందుకు చాచిన మరో అడుగుకు మధ్యదూరం, కొలత (రా.)

**అంజనకప్పు** పోయిన వస్తువుల ఉనికి చెప్పటానికి మంత్ర తంత్ర ప్రయోగాలు మాకు తెలుసునని చెప్పే వ్యక్తులు తమలపాకుపై కాటుక పులిమి సిద్ధంచేయు, అంజనంవేయు (ద,చి.)

**అంజలు** పెద్దపెద్ద అంగలువేస్తూ నడవటం (ద.)

**అంజీ** రూ. అమిజి, అంజి (ద.)
వంతుపని చేయడానికి వచ్చినవాడు, గ్రామాల్లో సాముదాయికంగా చేయాల్సిన పనుల్లో తనవంతు పని చేయాల్సిన వ్యక్తి, వంతు పర్యాయము (తె.)
కాలికి అలంకారంగా ధరించే అందెవంటి ఆభరణం (కో.) ఉచితం, ప్రయత్నం లేకుండా వచ్చినది (ద,చి.) పేనా అంజీగా వచ్చింది.

**అటుక** ఇళ్ళలో పైకప్పుకి కిందిభాగాన సామానులు మొదలైనవి పెట్టుకోవటానికి చేసిన ఏర్పాటు, దూలాలతో పూర్వకాలం నిర్మించిన ఇళ్ళలో ఆ దూలాలమీగ చెక్కలు పేర్చి దీనిని నిర్మించడం జరిగేది (ద,కో.)

**అటకాయించు** ఆటంకపరచదు, ఎదిరించు, అడ్డుపెట్టు (కో,తె,ద.)

**అటువ** రూ. అట్టవ, అటక (రా.)

**అటావలెల్లుండి** ఎల్లుండి తరువాత ఆవలెల్లుండి. ఆ తరాత రోజు అటావలెల్లుండి (కో, తె.)

**అటిక** రూ. అటికె. వెడల్పైన మూతిఉండి కూరలు వండటానికుపయోగించే మట్టిపాత్ర (కో, తె,రా.)
అటికెలబెట్టి పుటికెల వెదికినట్లు అని వరంగల్లు ప్రాంతం నుడికారం.

**అటికమామిడాకు** అనుకూరగా దీన్ని ఉపయోగిస్తారు (ద,చి,నె.)

**అటికలు** కుండలు (నె.)

**అటిటూ** అటూ యిటూ (రా.)

**అటుకాని ఇటుకాని** ఆదిక్కు ఈదిక్కు, అటువైపు ఇటువైపు (క.)

**అటును** అటక (రా,ద.)

**అటుకులగొలుసు** అటుకుల వంటి చిన్న చిన్న బంగారు బిళ్ళలతో చేసినగొలుసు (కో.)

**అటువ** చూ. అటక, అట్టవ

**అటూటు** అవతలికి (రా,కర్నూ.)

**అటెంక** ఆవెనక, ఆతర్వాత (తె.)

**అట్ట** సందులేకుండా తలలోపుండ్లు లేవడం గాని, ఒంటిమీద పొక్కులు, చెమటకాయలు లేవడంగాని జరిగినపుడు అట్టగా పేలినది, పుండ్లుఅట్ట కట్టినది (కో,ద.) వెంట్రుకలన్నీ ఒకే చిక్కుగా మెలిపడిపోయి జడ అంట గట్టడం (కో.) పుస్తకానికి గట్టికోసం వేసే దళసరి ఆచ్ఛాదన పత్రం (కో,రా,ద,క.) తలలో మురికి పేరుకోవడం (కో,ద,క.)

**అట్టక** ఇంటికప్పుకు కిందిభాగంలో సామాను లుంచుకోవడానికి ఏర్పాటు (ద,చి.)

**అట్టడి(ది)** అటక (తె.)

**అట్టపుట్టానవాళ్ళు** ప్రారంభంనుంచీ, మొట్ట మొదటినుంచీ (కో,క,నుడి.)

**అట్టం** వేదంలో ఒకభాగం (క.)

**అట్టవ** వేదిక, మచ్చు (రా.)

**అట్టవేయు** పుస్తకం చిరిపోకుండా దళసరి సాధనంతో రెండు వైపుల గట్టిగాకుట్టు (కో,ద, రా,తె.)

**అట్టాము** బండిమీద అమర్చిన కంపమోపులు (ద,నె.) కింద యీడ్చుకొంటూ తీసుకొనిపోయే కంపమోపును తొడుగు అంటారు. చూ. తొడుగు.

**అట్టిట్టుచేయు** పట్టించుకోకుండా ఉపేక్షించు (తె.)

**అట్టిపెట్టుకొను** ఒకవస్తువును తనకై తానే ఉంచుకొను (కో.ద.)
గట్టిగా హత్తుకొని యుండు (ద,క.)

**అట్టీలు** పిల్లల అల్లరి (క.నుడి.)

**అట్టు** బియ్యపుపిండి మొదలైన పదార్థాలు తడిగా పెనం, పెంకు మొదలైన వాటిమీద, నూనె వేసి కాల్చిచేసే ఖాద్యము, దోసె, పెసరట్టు, రవ్వట్టు మొ॥నవి. అట్లతద్దె అనేనోము ఉన్నది (కో,తె,క.ద.)

**అట్టుడికినట్లు** తీవ్రమైన వేదనపడటం (ద. నె.) ఏదైనా వార్త, విషయం, విశేషం, ఆనోట ఆనోట అందరూ చెప్పుకోవటం (కో,తె.)

**అట్టపుట్టాణాళ్ళు** అట్టపుట్టానవాళ్ళు, మొట్ట మొదటినుంచీ (కో.)

**అట్టుప్పు** పశువులు తాగే నీళ్ళలో కలిపే ఉప్పు, అంటే అంత మేలైనదికాదుకాదు, వాడికి ఈఊళ్ళో అట్టుప్పు గూడా పుట్టదు (తె.)

**అట్టులెక్క** నాటకాలలో వేషాలు ధరించు (రా,అ.)

**అట్టువ** నాటక రంగస్థలం; బీరువా మొదలైన వాటిలోని అంతస్తుపలక (రా,అ.)

**అట్లెడ** వంతెన (ద,నె.)

**అట్టెము** రాతివిగ్రహాలు బిగుతుగా ఉండేందుకు లక్క మొదలైనవాటితో చేసిన బంధం (తె.)

**అట్లపుల్ల** అట్లకాడ, పెనంమీద పోసినఅట్టును అటుఇటు వేయటానికి, ఇవతలకు తీయటానికి ఉపయోగించే సాధనం (క.)

**అట్లు** అరిసెలు (రా,అ.)

**అడ** రేగుపండ్లు మొదలైనవాటిని ఉప్పుచేర్చి తొక్కి గారెలవంటి చక్రాలుగా చేసి ఎండబెట్టి నిలువఉంచుకొనేది (కో,ద,నె.)
బెల్లంకలిపి పోసిన దోసె, చాప(టి)ట్టు (రా,అ.)

**అడంగు** గమ్యస్థానం, ఒడ్డు, మూలస్థానం (కో.) వతను (క,నుడి.)

**అడంగులు** తెలుసుకోవటానికి వీల్లేనిస్థితి, లోపల ఉదా: వా. ఆకాగితం అడుంగుల్లో పడింది (రా,అ.)

**అడకొత్తు** అడకత్తెర, వక్కలు(పోకలు) కత్తిరించే కత్తిర.

**అడగారు** అడుగంటిపోవు, అణగారు (ద,కో, రా,క.)

**అడప** ఒకవిధమైన వాసములకట్టు (కో.) బరువైనది (ద,నె.)

**అడపదడప** అప్పుడప్పుడు అడపాదడపా (ద,రా.) పనిని ఛిన్నాభిన్నం చేయటం, ఆపని అడపదడప చేసిపోయినాడు (ద,నె,తె.) చాలా సార్లు (రా,అ.)

**అడపం** మంగలి కత్తులు పెట్టుకోనే సంచి (ద.)

**అడపాదడపా** అప్పుడప్పుడు (కో,క,ద,నె.)

**అడపాసు** చెప్పులజోడు (ద,చి.)

**అడపాసు వెధవ** చెప్పులకు కూడ సాటిరాని అప్రయోజకుడు (ద.చి.)

**అడపు** దెబ్బ చరుపు (క.)

**అడపొద** జాడ, ఉనికి, ఆనమాలు రూ. అడాపొడా (కో.)

**అడభంగరం** అక్రమం (తె.)

**అడమానం** రూ. అదుమానం, తనఖా, తాకట్టు, అడుమానం (ద,చి.)

**అడమానంకూలి** చూ. అధీనంకూలి (రా,అ.)

**అడలు** ముద్దగట్టిన చింతపండు (కో.)

**అడలు గట్టడం** జబ్బుచేసి మంచంలో ఉన్న రోజుల్లో జుట్టు అట్టకట్టి పోవటం (కో.)

**అడవ** కిరుగు, మేలుసరుకు కానిది, వ్యర్థమైనది వసూలు కాక అడవసరుకు ఉండి పోయింది (రా,అ.) వీధి భాగోతంలో భామ వేషం ప్రదర్శించే లాస్యం, బాగా అడవ దొక్కింది (ద,నె.) వరుస రాని బాకీలు (తె.) పుంస్త్వం లేని లక్షణం (ద,చి,రా.) లొంగి పోయినది (ద,చి.)

**అడవందరం** దిక్కు మొక్కు లేని, అనాధ తనం, అబందరం (తె.)

**అడవా బడటం** బాకీ వసూలు కాకుండా మొండికి పడటం (కో.)

**అడవా సరుకు** అడ వారకం, పనికి మాలిన సరుకు (కో.)

**అడావడి** రూ. అడావుడి తొందర పాటు, తొందర (కో.)

**అడావా** ఖాతాలో జమా కర్చులు సరిచూసి దేనికది వేరు పరచుట (తె.)

**అడావుడి** తొందర పాటు (తె,ద.)

**అడుసు** పాతదై పనికిరానిది అడాసు బండి (ద,నె.)

**ఆడి** ఎద్దును గాని కుక్కను గాని హెచ్చరించే సందర్భంలో ఉచ్చరించే పదం (తె.)

**అడిగంట్లు** మెట్ట గ్రామాలలో పాతళ్ళలో నీరు దిగినప్పుడు చెడి పోయిన అడుగు ధాన్యము

**అడిగట్టి** పూరిళ్ళలో కప్పుకు అడుగు భాగంలో ఉంచే ఆకు కట్టలు, బందేడాకు మొదలైనవి (ద.)

**అడిచినుకు** పొడిచినుకు ముసురు పట్టిన సమయంలో ఇటు విడువ కుండాను అటు కురువ కుండాను · అప్పుడో చినుకు అప్పుడో చినుకుగా వాన పడుతూ ఉండటం (కో.)

**అడితీ** కర్రలు, కలప అమ్మే అంగడి (కో.)

**అడిదెకొచ్చిన** ఉత్త పుణ్యానికి లభించిన

**అడిలి పోవడం** హడిలి పోవడం (క.)

**అడివాకు** పొలానికి ఎరువుగా వేసే పచ్చిఆకు (ద.)

**అడివితలు** అడవి ప్రాంతం. ఆ ఊరు దాటితే అతా అడివితల (ద,నె.)

**అడివివరం (అడివారం)** కొండ కింది ఊరు, వైష్ణవాగ్రహారం (ద,క.)

**అడిసి** ఒడిసి, ఆక్రమించి పట్టుకొని (క.)

**అడు** కొట్టు, అంగడి (రా.)

**అడుకొన్నవాడు** భిక్షుకుడు, బిచ్చగాడు (క,ద.)

**అడుగంటు** నాశనమైపోవు, మాడిపోవు (తె, ద,నె.)

**అడుగడుగు దండాలవాడు** వేంకటేశ్వర స్వామి, పదే పదే స్తుతించి పబ్బము గడుపుకో వలసిన వ్యక్తి (ద,కో.)

**అడుగవచ్చు** పెళ్ళి సంబంధం చూడటానికి వచ్చు, మనువు నిశ్చయించటానికి వచ్చు (అ,ద.)

**అడుగు** పొద్దు నీడ నేలమీద ఒక అడుగు జరగటానికి పట్టే కాలము (ద,నె.)
గౌరవించు, చిందు అనే నృత్యభంగిమ (తె,ద.)
క్షేమ సమాచారం విచారించటం (క.)

**అడుగునబడు** వెనకబడిపోవు, ఉపేక్షపాలగు (తె,ద.)

**అడుగుపడు** పాత్రల అడుగు రంధ్రము పడు (ద,నె.)

**అడుగు బొడుగు** పాత్రలో మిగిలి పోయినది, శేషించినది (తె,కో,ద.)

**అడుగుమట్ట** కట్ట కడపటి స్థాయి, దిగుప ప్రదేశము (ద,నె.)

**అడుగులకు మడుగులొత్తు** అమిత భయ భక్తులతో గౌరవించు

**అడుగులు** రాగిపిండితో సంకటి చేసేటప్పుడు దానితో కలిపి వండే బియ్యము లేదా జొన్నలు మొదలైన వాటి నూకలు (రా,తె,ద.) కళ్ళంలో గాని ఇంట్లోగాని చివరకు మిగిలే గింజలు (తె.)
గంజికుండలో కింద అతుక్కొనిపోయిన మెతుకులు (ద,నె.)

**అడుగువేయు** ముందు కుపక్రమించు, నాట్యం చేయు (తె,ద.)

**అడుగోలు** ఒప్పందం (ద,చి.)

**అడుదిడ్డగ** క్రమం లేకుండా (క,కో.)

**అడుమానం** ఆస్తిని తాకట్టు బెట్టటం, తనఖా (ద.)
చూ. స్వాధీనాడుమానం, చూపుడు అడుమానం అని ఇది రెండు విధాలు. మొదటి దానిలో అప్పిచ్చిన వారే ఆస్తికి అనుభవకర్తలు. దీనికి వడ్డీలేదు. రెండోదాని విషయంలో ఋణదాతకు అనుభవ హక్కులేదు, వడ్డీ ఉంటుంది (ద,చి.)

**అడువు** దట్టం, సాంద్రం పైరు అడువైంది (రా,అ.)

**అడుసుపుండు** కాలివేళ్ళ మధ్య బురదలో తిరుగాడేటప్పుడు ఏర్పడే పుండు, నీటిచిలువలు (ద,చి,నె.)

**అడుసుపుల్లలు** మడి కోసిన తర్వాత దున్నినప్పుడు లేచే పుల్లలు (ద,చి.)

**అడుసువేయు** మట్టి మిద్దెలకు పై భాగంలో బంక మట్టితో పూయటం.

**అడేజావ్ బడేజావ్** నిర్లక్ష్యము (కో.)
దర్జా, వైభవప్రదర్శనం, దర్పం (తె.)

**అడ్డ** పశువులు, బండ్లు నిలిచిఉండే స్థలము కూలిపని నిమిత్తం మనుషులు నిలిచి ఉండేస్థలం రెండు మానికలు, కుంచంలో సగం (కో.)
ఒక విధమైన పాత్ర, బండి పట్టా ఆకులకు మధ్య నుండే కొయ్య (కో,ద.) బండి ఇరుసుమీద అడ్డంగా బిగించిన పెద్దకొయ్య మొద్దు (ద,నె.)
కట్ట, ఉదా: కాలువకు అడ్డవేసినారు (ద,చి.)
దున్నిన తరవాత చదరం చేయటానికి ఉపయోగించే సాధనం ఉదా. చేనుదున్ని అడ్డతోలినాము (ద,నె.)

**అడ్డంగ అయినావు** స్థూలకాయ మని చెప్పటానికి ప్రయోగం, లావుగా ఉన్నావు, లావెక్కినావు అనటానికి ప్రయోగం (తె.)

**అడ్డకచ్చ** మడికట్టుకొనే సందర్భంలో కట్టుకొనే పంచె కట్టు (క.)

**అడ్డకట్టు** దక్షిణ దేశంలోని తమిళుల వలె గోచి పోయకుండా కట్టిన పంచెకట్టు (ద.నె,తె.) వితంతువు కట్టిన కట్టు (కో.) వరి మళ్ళలో నీరు నిలిచేందుకు గాను అడ్డంగా వేసేచిన్న మట్టికట్ట (రా.)

**అడ్డకట్టుపంచె** పూర్వకాలపు వితంతువుల వస్త్రధారణ రీతి (కో.)

**అడ్డకాలు** ఆటంకం, ఆ పనికి అడ్డకాలు పడింది (తె.)

**అడ్డగ** అణాలు, బేడలు వినియోగంలో ఉన్నప్పటి ద్రవ్యమానం, బేడకాసు (ద,చి,రా.)

**అడ్డగర్ర** సుఖవ్యాధి, ఒడిసెగడ్డ (కో,ద.)

**అడ్డగలకలో బుడ్డగలక** ఒక ఇబ్బందిలో మరొక ఇబ్బంది (తె.)

**అడ్డగాడిద** వ్యర్థుడు, వ్యర్థంగా అంటే ప్రతిఫలంలేకుండా పనిచేసేవాడు, పనిలేకుండా ఊరికే తిరిగేవాడు (కో,ద,రా.)

**అడ్డగొడ్డు** అంగసౌష్ఠవంగల గొడ్డు, జంపు నిలువు ఉండి బలంలేని పశువు (ద,నె.)

**అడ్డగోలు** లక్ష్యంలేని, జాగ్రత్తలేని (కో.)

**అడ్డచాకిరీ** విపరీతమైన పని, అరవచాకిరి, ఎక్కువపని (తె.)

**అడ్డదిడ్డం** రూ. అడ్డాదిడ్డం క్రమంలేకుండా, అటూ ఇటూ కాకుండా, వరసలేకుండా పనిచేయటం, వ్యతిరేకత సూచిస్తూ మాట్లాడటం (కో,రా,ద.)

**అడ్డధావతి** లుంగీ, అడ్డపంచె (రా.అ.)

**అడ్డపడటం** ఆదుకోవటం, సహాయపడటం (తె,కరీం.)

**అడ్డపాటు** పనికి భంగంకలగటం, పని ముగియటం, నిలిచి పోవటం (తె,కరీం.)

**అడ్డపైన** శరీరంలో నడుముకి పైభాగం అని ప్రసక్తం చేసే సందర్భం, అడ్డపైన నీళ్ళుపోసి కడుక్కున్నాను, అంటే ముందుకి వంగి కట్టుకొన్న బట్ట తడవకుండా రొమ్ము, వీపు నీళ్ళతో కడుక్కోవటం (ద,నె.)

**అడ్డపొగ** కాలుతున్న చుట్టను నిప్పువైపు నోటిలో పెట్టుకొని విడిచేపొగ (క,చి.)

**అడ్డపోతు** ధాన్యం నురిసిన వెంటనే గల్ల పొట్టుతో కూడాచేర్చి పొడుగ్గా పోసిన ధాన్యరాశి. చూ. అగ్రాని (తూర్పార పట్టిన తర్వాత గుండ్రంగా పోసేరాసి) (ద,నె.)

**అడ్డబాల** అడ్డపాప, దోగాడే శిశువు, చిన్న పిల్ల (ద,నె.)

**అడ్డబాస** స్త్రీలు ముక్కుకి అలంకారంగా పెట్టుకొనే నగ, ముంగర, ముక్కెర, (కో,క.)

**అడ్డమాలినవాడు** కొరగాని వాడు, నిష్ప్రయోజకుడు (క.)

**అడ్డమాపులేకపోవడం** ఏ విధమైన క్రమశిక్షణలో ఉంచేవారు లేక పోవటం

**అడ్డముపెట్టు** తాకట్టుపెట్టు కుదువబెట్టు (తె, కరీం.)

**అడ్డమైనవాడు** అనామకుడు, ఏ విధమైన ప్రస్తుత సంబంధం లేనివాడు, అసందర్భంగా కలగజేసుకొనేవాడు (తె,ద,కో.)

**అడ్డవేలు** బొటనవేలు (తె,కరీం.)

**అడ్డసరి గడ్డలు** గజ్జలలో పుట్టే మేహ సంబంధమైన గడ్డలు, అడ్డ కర్రలు, సుఖవ్యాధి చిహ్నాలు (తె,కరీం.)

**అడ్డాకుల తీగెలు** చూ. అడ్డాకులు.

**అడ్డాకులు** తామరాకుల వంటి ఆకులు. అడవులలో లభిస్తాయి. తీగలుగా పెరిగే వాటికి ఈ ఆకులు ఉంటాయి. విస్తళ్ళుగా, ఫలహారాలు కట్టటానికి ఉపయోగిస్తారు. (కో,క.)

**అడ్డాదిడ్డం** చూ. అడ్డదిడ్డం.

**అడ్డాలి** అంబాడే శిశువు, దోగాడే పాప (క.)

**అడ్డాల బిడ్డ** తల్లిపాలు విడవని బిడ్డ (ద.)

**అడ్డాలు** ఒడి, దగ్గరగా చేర్చిచాచిన తొడలు. నిప్పుకొచ్చినమ్మా మా బిడ్డ నొకసారి అడ్డాలలో వేసుకొని మరీవెళ్ళు అని మారే పల్లి వారి సంకలనం లోని సామెత, అడ్డాల్లో బిడ్డలు గాని గడ్డాలొచ్చాక బిడ్డలా అని కోస్తా ప్రాంతం సామెత (క,కో, నుడి.)

**అడ్డిగ** స్త్రీలు ధరించే కంఠహారం, మెడలో ధరించే నగ, రాళ్ళఅడ్డిగ (ద.నె,రా,తె.) జిగిని గొలుసు (ద,చి.)

**అడ్డిగలము** నేలమీద అలముకొనే ఒకరకమైన గడ్డి (రా,అ.)

**అడ్డిసేరు** రెండుసేర్లన్నర, రెండున్నర సేర్ల పరిమాణం (తె,కో.)

**అడ్డి** పొలంలో గనుము తెగినపుడు వేసే అడ్డుకట్ట (కో.)

**అడ్డిగలు** చూ. అడ్డిగ

**అడ్డుపడు** ఆపదలో ఉన్న వ్యక్తికి ఆసరాగా నిలుచు, మధ్య వర్తిత్వము నెరపు (క.)

**అడ్డుపుల్ల** అసందర్భంగా కల్పించే ఆటంకం, పనిజరగకుండా చేయటానికి కల్పించిన ఆటంకాలు (కో,ద.)

**అడ్డెన్నుపడు** వరి వెన్ను బాగా పెరిగి వాలటం (రా,అ.)

**అడ్రాసి** గుండ్రంగా పోసిన పెద్ద ధాన్యపు రాసి చూ. అడ్డపోతు

**అడ్లు** ధాన్యం, వరిధాన్యం, వడ్లు (క.)

**అణక గొడ్డు** శరీరంలోని ముందటి జబ్బ చూ. అనికె (తె.)

**అంట** విస్తరి (కో,రా,తె.) చూ. అంటు

**అంటకాడు** ఆడదానిని మరగి విడవకుండువాడు (క,నుడి.)

**అంటట్టుకుపోవు** చాలా చిక్కిపోవు (క.)

**అంటబెరుకు** కాలితో తన్ను, తీవ్రంగా సంభాషించు (తె.)

**అంటరానూది** అయస్కాంతపు సూది (నుడి.)

**అంటలు** విస్తళ్ళు, ఒకేజడగా అట్టకట్టిన వెంట్రుకలు (ద,నె.)

**అంటసాలగు** ప్రియురాలగు, వానికి అంటసా అయింది. (క,నుడి.)

**అంటి** అరటి (ద,చి.)

**అంటించింది** తేలు మొదలైనవి కుట్టినపుడు అంటించింది అనటం ఉంది (కో,ద.)

**అంటించు** కొట్టు, అగ్గిపెట్టు, కొండేలు చెప్పు (తె.) దెబ్బలు కొట్టు (క.)

**అంటింపించు** అతికించు (కో,క.)

**అంటు** విస్తరగా కుట్టిన మోదుగ, మర్రి మొదలైన ఆకుల కూర్పు (ద,తె.), బంక (రా.) పాలపిడతలో అడుగంటిఉండే తెల్లని పదార్థము, గోకుడు (కో.) అన్నపు మెతుకులు ఇతర వస్తువులపై గాని, ఇతరపదార్థాలతో గాని అంటుకోవటం, అంటు, సొంటు, బహిష్ఠు (కో,ద, తె.) కూరగాయలు గాని లేదా మాంసంగాని వండినపుడు పాత్రలో అడుగంటి ఉండేరసం (ద,నె.)

**అంటుజోడు** వెనకటి కాలంలో సిరిగల మగ వారు చెవులకు ధరిస్తూ వచ్చిన అలంకారం, కర్ణ భూషణం, స్త్రీలు ధరించిన దానిని కమ్మ అనేవారు (ద,తె,కో.)
కోస్తా జిల్లాలవారు స్త్రీలు ధరించే భూషణానికి కూడా అంటుజోడు అనటం కద్దు

**అంటుడుగాడు** తల్లిని అంటిపెట్టుకుని ఉండే శిశువు (కో.)

**అంటుతిరుగలి** ఆళ్ళధాన్యం విసరటానికి రెండు రాళ్ళకు బురద పూసి, ఆరబెట్టిన తిరుగలి (ద,నె.)

**అంటుపడు** బహిష్ఠఅగు, ఎంగిలియగు (కో, రా,క.)

**అంటుపోగు** చెవికమ్మి, పురుషులు ధరించేది (కో,ద.)

**అంటుముట్టు** బహిష్ట తాలుకు మైల, అంటు ముట్టు తగులరాదు (ద,చి.)

**అండ** ఆదరణ, సహాయం, ఆశ్రయం, ప్రక్క వెనుక, గోడపెల్ల ఉ॥ అండలుంటే కొండలు దాటవచ్చు, వెడల్పు మూతగల లోహపాత్ర (ద, నె,రా.తె.) మకాములేదా ఆశ్రయ స్థానం ఉ॥ ఆ ఊళ్ళోఅండా పెట్టినాడు (తె,క.) వెడల్పైన గనిమను చక్కగా చెక్కుట, బావి వెడల్పుగా తవ్వటానికి తంతెగా ఉంచి తవ్వే సాధనం ఉ॥ అండచెక్కారు (ద,నె,చి.) ఉ॥ పెద్ద అండబెడితే కష్టం, చిన్న అండబెట్టి తవ్వు

**అండీ** చూ. అండ, లోహపాత్ర (క,చి.)

**అండీలు** వీధిబడి హాజరుపట్టీ, సిరి, చుక్క, ఒకటి, రెండుగా లెక్కపెట్టి ఎన్నో అంకె కిందికి వస్తే అన్ని దెబ్బలు కొట్టటం రివాజు (రా,అ,)

**అండెం** అంకెం (పొగాకు, మిరపకాయలు, కట్టే గోతాలకు మాత్రమే వ్యవహారం), 40 మాని కల ధాన్యం (కో.)

**అండెనదండెన** అదుపూ, ఆజ్ఞా, హద్దు పద్దూ. ఉదా: దానికేమీ అండెన దండెన లేదు (కో.)

**అండ్ల** అక్కడ, ఆచోట, అందులో, దానిలో (తె.)

**అణపు** సాకు, మిష, దాపుడు (తె.) ఉదా. తమపైకి రాకుండా వాళ్ళు అణపువేసినారు.

**అణుకు** రూ. అనుకు (రా.) జారుగాఅయి పిండిచాలని స్థితి, ఉదా: అనుకైనది, పిండిచాలలేదు.

**అణ్ణ** తండ్రి, అయ్య (ద,రా.)

**అతక** బాగాఅరిగిపోయిన చెప్పు (ద.నె.)

**అతకరించు** ఏదో ఒకవిధంగా సరిపెట్టు, వదులోదులుగా ముడివేయు (ద.నె.)

**అతకలుచచ్చినవాడు** శక్తిసామర్థ్యాలన్నీ ఉడిగినవాడు, ఏమీ చేయనివాడు (ద.నె.)

**అతగాడు** ఆవ్యక్తి, ఆయన (క,కో.)

**అతంత్రము** దుర్బలత్వము, బలహీనత (రా.) పరాధీనము, స్వతంత్రంలేమి (ద.నె.)

**అతను** ఇంటాయన, ఇంటియజమాని (క.)

**అతలకుతలం** చిందరవందర, కిందిదిపైన పైది కిందకావటం (ద.నె.) విపరీతంగా, ఎక్కువగా పొంగుచూపుతూ (రా,తె.) ఉదా: అతల కుతలంగా జ్వరం వచ్చింది; కల్లోలం (రా,అ.) ఆయాసం (ద.నె.) మనశ్చాంచల్యం (రా.) బండి ఎగుడుదిగుళ్ళలో పోవటం వల్ల ఒళ్ళుబాగా నలిగిపోవటం (కో,తె.)

**అతిగడియు** మేరమీరు, జవదాటు (క.) ఉదా: వాడు నామాటకు అతిగడియడు.

**అతిమాత్ర** వదరుబోతు, అతిగా మాట్లాడే వాడు; అధికప్రసంగి, వాయాడి (ద.తె.)

అతుకు కలిసిపోవు, కలిసియుండు, వాడెక్కడా అతకడు (తె,ద.నె.)

**అతుకులబొంత** ఏదోవిధంగా పనిగడుపుకొనటానికి వాడుకొనే సాధనం (కో,తె.) సంసారం అతుకుల బొంతగా ఉంది, లోపాలపుట్ట (క.)

**అతుకులు** లోటుపాట్లు, లోపాలు (క.)

**అత్తపత్తి** తాకితే ఆకులు ముడుచుకొనిపోయే చిన్న చెట్టు (కో,ద.)

**అత్తపుత్త** తొక్కుపలుకులు, వచ్చీరాని జిలిబిలి పలుకులు, ముద్దుపలుకులు. ఉదా: అమ్మాయి అత్తపుత్తమాటలు మాట్లాడుతుంది (తె,కరీం.)

**అత్తం** అరటిగెలలోని కాయలవరస, జీబు (కో.)

**అత్తరబుత్తర** తొందరగా (తె.)

**అత్తారుబతంగా** జాగ్రత్తగా, భద్రంగా, ప్రాణపదంగా (కో.)

**అత్తిక** వదిన, గోల్కొండ వ్యాపారుల ఇళ్ళలో బంధుత్వ బోధకపదం (క.)

**అత్తిరసము** అతిరసము, నిప్పటి, బొబ్బట్టు, అరిసె (రా.)

**అత్తోడి** అజమాయిషీ, స్వాధీనత (తె, కరీం.)

**అత్రాప్** జిల్లా (తె.)

**అదంత్రుడు** అస్వతంత్రుడు, దరిద్రుడు, అనాథ, బలహీనుడు, అదంత్రుడికి ఆశపెట్టరాదు బలవంతుడికి చోటివ్వరాదు అని సామెత (క. నుడి.)

**అదనా** హీనము (తె.)

**అదనాలు** వ్యవసాయం పనులలో నెలజీతగాండ్ర నిమిత్తం కాక దినకూలీల లెక్క, వాళ్ళ హాజరుపట్టీ, అదనాలు వ్రాయించినాడు (ద,నె.)

**అదను** తగినసమయం, సందర్భం.

**అదం** రూ. అజం అహంకారం, కావరం, అదరిపాటు, దుడుకుతనం (కో.)

**అదరగొట్టు** నోరెత్తకుండా చేయు, వాణ్ణి అదరగొట్టి పంపించాను (రా,ద.) దులపటం, రాల్చటం (రా,అ.) ఉదా: చింతకాయలు అదరగొట్టు.

**అదరబదర** రూ. అదరాబాదరా, తొందర తొందరగా, వెంటవెంటనే (కో,తె,రా,ద.)

**అదరబదరచేయు** ఏదైనా ఒకపనిని అరకొరగానిర్వహించు, అందతుకులుగాచేయు (ద, రా,అ;కో.)

**అదరుమ్రాకు** మోటబావిపై బిగించిన అడ్డమ్రాకు (తె,కరీం.)

**అదలుబదలు** మార్పిడి చేసికోవటం, మార్చుకోవటం. ఆస్తులు అదలుబదలు చేసుకొన్నారు (తె,కరీం.)

**అదవ** హీనము, నైచ్యము, దొంగతనం చేసేటంత దొరతనముండగా అడుక్కుతినేటంత అదవ బతుకు ఎందుకు (ద.నె) కుంటి, గుడ్డి, (రా.)

**అదవ మనిషి** పనికిమాలినవాడు (ద,నె.) అవిటి మనిషి (రా.)

**అదవులు** అడవులు కాపాడే దేవత (ద.)

**అదాటుగా** హఠాత్తుగా (తె,కో,ద.)

**అదాటున** ఆకస్మికంగా (రా,ద.) రోగంతో లేవలేని స్థితి (క.)

**అదాటుపడు** అనుకోకుండా మార్గ మధ్యంలో ఎదురుపడు.

**అదిన** వదిన (క.)

**అదిలించు** కదిలించు (తె.)

**అదును** చోటు (క.)

**అదుపు** హద్దు, లొంగుబాటు (తె.)

**అదురు** గనిస్తారంగంలో మందుకూరి కాల్చిన తర్వాత కదలబారిన భూభాగం (ద.నె.) ఉదా: అదురంతా తీసివేశారు.

**అదురేటు** భయపడేట్లు కొట్టటం (ద.నె.)

**అదువు** లోకువ, బలహీనత (రా,అ.)

**అద్ద** వరికుప్ప కోసుతే లేట్లు గోపురాకృతిగా పోయు (ద.నె.)

**అద్దలం** నాటకాలలో వేషాలు వేసేవాళ్ళు ముఖానికి పూసుకొనే రంగు (ద.నె,చి.)

**అద్దలా** ఏగాని (క.)

**అద్దు** ఒకదానితో ఇంకొకటి పూర్తిగా అతికినట్లు సరిపోవు (తె,కరీం.) రవిక గుడ్డ (కో, క.)

**అద్దుగోడ** చిన్నిగోడ, అడ్డుగోడ (ద.చి.)

**అద్దుడు కాగితం** కాగితాలపై సిరా వొలికినపుడు దానిని పీల్చుకొనే కాగితం (కో,తె,ద.)

**అద్దుపద్దు** అదుపాజ్ఞలు (కో,తె,రా,ద.)

**అద్దులుబెట్టు** చీపురు, చేట ముట్టకుండా, చాకలి, మంగలి వీళ్ళతో మాట్లాడకుండా నియమపాలనంచేసే స్త్రీ (ద.చి.)

**అద్వైతం** యతిమతం, దేనినీ పట్టించుకోక పోవటం, అంటించుకోక పోవటం (కో.)

**అధాతుగ** అకస్మాత్తుగ (తె.)

**అన** బుట్ట, సంచి మొదలైనవి అల్లటానికి ఏర్పరచుకొన్న రూపాకృతి ఉదా: నీవు అనవేసి ఇస్తే నే బుట్టంతా అల్లుతా (ద.నె.) ప్రారంభంలో వేసే నూలు లేదా నులక పోగు, ఉదా: మంచమల్లటానికి అనవేసినారు (రా.)

**అనకొన** మొదలు, తుద, వెనక, ముందు, విచారణ (ద.నె.)

**అంతకం** పట్టుదల, మొండితనం, మారాము, పిల్లవాడు అంతకం చేస్తున్నాడు (తె.) సాధారణంగా మూడేళ్ళు కోసారిగాని, నిర్ణయించు కొన్న గడువు కాలానికిగాని అప్పు ఇచ్చిన మొత్తానికి వడ్డీ కట్టి, దాన్ని అసలు మొత్తానికి చేర్చే పద్ధతి, పద్ధతి, తీర్పు (ద.నె.)

**అంతనపొంతన** మర్యాద (తె.)

**అంతరకొట్టు** ఈదులాటలో తలకిందుగా నీటిలో దూకటం (రా.) పిల్లేరుగంతు వేయు, పిల్లి మొగ్గ వేయు (ద.)

**అంతరగంగ** చూ. అంతరతామర (రా.)

**అంతర తామర** చిన్న చిన్న కుదురులుగా నీటిమట్టంపై తేలిఆడుతున్న చిన్న చిన్న ఆకు తామర (తె,ద,రా.)

**అంతర పల్లటి** పలయాకారంగా దేహన్ని తిప్పుతూ కిందికి దూకటం (ద.నె.)

**అంతరాళము కట్టుబడి** నగలకు రాళ్ళు పొదిగేటప్పుడు వెనక వైపుకూడా ఆరాళ్ళు కన్పించేలా కూర్చుచేయటం.

**అంతలపొంతల** సంబంధమేమీలేని, ప్రాణాంతకమైనశ్రమ (కో.)

**అంతల పొంతల గాడు** దూరపు చుట్టం (క.)

**అంతల మంతల** పీలుచాలు, చాలుమూల (కో.)

**అంతలు పొంతలు** జ్వరం ఒక్కసారిగా ఉధృతం కావటం (కో.)

అంతికాలం అంత్యకాలం, చావుకాలం (క.)

అంతు మొత్తం (ద.చి.) లోగుట్టు, లోపలి మర్మం (రా,ద.) చివర (తె.)

అంతుకట్టు అప్పుమీద వడ్డీకట్టి ఆమొత్తాన్ని అసలుకు కలుపు, అంతకం కట్టు (కో.)

అంతుతేల్చు అటో ఇటో తేల్చివైచు, తీవ్రంగా శిక్షించు, పరిష్కరించు (రా,ద,కో.)

అంతుపొంతు జాడ (కో,ద,రా,తె.)

అంతూ మొత్తముమీద(వడ్డీ) (రా.)

అంత్రము తాయెత్తులో ఉంచే రక్షరేఖ (ద.)

అందంక అప్పటి వరకు, అందాక (క,తె.)

అందనక అప్పటిదాక, అంతవరకు (క.)

అందాక చూ. అందనక (క.)

అందనిపొందని అసాధ్యమైన, అంతుచిక్కని (తె,కో.)

అందాజు సుమారు, రమారమి, ఉరామరిక (రా,కో.)

అందాదు అందాజు, ఉజ్జాయింపు (రా.)

అందిగ అందె, అందియ (రా.)

అందిపుచ్చుకొన్నట్లు చాలాసమీపం, చేతి కందేటంత దూరం (ద,కో).

అందిరాని సాధ్యపడని, అంకెకురాని (తె.)

అందుకని అందుకుగా, దానికోసం (ద,రా, తె.)

అందుగడి అందుబాటు (ద.)

అందుబడి అనుకూలము (రా,ద.)

అందెబొందె సంబంధం (ద,నె.)

అందెము పొగాకుఅండెం, కట్ట (తె.)

అంధేరా అవివేకశీలి, హీనప్రజ్ఞుడు (కో.)

అనప అనపకాయ, అనుములధాన్యం (ద, చి.)

అనామత్తు అమానత్తు, తాత్కాలికమైనఖాతా (ద,కో.)

అనారస అనాసపండు (ద,చి.)

అనాస అనాసపండు

అని త్రోవ, దారి, పరిష్కారం (ద.) దారపు కండెకొన, అల్లిక (రా.)

అనిక ఎదురుతిరగటం, మెడమీదికాడి కిందికి తోసి అడ్డంతిరిగి నిలవటం. ఉదా: ఎద్దుఅనికవేసి నది (ద.) పనిచేయటానికి నిరాకరించడం (ద, తె.)

అనుపు నాలుగు దారులు కలిసే కేంద్రం, కూడలి (ద,చి.)

అనుమాయితీ సంప్రదాయం, ఆనవాయితీ (క.)

అనుము తాళం మొదలైన సాధనాలలోని మర ఉదా: అనుముచెడింది (తె.)

అనువు కించ, తక్కువ, లోకువ, హీనము (క,నుడి.) అలవు (రా.)

అనువుకట్టు లోకువచేయు, లోకువకట్టు ఉదా: అనువు వాడిపెళ్ళాం ఊరందరికీ వదిన (క.)

అనువుకాడు వ్యర్థుడు (క,నుడి.) ఉదా: ఆలొల్లని మగడు అనువుకాడు.

అన్న తండ్రి, అక్క (ద,చి.)

అన్నకావడి తిండిపోతు, కొరగానివ్యక్తి (ద,చి.) ఇంటింటా కబళ మెత్తుకొని జీవించే వ్యక్తి, అన్నపూర్ణకావడి (ద,నె,కో.)

అన్నకుత్తి అన్నం వడ్డించే పనిముట్టు (ద, చి.)

**అన్నగాడు** పెద్దాడు, పెద్దవాడు (ప్రకీర్ణోప న్యాసాలు.)

**అన్నదమ్ముడు** తోబుట్టువు, సోదరుడు (క.)

**అన్నన్నగతికులు** కూటికి అంగలార్చేవారు (తె.)

**అన్నన్నా** జాలి లేదా పశ్చాత్తాపము ప్రకటించటం (కో.)

**అన్నప్పొడి** కందిపొడి, కమ్మనిపొడి (రా.) (ప్రకీర్ణ.)

**అన్నయ్య** తండ్రి (ప్రకీర్ణ.)

**అన్నశుద్ధి** నెయ్యి (కో.)

**అన్నా** కోపగించటం, కోపంతో అదల్చటం (కో.)

**అన్నాపన్నా** వ్యర్థం, నిష్ప్రయోజనం, ద్రోహంలేనిది (తె.)

**అన్నాబత్తి** ఊదువత్తి, సాంబ్రాణికడ్డి (ద, చి.)

**అన్నాలం** అన్యాయం (తె.)

**అన్నెంపున్నెం** పాపపుణ్యాలు (కో,తె.)

**అన్యాత్తుడు** ఒట్టి అప్రయోజకుడు (ద.)

**అన్యాలం** అన్యాయం (రా.)

**అపరాత్రి** అర్ధరాత్రి (క,ద,కో.)

**అపరాత్రి, అర్ధరాత్రి** రాత్రి చాలాపొద్దు పోయినతరవాత సమయం (కో.)

**అపరాలు** కాయధాన్యాదులు, పప్పుదినుసులు (కో.) అపరకర్మలు (రా,ద,నె.)

**అపసంతి** మందమతి, పనికిమాలినవాడు, వ్యర్థుడు (క,మది.) ఉదా: అపసంతి పంట వెంపలికంపలి మంట.

**అపసంతిపంట** పనికిమాలినపని, నిష్ప్రయోజనమైన పని. ఉదా: అపసంతికి పని హెచ్చు లోభికి ఖర్చుహెచ్చు (క,మది.)

**అపసవ్యం** ప్రతికూలం, వ్యతిరేకం (కో, క.)

**అపాండపం** అభాండం, నింద, అపనింద (కో.) (కథలు-గాథలు)

**అపిని** చెడుఅలవాటుకు వశుడైన వ్యక్తి, అబస్వభావం, తృప్తిలేక పోవటం (కో,ద.)

**అపిరితిపిరికావటం** తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరి కావటం (కో.)

**అపూటంగా** బొత్తిగా (రా.)

**అపూటు** కల్తీలేని, అప్పటమైన ఉదా: అపూటుసారాయి (తె.)

**అప్ప** అక్క, తనకన్న పెద్దదైన తోబుట్టువు (కో,ఒ,ద.) పిండివంట (రా.) అయ్యా అనే సందర్భం ఉదా: ఏమప్పా (రా.)

**అప్పకేడ్చేవాడు** అనాథ, అప్రయోజకుడు, వ్యర్థుడు (తె.), సంఘంలో గౌరవంలేని వ్యక్తి ఉదా: ఆకుర్రవాడు అప్పకేడ్చేవాడు.

**అప్పచ్చి** విశాఖ ప్రాంతంలోబహుసంఖ్యాకులు పెట్టుకొనే పేరు, పిండివంట (ఒ.) తీపిగాని, కారంగాని అయిన పిండివంట (కో,ఒ,తె.)

**అప్పటం** సిసలైన, అసలైన, కల్తీలేని (తె, రా,ద.)

**అప్పటికి** తర్వాత, ఆ సమయానికి (ప్రకీర్ణ.)

**అప్పడు** సంతానాన్ని సంబోధించే ముద్దు పిలుపు (ఒ.)

**అప్పనం** ఋణం, బాకి (ఒ.)

**అప్పనంగా** ఉచితంగా (ఒ.)

**అప్పనాలబావ** అవ్యక్తుడు, అప్రయోజకుడు ఉదా: అప్పనాలబావ (తె.)

**అప్పన్న** సింహాచల నరసింహ స్వామి (క.)

**అప్పయ** పిల్లవాడు, అబ్బాయి (రా.)

**అప్పయ్య** పినతండ్రి (తె.) (ప్రకీర్ణ.)

**అప్పల స్వామి** సింహాచల నరసింహ స్వామి (క.)

**అప్పళంగా** సులభంగా, సంపూర్ణంగా, పూర్తిగా, సరిగా అతికినట్టు (ద.)

**అప్పసం** బోదెల నడుమ చిన్న కాలువ, యారాము, పొలంగట్టున నీరు జారిపోకుండా వేసిన మట్టిపెళ్ళ, ఉదా॥ అప్పసంతో పెళ్ళ వేసినట్టు (క,నుడి.)

**అప్పాలు** అప్పచ్చులు, పిండి వంటలు తీపివి కాని, కారంపి గాని (కో,క.)

**అప్పిళం** ఎప్పుడూ, అజంగా (ద.)

**అప్పుదిద్దు** అప్పుతీర్చివేయు (క.)

**అప్పు సప్పు** అప్పుగానో, చేబదులుగానో సంపాదించుకోగల డబ్బు (కో,తె,రా,ద.)

**అప్పర్లు** ఆఫీసర్లు అనే రూపానికి వికృత రూపం, అధికారులు (తె.)

**అభము** చెడ్డ, అభంశుభం అనే నుడికారంలో వ్యతిరేకమైన, కలిసిరాని అనే భావాన్ని సూచించే పదం (రా.)

**అబక** పళ్ళెము, పాత్ర (రా.)

**అబము సుబము** అశుభము, శుభము, అభం శుభం, అన్నెం పున్నెం (ద.)

**అబాచీ** నింద (క,నుడి.)

**అబాపురి** అల్లాటప్ప (ద.)

డబ్బు ఎగ వేయటం (కో.)

**అబోరు** శూన్యం, నిర్లిప్తత (రా.)

**అబ్బక్క** ఆశ్చర్యార్థకమైన నుడి (తె.)

**అబ్బిగాళ్ళు** దున్నటం వల్ల పశువులకు ఏర్పడే పుండ్లు పడిన కాళ్ళు (తె.)

**అబ్బడాలు** పామర దూషణ ప్రయోగం, అమ్మలక్కలు తిట్టటం (ద,రా.)

**అబ్బనాకారం** లేక లేక కలిగినప్పుడు పిల్లలపై చూపించే గారాబం, మమకారం (కో.)

**అబ్బయ్య** పిల్లవాడు (ద.)

**అబ్బరాంతం** అపూర్వము, మిక్కిలి గారాబమును పరిహసించటం ఉదా: అబ్బరాంతపు బిడ్డ పుట్టాడు గడ్డపార తేరా చెవులు కుడదాం అన్నట్లు (కో,రా.)

**అబ్బరాని గడ్డపార** అలవిగాని వ్యక్తి (ద.)

**అబ్బరింత** బెదరిపోయే పక్షి, మిక్కిలి బెదరిపోయే స్త్రీ (రా.)

**అబ్బరీకం** పెండ్లి పీటలమీద కూర్చుండబోయే వధూ వరుల తలంటి కార్యక్రమం, అభ్యంగన కర్మ (తె.)

**అబ్బాగతి** అభ్యాగతి, పిలవకుండా ఇంటికి ఆవేళకు వచ్చిన అతిథి (క,నుడి.)

**అబ్బాసల్లీకాలం** తాతలనాడు, పూర్వకాలం అని అర్థం (ద,నె.)

**అబ్బి** అతడు అనే భావానికి పర్యాయ పదం, కూరలబ్బి, పాలఅబ్బి (కో,ద.) అబ్బాయి (రా,కో.) కొడుకు (క.) బిడ్డ (ద,చి.)

**అబ్బిగాడు** ఏమీ ఎరుగని ముద్దరాలు (క.) కుర్రవాడు (కో.)

**అబ్బిళ్ళుకరచు** పెదవి కరచు, పౌడు గరచు (ద.)

**అబ్బూచి** పినతల్లి, పిన్ని (క.)

**అభిప్రాయం** కోరిక, మక్కువ (ద.)

**అభ్యంతరం** ఆటంకం, నిరోధం, అపు (కో.)

**అమందస్తా** పళ్ళూడి పోయినవాళ్ళు తాంబూల చర్వణం చేయటానికి వక్కలాకులు నలగ గొట్టు కోవటానికి ఉపయోగపడే చిన్న రోలు రోకలి వంటి సాధనం (క.)

**అమక్కళం** అతిశయం, బ్రహ్మాండం, ఆర్భాటం ఉదా: పెండ్లి అమక్కళంగా జరిగింది (ద,చి.)

**అమగము** అసహ్యం, రోత (రా.)

**అమడకాయ** ఒకజాతి కలుపు మొక్క (ద.)

**అమడాలు** కవల పిల్లలు, కవల జంట ఉదా: అమడాలకాయ (కో.)

**అంపకం** పెళ్ళిచేసిన తరువాత అమ్మాయిని అత్తారింటికి పంపించటం, అత్తమామలకూ దగ్గరి బంధువులకు అప్పగించటం (కో,ద,తె,రా.)

**అంపకాలు** నవ వధువును అత్తారింటికి పంపించే కార్యక్రమం (కో.)

**అంపు** వితంతువు గాజులు పగలగొట్టు, ఉదా; నీగాజులంప (క,నుడి.)

**అంపుదోడు** అనుకరణశీలి, ఒకరి వెంట అనుసరించి ఉండేవాడు ఉదా: అంపుదోళ్ళ వెధవ (ద. చి.)

**అంబటాళ(ల)** పొలంలో పనిచేసే వారు మధ్యాహ్నం అంబలి తాగే సమయం, మధ్యాహ్న వేళ (కో,తె.)

**అంబటాల్ల** చూ. అంబటాల (మిట్టమధ్యాహ్నం) (తె.)

**అంబటిగానం** కొంతరొక్కం, రెండుపూటలా తిండి, సాలుకొక గొంగడి, చెప్పులజత, రోజు చుట్ట పొగాకు ఇచ్చేటట్లు ఒప్పందం చేసుకొని కుదుర్చుకున్న పనివాడు, జీతగాడు, (తె.)

**అంబటిచేయి** కుడిచేయి (రా.)

**అంబటిపొద్దు** అంబటివేళ (రా.)

**అంబటి పోచమ్మ** పెద్ద పెద్ద పొక్కులు ఒంటిమీద దూరం దూరంగా లేచే మశూచిక వ్యాధిలో ఒకరకం (రా.)

**అంబటీలు** అంబటివేళ, పొద్దునపూట అంబలి తాగే వేళ (రా.)

**అంబట్లతుఆ** రెండు పక్కల వాళ్ళు అంటే వ్యక్తికి రెండుపక్కల బంధువులు (తె.ప్రకీర్ణ.)

**అంబలంబలిగా** జారుజారుగా, అనుకనుకుగా, రవంత చిక్కదనంతో (ద,తె)

**అంబలి** చోడి పిండితో తయారుచేసిన ద్రవ పదార్థం, దీనిని గట్టి ముద్దగా చేస్తే 'తోప' అంటారు (క,కో,ద,రా.)

**అంబాజీపేటఆముదం** దండుగశ్రమ, వ్యర్థమైన ఖర్చు, వంచన, మోసం, బురిడీ (కో.)

**అంబాడు** గెంతు, దేకు (తె.) చంటిపిల్లలు నేలమీద పారాడు (కో.)

**అంబారం** కౌలు, పశువులు, జంతువులు (క.)

**అంబారీలు** గోమార్లు (కో.)

**అంబారుపిడుజు** రక్తం పీల్చే ఒక రకమైన కీటకాలు (ద,చి.)

**అంబారుకాజాలు** మట్టిలో ఉండే చిన్న పురుగులు, ఇవి కుడుతాయి (ద,నె.)

**అంబాలు** చూ. అంబాలీస్

**అంబాలీస్** రూ. అంబాల్, చిన్న పిల్లలు ఆట లాడుకొంటున్నప్పుడు తాను ఆటలో సిద్ధంగా లేను విరామంకోరుతున్నాను అని సూచించటానికి పలికే మాట (కో.) పనిని ఎగివేయటానికి నెపం (ద, నె.)

**అంబాళపుకాయ** తీయని మాటలు చూ. పెద్దబాలశిక్ష

అంబు వెనకటి కాలంలో శుభసందర్భాల్లో దీపపు ప్రమిదల్లో నూనె వేయటానికి ఉపయోగించే ధంటు పుల్ల (తె.) బలపం పుల్ల (కో.)

అంబునకొట్టినట్లు మాట్లాడటం సూటిగా నిక్కచ్చిగా బాణంవేసి గుచ్చినట్లు మాట్లాడటం (కో.)

అంబేలు చూ. అంబాలీస్ (ద,చి.)

అంబోదరగిద్దడు గజదొంగ, చిత్తూరు జిల్లాలో పేరుమోసిన పెద్ద దొంగ, దానధర్మాలు కూడా చేసేవాడని ప్రతీతి (ద,చి.)

అంబేద అమాయకుడు (కో,తె.)

అంబ్యాద పేదవ్యక్తి, అమాయకవ్యక్తి (తె, ద.)

అమరిక కుదిరిక, ఒప్పిదం (రా,ద,కో.)

అమలు మత్తు, మైకం, స్పృహ లేకపోవటం (తె.)

అంశం చనువు (ద,చి.)

అంస తెలుపురంగులో ఉన్న కోడిపుంజు (కోడిపందేలాడేవాళ్ళ పరిభాష) (ద,నె.)

అమాంతం వెంటనే, దిగ్గన, అప్పటికప్పుడే (కో,తె.) చిల్లరబేరం (తె.)

అమాంబాపతు(లు) అన్నీ కలిసి, వెరశి, అన్నీ కలుపుకొని (కో,క.)

అమాన్‌దస్తా పక్కలు, తమలపాకులు దంచి ముద్దచేసే చిన్నరోలువంటి సాధనం (క.)

అమానీగా సొంతంగా (క,నుడి.)

అమాంబాపతు అన్ని కలుపుకొని, (కో, క.) వెరసి,మొత్తము, పూర్తిగా,

అమాలి మూటలు మోసే కూలి, (క,తె. రా.) సాధారణంగా బరువులు ఎత్తే, దించే కూలి మనిషి

అమిణి చూ. అంజి, దండగమారి పని (ద, నె.) గ్రామస్తులంతా కలిసి నిర్వహించవలసిన ఉమ్మడి పనికి వంతుకి వచ్చే వ్యక్తి, ఆ పని (ద.)

అమిరిచ్చుకొను ఇతరులది దక్కించుకొను (తె.)

అమిసిన అమర్చిన, అమర్చిఉన్న, సిద్ధమై ఉన్న, ఉ॥ అమిసిన దానిపై అయ్యవారి చేయి (తె.)

అమీతుమీ తేల్చి చెప్పడం, అటో ఇటో కచ్చితంగా నిశ్చయించడం, నిశ్చయాత్మకమైన పరిష్కారం, అటో ఇటో కడపటి ఫలితాన్ని కూర్చే నిశ్చయ ప్రయత్నం. "సమ్మె నిషేధ శాసనంపై అమీతుమీ" 17-8-81 ఆంధ్రప్రభ పతాక ఉపశీర్షిక (క,కో,ద.)

అముజు బురద (ద,నె.)

అముదు ఇముడు (తె.)

అమోదం అంగీకారం (తె.)

అమ్మాకా దమ్మాకా బాతాఖానీ, పుక్కిటి పురాణం, లోకాభి రామాయణం (తె.)

అమ్మ చన్ను, స్త్రీ స్తనము, రొమ్ము (తె.) ఉ॥ చంటి బిడ్డకు అమ్మ నోటిలో ఉంచు- పాప అమ్మ చీకటం లేదు

అమ్మక్ దమ్మక్ వంచన, మోసం (తె.)

అమ్మక్క పెదతల్లి (కో,తె)

అమ్మడు అబ్బాయి, చిన్నపిల్లవాడు, గారాబంగా పిల్లలను సంబోధించు (ద,క.)

అమ్మణ్ణి దేవత (ద.) చిన్నపిల్ల (రా.) కొరగాని వ్యక్తి (ద,చి.)

అమ్మతల్లి పూజ్యురాలు, దేవతవలె పూజార్హురాలు, అందమైన కుదిరిక గల గోవు, (కో.) స్ఫోటకం (తె.) నిష్ఠూరంగా ఎత్తి పొడుపుగా, కోపంగా ఒక స్త్రీని గురించి వేరొకరి ప్రసక్తి (కో.)

**అమ్మమ్మ** తనను కన్నతల్లిని కన్నతల్లి (కో.) అవ్వ (ద.)

**అమ్మలక్కలు** ఇరుగు పొరుగు ఆడువారు అక్కా తమ్ముడు (కో.)

**అమ్మలు** స్త్రీలు (క.)

**అమ్మవారిపొంగు** మశూచికం (ద,చి.)

**అమ్మవారు** మశూచికం, స్ఫోటకం (కో.)

**అమ్మాయి** పెదతల్లి (తె,ప్రకీర్ణ.) స్త్రీ, బాలికాసంబోధన.

**అమ్మి** సామాన్యవాచి, కూతురు (తె,క.)

**అమ్ముకవేసినట్లు** వంకర టింకర లేకుండా, సూటిగా, చక్కగా (తె.)

**అమ్మోరు** అగ్రవర్ణస్త్రీ, స్ఫోటకం (ద,నె, చి.)

**అయ** తండ్రి (ద,నె.)

**అయితి** వీలు, సానుకూలత, అనువు, స్వాధీనం, (క.)

**అయినకాడికి** వచ్చినంతవరకు, అయినంత వరకు (ద,చి.నె,కో.)

**అయినవారు** బంధుబలగం, రక్తసంబధీకులు, కావలసినవాళ్ళు (కో,క,ద.)

**అయినిల్లు** ఇంట్లో దేవుడిగది (క.)

**అయిపిలేదు** జాడలేదు (కో.)

**అయిబుసయిబు** మంచీచెడ్డా, ముద్దూ ముచ్చట (తె.)

**అయిరేడి** చూ. అరివేణి, అవిరేణి

**అయిలు** తిక్క, చీదర (రా.)

**అయిరావటం** అచ్చిరావటక, కలిసిరావటం (తె.)

**అయివజు** చూ. అయివేజు

**అయివేజు** రాబడి, స్తోమతు, (కో,ద,రా.) బ్రాహ్మణుడు (రా.కర్నూ.) పంటభూమి సోమత (కో.) బదులు, చెల్లురూకలు, మూలధనము, బండోలు, ఉ॥ నీకు అయివజు మనిషి వచ్చి చేరే వరకున్నూ అని తాతాచార్యుల కథలు

**అయిసాపైసా** అటో ఇటో తేల్చుకోవాలన్న తెగింపు (కో,ద.)

**అయోమయం** అధ్వాన్న స్థితి, ఏమి అవగాహనకాని స్థితి, అర్థంకాని స్థితి (కో,ద.)

**అయ్య** జంగమయ్య (తె.)

**అయ్యగారిచేను** మాన్యం, అగ్రహారం (ద, చి.)

**అయ్యగారు** పూజారి, పురోహితుడు (తె, ద.)

**అయ్యడు** పూజ్యుడు (తె.)

**అయ్యవారివట్టిల్లు** మిక్కిలి దీనావస్థ, దరిద్రావస్థ (కో,క.)

**అయ్యారు** వైష్ణవులు (తె.)

**అయ్యోర్లు** చూ. అయ్యార్లు (తె.)

**అరకొర** అసంపూర్ణం, సగంసగం (కో.)

**అరజ్** వినతి (తె.)

**అరజ్‌చెయ్యి** విన్నవించు, దరఖాస్తు సమర్పించుకొను (తె.)

**అరటిదూట** అరటి ఊచ (కో.)

**అరటిబొంద** కొట్టివేసిన అరటిమాను, తాలిచిన తాటివాసం, చేలలో నీళ్ళు పారటానికి ఉపకరించేది (కో.)

**అరమర** రహస్యం, దాపరికం (కో,క.)

**అరామీ** గొడవ, అల్లరి (కో.)

**అరిగోస** అష్టకష్టాలు (తె.)

ందాలు అరికాళ్ళు (తె.)

రీగా త్వరత్వరగా (క.)

పకో కనుక్కో, తెలుసుకో (తె.)

:)

కోవాలె తెలుసుకోవాలి, చూడాలి (ప్రకీర్ణ.)

గది (తె.)

ంజ్ వేలం (తె.) (ప్రకీర్ణ.)

డం విత్తనాలు చల్లడం, ఎదపెట్టడం.

లుగు విడివిడిగా, వేరువేరుగా (తె.)

ామనిషి తక్కువకులం, తక్కువ

క్తి (కో,క.)

ాలు దళితజాతి, తక్కువకులస్తులు

ప విడిగా, వేరుగా (తె.)

ోసుకుంట తలపోసుకుంటూ (తె.)

ుక అలసట, వగర్పు, రొప్పు (కో.)

ు సౌలభ్యం, కవిగారిమనుగడ, పుట 43,

), తెగువ, మంచినడతలకు గుర్తు.

వేళ అబోధవేళ, సాయంవేళ (కథలు-II - 61.)

పొద్దు ఆవులు ఇంటికి తిరిగివచ్చే పొద్దు,

కు తిరిగిన పొద్దు (క.)

ంకగా సులువుగా, సునాయాసంగా (కో.)

ంయిదాగా వేరువేరుగా, విడిగా (కో.)

ంయిబలాయి కలిమిడితో కలిసిపోవటం,

ా ఉండటం (తె.)

క్తి తక్కువ (తె.)

ట్ట అలసట (తె.)

ంగులు బాణాలు (తె.)

**అలువు** అలుగు, తూము, ముఖ్యంగా చెరువుకు (క.)

**అల్కగయినది** తేలికగా ఉన్నది (తె.)

**అల్లాయి పుల్లాయి** కావలించుకోవటం (తె.)

**అల్లారు** అందరు (క,నుడి.)

**అల్లారుముద్దుగా** మిక్కిలిగా (క,నుడి.)

**అవసలాయన** స్వర్ణకారుడు, అగసాలి (తె.)

**అవాంతరం** ఆటంకం, అదుపు, అడ్డు, నిరోధం (కో.)

**అవాకులు చెవాకులు** చెడువాక్కులు, ప్రలాపములు (కో,క.)

**అవిరెండు** కుండలు (తె.)

**అవిసిండు** జబ్బున పడినాడు, రోగంతో తీసుకొన్నాడు (తె.)

**అవుకు** వెలితి, నాసి, తీసికట్టు (క.)

**అవుకుగా** బలహీనపడిపోయిన స్థితి, ఎత్తుబడిపోయిన స్థితి (రా.)

**అవేళ** వేళకానివేళ, సమయంకానిసమయం

**అవ్వాకులు చెవ్వాకులు** దురుసుమాటలు, ప్రలాపాలు, వదరుమాటలు (కో,క.)

**అశ్వ రూ.** అశ్వ. మంగలిపొది (ప్రకీర్ణ.)

**అశ్వ** మంగలిపొది.

**అసిద్దం** అశుద్ధం, అశుభ్రమైనది (తె.)

**అసొంటి** అటువంటి, అట్లాంటి, అలాటి (కో, తె.)

**అస్తబా** గుర్రపు శాల (క.)

**అస్పాన్ల** చుట్టుపక్కల (తె.)

## ఆ

**ఆకట్టుకొను** ఆకర్షించు, తనవైపుకు తిప్పుకొను (క,కో.)

**ఆకతాయి** వంచకుడు, కపటి, దుర్మార్గుడు (క,కో.)

**ఆకంటినీళ్ళు ఈకంటికిపోయు** ఎక్కువగా దుఃఖపెట్టు (రా.)

**ఆకప్ప** పచ్చి ఆకుల మీద ఉంచి నిప్పులపై ఉడికించిన రొట్టె, దాలిరొట్టె (తె.)

**ఆకము** అధికారము (తె.)

**ఆకర** ఆకురాయి, లోహాన్ని అరగదీసే సాధనము (ద.)

**ఆకాశచివ** తారాజువ్వ (ద.)

**ఆకాశరామన్న జాబు** తన పేరు తెలియకుండా ఇతరులమీద అభియోగాలు మోపుతూ రాసే లేఖ, అర్జీ (క,నుడి.)

**ఆకిలి** వాకిలి (తె.)

**ఆకు** పుట, పేజీ (తె,కో.)

**ఆకుఅలం** గడ్డిగాదం (కో,ద,తె.)

**ఆకుకీ చెక్కకీ** ఆకుకూ పోకకూ, ఆకుకు వక్కకు (క.)

**ఆకుకూర** తోటకూర, మెంతెకూర మొ॥నవి, అన్నంలోకి ఆకుకూరతో చేసిన వ్యంజనం (తె, ద.)

**ఆకుకూ పోకకూ చెందని మాట** ప్రయోజనం లేని మాటలు, పనికిరాని ప్రసంగం (కో, క,ద.)

**ఆకుకొబ్బి** క్యాబేజి, కోసుగడ్డ (క.)

**ఆకుగొడ్డలి** సన్నగా వెడల్పుగా ఉండే అంచుగల గొడ్డలి (ద,తె.)

**ఆకుచాటుపిందె** తల్లిదండ్రుల అదుపాజ్ఞల్లో ఉండే సంతానం (కో.)

**ఆకుచిట్టెడ** పెద్దపులి జాతికి చెందిన క్రూర మృగం, ఒకరకం పెద్దపులి, పులి (క.)

**ఆకుచెప్పులు** సన్నని తోలుగల షోకైన చెప్పులు (కో.)

**ఆకుతొక్కు** వరిమడికి ఎరువుగా వెంపలి మొదలైన మొక్కలు తొక్కటం (కో,ద.)

**ఆకుపూజ** ఇష్టదైవానికి ముఖ్యంగా ఆంజనేయ స్వామికి తమలపాకులతో పూజ నిర్వహించటం (కో,రా.)

**ఆకులపోక** తాంబూలం (తె.)

**ఆకులోటా** రేకులోటా (ద.)

**ఆకోడాలు** హండాల రెండు వైపులా ఉండే లోహవలయాలు, చెవులు (క.)

**ఆగడం** గయ్యాళితనం, కొంచెం విషయాన్నే పెద్దదిచేసి గోల చేయటం, దుర్న్యాయం (రా.) అల్లరి, దుడుకుపని, (క,నుడి.) దుశ్చర్య

**ఆగడప** చేను అక్కడక్కడా తడియంట (కో.)

**ఆగడించు** అన్యాయం చేయు (ద.)

**ఆగతి** ఆహుతి (ద.)

**ఆగం** అల్లరి, గలభా (కో,ద.), నాశనం (తె.)

**ఆగలించు** ఆవులించు (క.)

**ఆగమ్మకాకి** దిక్కు దివాణం లేని బతుకు (కో,తె.) ఒకచోట కాలు నిలువ కుండా అక్కడికీ ఇక్కడికీ తిరిగే వ్యక్తి (కో.)

**ఆగండాలు** అబద్ధాలు (తె.)

**ఆగమ్మపక్షి** అనాథ (తె.)

**అగంకావడం** చెడిపోవటం (తె.)

**అగాకర** ముళ్ళకాకర, బుడిపికాకర, చిన్న బుడిపెతో గుండ్రంగా ఉండే కాకరకాయలు (కో, క.)

**అగారము** అమ్మవారికిచ్చే బలి (ద.) ఆహారము (తె.)

**అగావు** ముందుగా లభించినది, బయానా (రా.)

**అగిత్తం** అఘాయిత్యం, మూర్ఖపుపట్టు (కో.) అల్లరి, ఆర్భాటం (ద.)

**అగు** నిరోధించు, ఆగిపోయేట్లు చేయు (ద.)

**అగునపడ్వటం** లబ్బిన మొత్తుకోవటం (తె.)

**అగుబ్బు** రహస్య విషయం పది మంది నోళ్ళలో బయటికి పొక్కడం (కో.) హెచ్చు, అధికం, ఒకరినోటి నుంచి ఒకరికి వ్యాప్తిపొందు (క,నుడి.)

**అఘాఘుమేలమీద** చాలావేగంగా, మిక్కిలి వడిగా, త్వరత్వరగా (కో,క.)

**అచ** అన్న, వయసున తనకన్న ఏళ్ళు ఎక్కువైన సోదరుడు, ఆవావి గల వ్యక్తి (క.)

**అచా** అన్న, పినతండ్రి, ద్రావిడ బ్రాహ్మణ పరిభాష (క,నుడి.)

**అచూచు** అంగిలితో వాసన చూసి రుచి తెలిసికొను (క,నుడి.)

**అచేడు** ఎరువు నిమిత్తం పశువులను పొలాలలో కట్టివేయు, మందకట్టటం (క.)

**అచోకి** సూచనగా తెలిసి రావటం, ముందుగా తెలియటం, సమాచారం గురించి భోగట్టా (కో, క.)

**అచ్చనగిల్లలు** గచ్చకాయలు (తె.)

**అచ్చి** చిన్న పిల్లలను బుజ్జగిస్తూ, బయటకు తీసుకొని వెళతాను అని చెప్పేమాట (కో,తె.)

**అజీలు** సర్వసన్నద్ధంగా, సిద్ధంగా (కో.)

**అజాద్** స్వతంత్ర (తె.)

**అటకాయ** ఆటగొట్టు, ఆటలు రుచిమరిగిన పిల్లవాడు, ఆటలలో ఎక్కువ ఆసక్తి గల పిల్లవాడు (ద.)

**అటగొట్టు** ఆటపాటలలో ఎక్కువగా పొద్దుపుచ్చే బాలుడు (కో.)

**అటపాటలుగా** అనాయాసంగా (తె.)

**అటలపాటలతల్లి** పలచగా పోసిన స్ఫోటకం, దానివల్ల ఏర్పడే మచ్చలు (తె.)

**అటలు** ఎత్తులు, వేషాలు, నీఆటలు నాదగ్గర సాగవు (ద,కో,తె.)

**అటవిడుపు** విరామం, పాఠశాలకిచ్చే శెలవు (కో,తె,ద.)

**అటవిడుపు పద్యం** పూర్వకాలం పల్లెటూరి విద్యాభ్యాసంలో శెలవులలో విద్యార్థి కంఠస్థం చేయటానికి ఉపాధ్యాయుడు నిర్దేశించిన పద్యం (కో, ద.)

**అటివచ్చు** తక్కువ వ్యయంతో ఎక్కువ వినియోగం పొందు, ఎక్కువగా మన్ను (కో.)

**అటుపోటులు** కష్టసుఖాలు, హెచ్చుతగ్గులు, తగ్గుమొగ్గులు (కో,ద,క.) చెవిలో కురుపు వ కలిగే బాధ (రా.)

**అటుబడి** ఆటిరావటం, సరిపోవటం (

**అటువనాటు** కాళ్ళు చేతులు కట్టి

**అటోపం** అదుపాజ్ఞలు (తె.

**అట్టె** అధికంగా, ఇంకా క అర్థంలో (కో,ద,తె.)

**అడ** అక్కడ, ఆచోట (కో,తె.)

**ఆడకట్టు** వాడకట్టు (తె.)

**ఆడకం** గానుగ ఆడి చమురు తీయటం (ద.)

**ఆడంగి** ఆడ స్వభావం గల మగవాడు (కో., క.)

**ఆడంగిడవ్వ** అప్రయోజకుడు, ఆడవాళ్ళలాగా మాట్లాడే వ్యక్తి (కో.,ద.)

**ఆడంగిరేకులు** ఆడ మనిషి రూపురేఖలు గల మగవాడు (కో.,ద.)

**ఆడపాప** పూర్వకాలం భూస్వాముల ఇళ్ళలో పనిచేసే దాసీకత్తె, కాసా, ఆడపాప, అడిపాప, ఆడబాల అనికూడా అంటారు (కో.,ద.,తె.,క.)

**ఆడబాప** కొద్దికాలం కిందటి వరకు అమలులో ఉన్న భూస్వామ్య వ్యవస్థలో అంతర్భాగంగా తెలంగాణంలో దొరలనిపించుకొనే భూస్వామ్య సంపన్న వర్గాలలో చాకిరీకై ఉండే దాసీలు (తె.)

**ఆడబాల** చూ. ఆడపాప

**ఆడబొట్టి** ఆడపడుచు (క.)

**ఆడమానం** స్థిరాస్థి, కుదువ (రా.,ద.)

**ఆడాదూడా** వడ్లలో ఒకరకం (ద.)

**ఆడారిసత్తెప్ప** నపుంసకుడు, ఆడింగి రేకులవాడు (క.)

**ఆడికలు** కోడలు పుట్టింటివాళ్ళు పెట్ట వలసినవి పెట్టక పోయినప్పుడు ఆమెను అత్తవారు సాధిస్తూ అనే మాటలు (క.,నుడి.)

**ఆడితి** కొలత, మాదిరికి ఇచ్చే వస్తువు, ఆలతి (రా.)

**ఆడిదవాళ్ళు** ఇతరులు (తె.)

**ఆడిపాడిపోవు** అకస్మాత్తుగా మరణించు (తె.)

**ఆడిపోసికొను** నిందించు (క.,కో.,ద.)

**ఆడివాళ్ళు** ఆడవాండ్లు (తె.)

**ఆడివాప** దాసీ మనిషి, ఆడపాప (తె.)

**ఆడు** రక్షణ, పనిచేయు, తిరుగు, మిట్టిపడు (తె.)

**ఆడుకొత్తుబాగాలు** వక్కలు (తె.)

**ఆడుగర్రలు** చేలో పలచగా కనిపించే పైరు మొక్కలు (కో.)

**ఆడుగొప్పు** మిరప మొక్కలు మొదలైన వాటి గొప్పు (క.)

**ఆడుగోలు** ఒప్పందం (ద.)

**ఆడుబిడ్డ** భర్త తోబుట్టువు, ఆడపడుచు (కో.,ద.)

**ఆడుబొట్టె** ఆడపడుచు, మగని తోబుట్టువు, ఆడుబిడ్డ (క.)

**ఆణిముత్తెం** స్వచ్ఛమైన ముత్యం, అసలు ముత్యం (కో.,ద.,క.)

**ఆణెము** మంచి వంశము, నాణెమైన జాతి (ద.)

**ఆంద్రెబ్బ** పొగరు, అతిశయం, హుమ్మస్సు (కో.,క.)

**ఆంద్రెబ్బగా** విచ్చలవిడిగా తిరుగు (క., నుడి.)

**ఆత్రం** తొందరపాటు, పేరాస, అత్యాశ (ద.,కో.) ఆత్రగాడికి బుద్ధిమట్టం, అవసరం (ద.)

**ఆత్రెనలు** అరిసెలు, నిప్పట్లు (తె.)

**ఆద** ఆదాయం, రాబడి, లాభం (ద.,రా.) చింత, ఆదమరిచి నిద్రించు (కో.,రా.), అర్థ, సగం (తె.)

**ఆదమరపు** నిర్లక్ష్యం, ఇతరత్రాదృష్టి, పరధ్యానం (కో.,ద.) పరాకు, మరపు (కో.)

**ఆదరాబాదరా** త్వరత్వరగా (కో,రా,ద.)

**ఆదరువు** అనుపానం, భోజనంలోకి తయారు చేసే కూర మొదలైనవి (కో,రా.), ఆధారం (క,ద.)

**ఆదాటు** హఠాత్తుగా, సంభ్రమంతో (కో.)

**ఆది** గుడ్డలు కుట్టించుకొనేటప్పుడు, నగలు చేయించుకొనేటప్పుడు కొలతలకోసం దర్జీకి, అగసాలికి ఇచ్చేమాదిరి, నమూనా, కొలతవస్తువు (కో,ద,రా.) ఆకలి, ఆత్రి (ద.), కొలత (తె.)

**ఆదీకం** లాభం (ద.)

**ఆదీనం** కూలి, ముందుగా డబ్బో ధాన్యమో తీసుకొని పనికి వచ్చినప్పుడు ఇదివరలో నిర్ణయించుకొన్న కూలికి పనిచేసేవాడు (కో,ద.)

**ఆదీనం తప్పినది** భర్త మరణించిన స్త్రీ (కో.)

**ఆదుకొను** సాయంచేయు, అవసరానికి అండదండలు కలుగజేయు (కో,తె.)

**ఆదూడ** పెయ్య (తె.)

**ఆదోకుగా** ఆవుతోక మాదిరిగా ముందులావు తర్వాత సన్నంగా కావటం (కో.) రూ. ఆదోకగా.

**ఆదోబాదో** లాభమో, నష్టమో (కో.)

**ఆదొండ** అడవిదొండ వంటిరకం, దొండలలో ఒకరకం (కో.)

**ఆద్రగాణం** కేకలువేసి మోసగించటం, అన్యాయం (తె.)

**ఆన** నీటికి అడ్డంగా వేసేకట్టు, (ద.) వరకు (రా.), వాన (తె.)

**ఆనక** అటుతర్వాత, ఇటుపైని (కో,క.)

**ఆనపకాయ** సొరకాయ (కో,క.)

**ఆనగపుకాయ** సొరకాయ, ఆనబకాయ, ఆనపకాయ (తె.)

**ఆనబ** సొరకాయ, ఆనపకాయ (ద.)

**ఆనమాలు** గుర్తు, సమాచారం తెలియచెప్పి పంపుతూ ఇచ్చి పంపించే వస్తువు (రా,కో.)

**ఆనవాయతి** చాలారోజులనుంచి వస్తున్న ఆచారం, సంప్రదాయం (కో,క.)

**ఆనవాలు** ఆనమాలు (ద,కో,తె.) నాన బోసిన బియ్యంలో బెల్లంకలిపి తయారుచేసిన పదార్థం (ద,నె,కో.)

**ఆనిక** ఆనుకోవటానికి సాధనం, అండ (ద.)

**ఆనికి** తరువాత, ఆనక (కో.)

**ఆనిపోవు** నిలిచిపోవు, ఒకేతీరున ఉండిపోవు (ద,రా.)

**ఆనుగర్రలు** ఎద్దులను విడిచినపిదప బండి నొగలను మీదికిఎత్తి ఉంచటానికి ఆనుగా ఉంచటానికి తాడుతోకట్టి జతచేసిన నిలువు కర్రలు (తె.)

**ఆనుపానులు** సౌలభ్యం, గుట్టు మట్టులు, తెలుసుకోవాల్సిన అన్నిసంగతులు (కో.)

**ఆనువాయి** చాలారోజులనుంచీ వస్తున్న ఆచారం, ఆనవాయి (కో.)

**ఆనె** అరికాలులో కదుము, నడిచేటప్పుడు నొప్పి కలిగించేది (కో,ద,రా.)

**ఆనెక్కు** అటుతర్వాత, ఆనక (కో.)

**ఆంజనేయులతోక** అంతుపంతులేని విషయం, పని (కో,క,ద.)

**ఆనంకాయ** ఆనపకాయ, సొరకాయ (తె.)

**ఆనపతుంబ** సొరకాయబుర్ర, ఎండిన సొరకాయతో చేసిన డొక్కు (క.)

**ఆనుపాను** కీలకం, తగినసాధనం, అసలు విషయం (కో,తె.)

**ఆపచ్చ** ఆపేక్ష, అభిమానం (తె.)

**ఆపటెద్దు** ఆంబోతు, దక్షిణదేశంలో దీన్ని పెరుమాళ్ళమాడు అంటారు, గూళి, సిమ్మాది రప్పన్న, వన్నెకు విడిచిన పశువుఅని కూడా ఆయా ప్రాంతాలలో వ్యవహరిస్తారు (ద.).

**ఆపదమొక్కు** కష్టసమయాలలో దేవుడికి మొక్కుకుంటూ కట్టేముడుపు (కో,రా,తె,ద.)

**ఆపదమొక్కులవాడు** తిరుపతి వేంకటేశ్వర స్వామి (కో,ద,తె.)

**ఆపసోపాలు** ఉస్సురుస్సులు, ఆయాసం చాలాఅలసట పొందటం (కో,క.)

**ఆపళంగా** అట్లానే, ఆవిధంగానే (కో.)

**ఆపళాన** ఆవిధంగా, అటుతర్వాత, వెను వెంటనే (క.)

**ఆపాట** వెంటనే, ఆతర్వాత, ఉన్నట్లుండి (ద,నె,కో.)

**ఆపాట్న** ఆలాగుననే, ఉన్నట్లుండి (కో.)

**ఆపాట్ల** ఆసమయాన, ఆతర్వాత (ద.)

**ఆపారం** వ్యాపారం (తె.)

**ఆపు** మేకు, శెలవు (ద.), అండ (ద,రా.) దానికి ఆపులేదు, వాపు (తె.)

**ఆపుగోర** రెండు అంతస్తులుండేట్లు పోత పోసిన కంచు పాత్ర (క.)

**ఆపుచేయు** నిలుపుచేయు (కో,క,)

**ఆపురు** ఆయువు, ప్రాణం (ద.)

**ఆపోవు** తీరిపోవు, అణగిపోవు (ద.)

**ఆప్యాయనత** ఆత్మీయత (కో.)

**ఆబ** అత్యాశ, మితిమీరిన ఆశ (కో,క.)

**ఆబరించటం** తమది చేసుకోవాలనే తహ తహ, ఎగరేసుకొని పోవాలన్న కోరికతో ఉండటం (క.)

**ఆబీ** మాగాణి, చూ. తాబీ (తె.)

**ఆబురు** గౌరవము, మానము, మర్యాద (తె.) చూ. ఆబోరు

**ఆబెయ్య** ఆవుదూడ, పెయ్యదూడ (ద,తె.)

**ఆబోరు** మర్యాద, పరువు, గౌరవం (కో,క.)

**ఆమంద** ఆమాత్రం (తె.)

**ఆంబోతు** ఆబోతు, అచ్చుపోసి విడిచిన ఎద్దు (కో.)

**ఆమవడ** ఆవడ, పెరుగువడ, త్రైరువడ సెనగపప్పుతో చేసిన వడ (తె.)

**ఆము** పశువు లేతచొప్ప తిన్నప్పుడు వచ్చే రోగము, నాము (తె.) అహంకారం, గర్వం (కో.)

**ఆముదం** అనవసరంగా తగిలే వ్యయ (రా,కో.) దండుగ, వృథాఖర్చు (ద.)

**ఆమెత/ఆమెతి** పెళ్ళివిందు (క.)

**ఆమొయిన** ఆ విధంగా, ఆపాట్న (కో.)

**ఆమైన** ఆ వెంటనే, అట్లానే (ద,కో.) అదే పోకగా (తె.), ఆ విధంగా (రా.)

**ఆమ్మ** పెదతల్లి, దొడ్డమ్మ (కో,ద.)

**ఆయకం** తాకట్టు, కుదువ, హామీ, అ మానం (రా.)

**ఆయకందారు** నీటిపారుదల హక్కున్న వ్యక్తి (ద.)

**ఆయకుడుము** ఆవిరి కుడుము, ఆయికుడుమ (తె.)

**ఆయక్కల్ల** అక్కడ, ఆ ప్రదేశంలో (తె.

**ఆయగాడు** గ్రామంలో నిర్ణీత వృత్తి అవలంబించే వ్యక్తి (తె.)

**ఆయగాండ్లు** గ్రామోద్యోగులు (రా.)

**ఆయంసాయం** అండదండ, రక్షణ (తె.)

**ఆయాసం** ఇబ్బంది, బడలిక, శ్రమ, నిర్వేదం (కో.,క.)

**ఆయికుడుము** ఆవిరి కుడుము, ఆవిటి కుడుము (రా.)

**ఆయిటికాలానికి** సంవత్సరానికి, ఆవిటికి (తె.,క.)

**ఆయినం** వాయినం (తె.)

**ఆయినోళ్ళు** ఉన్న వాళ్ళు, తగినవాళ్ళు, చుట్టాలు (ద.)

**ఆయిన్ని** అవన్ని (తె.)

**ఆయిలాబాయిలా** సాయిలా పాయిలా, యథాలాపంగా (కో.)

**ఆయివెట్టు** ఆవిరితో ఉడికించు (ద.)

**ఆయిస్తా** నెమ్మది నెమ్మదిగా, మెల్లమెల్లగా, తొందరలేకుండా, నిదానంగా (తె.)

**ఆయెల్లి** నిన్న (తె.)

**ఆరది** ఒక పిండివంట, మధుర భక్ష్యం, పాలఆరది, పప్పుఆరది అని రెండురకాలు, పోలాలమావాస్యనాడు కళింగాంధ్రంలో ఇది తప్పనిసరిగా వండుతారు. పెసరపప్పు, ఏలకులు, కొబ్బరి, పంచదార నేతిలో వేయించి చేసే రుచికరమైన పదార్థం (క.)

**ఆరబైలు** పైన ఏమీ ఆచ్ఛాదనలేని విశాలమైన బయలు, మైదానం (రా.)

**ఆరి** కోడిపుంజు మీగాలుపై మొలిచే గోరు (ద.)

**ఆరిక్కమ్మరి** బయటి కమ్మరి (కో.)

**ఆరింగం** మద్యం తాగడంవల్ల కలిగే మత్తు (కో.)

**ఆరిందా** నేర్పరి, నాపసాని, పెద్దరికం ప్రకటించే బాలబాలికల నుద్దేశించి అనేమాట, వయసుకు మించి ఆరితేరిన దానివలె, అనుభవ పరురాలిగా, హావభావాలు, పనిపాటలు ప్రదర్శించే వ్యక్తిని ముఖ్యంగా బాలిక, లేదా యువతిని మెచ్చుకోలుగా సంబోధించే పదం (కో.)

**ఆరిమానిగంగమ్మ** చిత్తూరు జిల్లాలో ఒక గ్రామదేవత (ద.)

**ఆరిశలు జోడు** సులోచనాలు జోడు, కళ్ళ జోడు (తె,ప్రకీర్ణ.)

**ఆరిసీ పారిసీ** దుర్ఘట కార్యము (తె.)

**ఆరుగాలం** ఏడాది పొడవునా, ఎల్లకాలం (ద,రా,తె.)

**ఆరున్నొక్కటి** ఆరు తర్వాత అంకె, ఏదైనా కొలిచేటప్పుడు గాని ఎంచేటప్పుడు గాని ఏడు అనకుండా ఆరున్నొక్కటీ అంటారు; చిన్న పిల్లలు ఏడుస్తున్నప్పుడు ఆరున్నొక్కటి అందుకున్నారనీ, ఆరున్నొక్క రాగమనీ అంటారు (కో,తె,రా,ద.)

**ఆరుపోరు** సంగతి, సందర్భం, ప్రస్తావన (ద.) ఇబ్బంది (రా.) హింస, దుర్భరమైన సంగతి (తె.)

**ఆరుబయలు** ఆచ్ఛాదనలేని బయలుప్రదేశం (కో.)

**ఆరుమున్నూరుకాలం** నిరంతరం, ఎల్లప్పుడు (ద.)

**ఆరుమూడగు** చెడిపోవు, వ్యర్థమగు (కో,ద,తె.)

**ఆరుమూడైనా మూడుఆరైనా** ఎట్లానైనా, ఏ సందర్భంలోనైనా, తప్పనిసరిగా (కో.,రా., ద.)

**ఆరుమూళ్ళు** కష్టాలు, చిక్కులు (క.), వ్యర్థమైన ప్రయత్నాలు (కో.)

**ఆరుమెడయిచ్చు** కాలికి బుద్ధిచెప్పు, ఓట మితో పరిగెత్తిపోవు, ఎద్దులు పోట్లాడుతూ అందులో ఒకటి వెనకకు తిరిగి పారిపోవు (ద.)

**ఆరువాసి** కొంత మేలురకం (ద.)

**ఆరుళ్ళు** ఉడికించి ఆరబెట్టిన వడ్లు (ద.)

**ఆరె** బండిగీర బద్దీకి (కుండ) చుట్టూలకూ (పూటీలకు) నడుమ ఉండే నిలువుకర్రలు (తె.) కోడిపుంజు కాలిపై మొలిచే కూచిగోరు (ద,రా.)

**ఆరెమరాటీలు** బొమ్మలాటలవాళ్ళు, మహా రాష్ట్రంనుంచి వచ్చినవారు, సంచారజాతులవాళ్ళు (తె,ద,రా.)

**ఆరేకలు** ధాన్యం (ద.)

**ఆరేటి బాతు** రంగురంగుగుగల చిన్న నీటి బాతు (ద.)

**ఆరేరు** దున్నుతున్న నాగళ్ళ చాలులో రెండో నాగలి, మొదటిది ముందేరు (ద.)

**ఆర్చుకొని** తెలుసుకొని, కనుక్కొని, అరుసుకొని (తె.)

**ఆర్చుకొని** తీర్చుకొని మందకొడిగా, నిదానంగా (కో.)

**ఆర్భాటం** కొంచెం విషయాన్ని గొప్పగా ప్రకటించటం, ఉన్నదానికన్నా మిన్న చేయటం (కో.)

**ఆలగోడు** పశువుల కష్టం (ద.)

**ఆలతి** చూ. అడితి, అశితి (రా.)

**ఆలాకు** వ్యర్థం (రా.)

**ఆలాజాలం** సంతోషం, సరదా, చీకూచింతా లేకపోవటం (ద.)

**ఆలావన** ఎడతెగని ఆలోచన, జ్వరంవల్ల కలిగే పలవరింపు (ద,కో,తె.)

**ఆలాయపడటం** తటస్థపడటం, వాలాయం కావటం, సందర్భపడటం (కో.)

**ఆలిచింతలు** అలచందలు, బొబ్బర్లు (తె.)

**ఆలు** నూలును పడుగుచేసే సాధనం (ద.)

**ఆలుగడ్డ** బంగాళాదుంప, ఉర్లగడ్డ (తె.)

**ఆల్తి** కొలత, నమూనా, ఆది (రా.)

**ఆవ** గడ్డివామి, మేట (కో.) చిత్తడిభూమి, మెతకనేల (కో.)

**ఆవకాయపేడు** ఆవకాయ బద్ద (కో.)

**ఆవగించు** కూరలు వండేటప్పుడు ఆవ పెట్టు, మాంసాదులు నిలువవుంచటానికి పసుపు ఉప్పుతో రుద్దిఉంచు (ద.)

**ఆవడి** నింద, రచ్చ, వదంతి, పుకారు (ద.)

**ఆవతినడం** వికటించేదితినటం (క.)

**ఆవలయెల్లుండి** ఎల్లుండి తర్వాతరోజు (కో, ద,రా,తె.) మర్నాడు (ద,నె.)

**ఆవలిమొన్న** నేటికిమూడురోజుల ముందు (తె.)

**ఆవలు** ఇటికబట్టీల ఆవాలు (క.)

**ఆవికుడుము** చూ. ఆయికుడుము (రా.)

**ఆవిటి** కర్కాటకసంక్రాంతి, పెద్దపండుగకు తీసుకొని ఆవిటికి ఇస్తామని ఇచ్చారుకారు (క.)

**ఆవిటిబూను** వర్షరుతువు ప్రారంభమగు (ద.)

**ఆవిబట్టు** ఆవిరితో ఉడికించు (ద.)

**ఆవిరికుడుము** ఆవిరిపై వండినది (ద,రా, తె,కో.)

**ఆవిరిలాడు** అనుకున్నపని అయినదాకా తహ తహలాడు (కో.)

**ఆవిరిల్లు** కలతచెందు (ద,రా.)

**ఆవునోటివాడు** రహస్యం దాచలేనివాడు (ద,చి.)

**ఆవురావురను** అదేపనిగా విలపించు (ద.), జబ్బుపడి లేచినతర్వాత ఆహారానికై అదేపనిగా తొందరపడు, దేనికైనా తొందరపడు, మిక్కిలి తొందర (కో.)

**ఆవురుకొను** మెల్లగా ఉమ్మగిల్లు (కో.)

**ఆవురుమను** దుఃఖాన్ని అతిశయంగా ప్రకటించు (కో.)

**ఆవులలో ఆపటెద్దుపడినట్లు** గందరగోళము (ద.)

**ఆవేశం** సంధి, గుణం కన్పించటం (కో.)

**ఆషాఢభూతి** వంచకుడు, మోసగాడు (క, కో,ద.)

**ఆషామోషీ** ఆషామాషీ, అప్రయత్నత (కో.)

**ఆసాదికూతలు** అశ్లీలపు మాటలు (ద,రా, తె.)

**ఆసం** వాసం, దూలం (తె.)

**ఆసన** కంపు, దుర్వాసన(తె.)

**ఆసాది** హరిజనులలో ఒకతెగ (ద,కో.), గ్రామదేవతను స్తుతించేకులం వారు (ద,కో.)

**ఆసాదించు** చక్కగ అలంకరించు (రా.)

**ఆసాదివాడు** కడజాతిలో శవ సంస్కారం జరిపించేవ్యక్తి (రా.)

**ఆసానీగా** సులభంగా, అశ్రమంగా (తె.)

**ఆసామి** శ్రీమంతుడు, స్థితిమంతుడైనరైతు, పెద్దమనిషి (ద,కో.)

**ఆసికింత** కొంచెం (ద.)

**ఆసిగం** హాస్యం (క,తె.)

**ఆసము** బియ్యపుపిండితో చట్టిలో కాల్చిన దోసెవంటిది, మధ్య ఉబ్బుగా వుంటుంది (ద.)

**ఆసరా** దన్ను, సహాయం, అండదండలు, తోడు (క.)

**ఆసు** నూలును పడుగుచేసే సాధనం, చేపలు పట్టేది (ద.)

**ఆసుపోసినట్లు** నిర్విరామంగా(తె.)

**ఆసెగాడు** హాస్యగాడు (తె.)

**ఆసోదా** మజిలీ, మకాము (ద.)

**ఆస్తి** ఆశ, ఇష్టం, ఆసక్తి (తె.)

**ఆస్తిగా** తరచుగా, ఎక్కువగా (ద.)

**ఆస్మాన్‌గిరి** చిలకలపందిరి, పసిపిల్లల ఉయ్యాలకు (తొట్లెకు) రంగు కాగితాలు, పూల చెండ్లు గిలకలు మొదలైనవి కట్టి వాళ్ళను వినోదింపచేసే సాధనం, చక్కి (తె.)

**ఆస్మాన్‌రంగు** నీలిరంగు, ఆకాశంరంగు (తె.)

**ఆస్తే** నెమ్మది నెమ్మదిగా (తె.)

**ఆళితి** కుట్టటానికి ఇచ్చేఅది, నమూనా,కొలత (రా.)

**ఆళు** సత్తువ, బలం (కో.)

**ఆళువ** వాగు (రా.)

**ఆళ్వారుగడ్డ** చిలగడదుంప, గరుసుగడ్డ, గెనుసుగడ్డ (ద.)

# ఇ

ఇక్కెర హారతికర్పూరం (తె.)

ఇగటాల మాటలు ఉత్తుత్తి మాటలు, ఎగతాళి మాటలు (క.)

ఇగిరం విగ్రహం (తె.)

ఇగిలిచ్చు నవ్వు (తె.)

ఇగిలింపు నవ్వు (కో,తె.)

ఇగో ఇదుగో (తె.)

ఇగ్గుకుంట లాగుతూ (తె.)

ఇగ్గుత లాగుతూ (తె.)

ఇంగలము నిప్పు (కో,తె.)

ఇంగితం ఆంతర్యం (కో.)

ఇంగితజ్ఞానం సదవగాహన, ఇది మంచి ఇది ద్ద అని తెలుసుకోగల అవగాహన, సత్తా (కో.)

ఇజారా వేలంలో కొన్నభూములు మొ॥ ఒక హక్కుకోసం పాడేపాట (కో,ద.)

ఇజ్జత్ పరువు, పరపతి, మర్యాద, గౌరవం (తె.)

ఇడుగుపెట్టటం మాగాణి భూమిని మొదటి సారి దున్నటం (తె.)

ఇండ్ల ఇందులో (తె.)

ఇంటిలిగట్టు పన్నుకట్టే ప్రాంతం (క.) బండి మొదలైనవి ఊళ్ళోకి వచ్చేప్పుడు సర్కారు వారు విధించిన పన్నుకట్టవలసిన చోటు, 'టోలు గేటు' (క.)

ఇత్తలా వర్తమానం చేయటం (తె.)

ఇత్తవ కల, సంగతి సందర్భాలు, కథా కమామిషు, విషయం (క.)

ఇత్తెహాద్ ఏకత, ఐకమత్యం (తె.)

ఇదుగు ఇరాము విరామం (తె.)

ఇదరంఅపోస్టో ఒకరికొకరు (చి,దే.), (తె.)

ఇద్దె విద్య (తె.)

ఇనాం బహుమతి (తె.)

ఇన్నూమన్ను మిన్నూమన్నూ (క.)

ఇన్ని విన్నారు (క.)

ఇంతజార్ వేచిఉండటం, ఎదురుచూస్తూ ఉండటం (తె.)

ఇంతెజాములు ఏర్పాట్లు (తె.)

ఇన్సాఫ్ న్యాయం (తె.)

ఇప్పటిసంది ఇప్పటి నుంచి (తె.)

ఇయాల ఈరోజు (కో,తె.)

ఇరకత్తె వియ్యపురాలు (క.)

ఇరకాటం ఇరుకు, తగినంత జాగాలేకపోవడం (కో.)

ఇరాము విరామం (తె.)

ఇలపీట కత్తిపీట (తె.)

ఇలాఖా సంబంధం, సంబంధించిన (కో.)

ఇలాచీలు ఏలకులు (తె.)

ఇల్లాకాతల పెరట్లో, ఇంటి వెనుక, ఇంటి వెనుక పెరడు (క.)

ఇల్లుటం ఇల్లరికం, (తె.), ఇల్లటం (కో.)

ఇవిటి వీటి (తె.)

ఇవిటిత వీటితో (తె.)

ఇషారా చూ. ఇసారా, సంజ్ఞ, హెచ్చరిక (క,నుడి.)

**ఇసారా** ఉషారు, ప్రోత్సాహం, దన్ను, వత్తాసు, ప్రోద్బలం, మద్దత్తు (క.)

**ఇసారాలు** విచారాలు (తె.)

**ఇసుర్రాలు** తిరగలి (కో,తె.)

**ఇసేబు** పద్దు (క.)

**ఇస్టేమెంటు** అంచానా (క,కో.)

**ఇస్తముకద్దరు** అభియోగం, కేసు (తె.)

**ఇస్లాహి** రాజకీయశాఖ, ప్రభుత్వ యంత్రాంగ శాఖ (తె.)

## ఈ

**ఈడ** ఇక్కడ (తె.)

**ఈతపాలు** ఒట్టిపోయిన ఆవును మళ్ళీ అది యీని పాడిఆవుగా పరివర్తన చెందటానికి మధ్య కాలమంతా దానిని సంరక్షించటానికి తగిన వారికి అప్పగించే పద్ధతి, ఒప్పందం, కొన్నాళ్ళకిందట పల్లెటూళ్ళలో అమలులో ఉన్న జీవన విధానము (కో.)

**ఈతమజ్జిగ** కల్లు, తురకదాసరికి ఈతమజ్జిగ (కో.)

**ఈతాట** ఈతకొట్టటం, ఈదులాట

**ఈదర** వణుకు పుట్టించేగాలి, చలిగాలి (కో,తె.)

**ఈనపుడకలు** విస్తళ్ళుకుట్టే పుల్లలు, ఈన బద్దలు (క.)

**ఈపు** వీపు (తె.)

**ఈరంగం** ఆవేశం (కో,తె.)

**ఈలచెట్టు** సరుగుడు చెట్టు, సర్విచెట్టు (కో.)

**ఈసుడుపురుగు** ఈలపురుగు (క.)

## ఉ

**ఉగ్గపట్టటం** నిరాహారత, నియమపాలనం ఉదా: కూడుగ్గపట్టటం (కో,తె.)

**ఉంగిడి** జొన్న మొ॥ చేలల్లో పంట కోసి వేసిన తరవాత దుంపలు చిగిరించినప్పుడు ఆమొలకలు తింటే పశువులకు వచ్చేరోగం (కో,క.)

**ఉజౌ** జట్టు, కూటమి, సమస్కంధుడు, చిన్న పిల్లలు చిన్న చిన్న రాళ్లు పేర్చిన్నీ, గవ్వల తోనూ ఆడే ఆటలో సాధించేపట్టును కూడా ఉజ్జా లంటారు (కో.)

**ఉడాయించు** పరుగుతీయు, కాలికిబుద్ధిచెప్పు, పిక్కబలంచూపు (క.)

**ఉడికించు** రెచ్చగొట్టు (కో,క.)

**ఉడుకుమోతు** త్వరగా కోపంతెచ్చుకొనే వ్యక్తి, ఈర్ష్యాళువు (కో.)

**ఉడుకుమోత్తనం** ఓర్వలేనితనం, త్వరగా కోపం తెచ్చుకొనేస్వభావం (కో.)

**ఉడుచు** నాటు (క.)

**ఉడుపుటాకు** నాట్లకట్టలు, నాట్లు, (పొలంలో నాటవలసిన వరిగమొక్కలు, వరినారు మొదలైనవి) (క.)

**ఉడుబోతుకాయ** కుక్కమూతిపిందె, చెట్టు ఉడిగిపోయేనాటికి కాసేకాయ (ద.)

**ఉద్దూలం** బ్రంహాండం, అతిఘనం, విడ్డూరం (కో.)

**ఉద్దోలం** సాటిలేని, ఉప్పొంగుతూ ఉండే (క.)

**ఉండ** బండిచక్రపు ఇరుసు (క.)

**ఉండరాములు** నిర్బంధాలు, కష్టాలు, నిలువ నీడలేనిస్థితిగతులు, పరిస్థితులు (ద.)

**ఉండీఉడిగీ** కొంచెంకొంచెం విరామంతో (కో,క.)

**ఉతకటం** బట్టలు బాగుచేయటం, ఒంటిమీద దెబ్బలుకొట్టటం, అధికారం చెలాయించటం (కో.)

**ఉత్కర్తనం** ఆయుర్వేద పరిభాష, పాము మొదలైనవిషకీటకాలు కాటువేసి నప్పుడు ఆకాటు పైన కత్తితో గాటు పెట్టటం (కో.)

**ఉదాసభావం** ఉదాసీనత, పట్టనట్లు ఊర కుండిపోవటం (క.)

**ఉద్దెర** అరువు, అరువుతేవటం, అరువుఇవ్వటం (తె.)

**ఉనక** ఊక (తె.)

**ఉన్నపళంగా** ఉన్నట్లుగాఉండి, తక్షణమే (కో,క.)

**ఉన్నపాళాన** చూ. ఉన్నపళంగా (కో,క.)

**ఉపచారం** సేవ, పరామర్శ (ద.)

**ఉపపన్నుడు** ధనవంతుడు (ద,కో.)

**ఉపాసం** ఉపోషము,

**ఉప్పుకొనటానికి పోవటం** చనిపోవటం (క.)

**ఉప్పుపత్రీ** లెక్కాజమా, జమాలెక్క (క.)

**ఉబలాటం** ఉత్సుకత, మిక్కిలిఆసక్తి (కో).

**ఉబుసు** ప్రసక్తి, జోలి, సంగతి, విషయం (కో,ద,క.)

**ఉబ్బాయించటం** పీకటం, పెరకటం (తె.)

**ఉబ్బు** పట్టలేని సంతోషం (తె.)

**ఉమరావులు** శ్రేణినాయకులు, మిక్కిలి సమర్థులు (క.)

**ఉమ్మడిదమ్మడి** కలగాపులగం (కో.)

**ఉమ్మిరి** పుష్కలత్వం, సమృద్ధి (క.)

**ఉమ్మేజువ్వారి** జీతభత్యాలు లేకుండా పని నేర్చుకోవటం, కొలువు శిక్షణ (కో,క.)

**ఉరుకులు** పరుగులు (తె.)

**ఉరువు** బరువు, పరిమాణం (కో,ద.)

**ఉర్లగడ్డ** బంగాళాదుంప, ఆలుగడ్డ (కో.)

**ఉలాసిగాకొట్టటం** ఈడ్చికొట్టటం (తె.)

**ఉలిపిరికొట్టు** ఓర్పులేనివాడు (క,నుడి.)

**ఉల్టా** తలకిందులు (తె.)

**ఉల్లాకు** బంగారుతూచి విలువకట్టటం (క.)

**ఉల్లె** పిండిముద్ద (రా.)

**ఉశారు** ఉత్సాహం, హుషారు (తె.)

**ఉసిక** ఇసుక (తె.)

**ఉసిరికకుండ** ఉసిరికపప్పుని రుబ్బి ఊక కట్టిన మూటచుట్టూ పట్టువేస్తూ కుండలాతయారు చెయ్యటం. కుమ్మరిచేసిన కుండ మడికి పనికిరాదని చాదస్తపు అగ్రహారాల కుటుంబాల వెనకటి రోజుల్లోని ఆచారం (క.)

**ఉస్కె** ఇసుక (తె.)

**ఊక** నీరసమైనది, తవుడు, పొట్టు (కో,క.)

**ఊకదంపు** పనికిమాలిన, నిష్ప్రయోజన మైన (కో,క.)

**ఊకు** ఊడ్చు (తె.)

**ఊకె** ఊరికె (తె.)

**ఊంచ** చువ్వ (కో.)

**ఊంచిననేల** ఊబినేల (క.)

**ఊంజ** వలతాళ్ళు (క.)

**ఊంటపట్టు** మంచినీటి ఊట (కో.)

**ఊంబి** ఉబ్బలి, కాలుపెడితే దిగిపోయే చిత్తడి నేల (కో.,క.)

**ఊష్ణం** జ్వరం (క.)

# ఎ

**ఎక్క/ఎక్కు** దీపం గోడకు తగిలించే లాంపు, గోడ లాంతరు (తె.)

**ఎక్సాను** లాభం (తె.)

**ఎగురుడు** మీది మీదికి వచ్చు (క,కో.)

**ఎగుడు** ఎత్తు, మిట్ట, మెట్ట (ద.)

**ఎగుసం** వ్యవసాయం, సేద్యం (తె.)

**ఎంగిలిపడు** పొద్దున లేచి ఏదైనా తిను (తె,కో.)

**ఎంచులు** ఆక్షేపాలు, ఎద్దేవాలు (కో.)

**ఎట్టి** వెట్టిచాకిరి (తె.)

**ఎడపతెడప** అడపాదడపా (ద,రా.)

**ఎంటికలు** వెంట్రుకలు, కేశములు (తె.)

**ఎండకాగడం** ఎండకు నిలిచి వొళ్ళు వెచ్చ చేసికోవటం (క.)

**ఎండుగాలం** ఎండాకాలం (తె.)

**ఎతరాజ్** ఇష్టపడకుండు, అసమ్మతి ప్రకటించు (తె.)

**ఎత్తరువు** భారీ, పొడుగుపాటి, ఎత్తైన (కో.)

**ఎత్మెనా** నమ్మకం (తె.)

**ఎదురుకోళ్ళు** వివాహోత్సవంలో వధువు తరపువాళ్ళు వరునివాళ్ళకు సలిపే ఆదర సత్కారాలు, స్వాగత సన్నాహాలు (కో,రా,ద,తె.)

**ఎద్దడి** నీటికొరత (కో,ద.)

**ఎనకసిరి** తరువాత, వెనుక (తె.)

**ఎనికిటి తీర్గ** ఎనికిటి తీరుగా, వెనుకటివలెనే, మునుపటిలాగే, ఇంతకుముందు మాదిరిగా (తె.)

**ఎనుకలాడి** వెదికి, వెదుకలాడి (తె.)

**ఎన్క** వెనక (తె.)

**ఎన్కాల** వెనకభాగం (తె.)

**ఎంబడి** వెంబడి, వెంటనే (తె.)

**ఎరిక** గుర్తు, గుర్తుపట్టటం, తెలుసుకోవటం (తె.)

**ఎరికకావటం** తెలియటం, తెలుసుకోవటం (తె.)

**ఎరుక** తెలివి, తెలిసిఉండటం (తె.)

**ఎరువుసొమ్ము** ఇతరులనుంచి తెచ్చుకొన్న నగ మొదలైనవి (కో,క,రా.)

**ఎలిగొడ్లు** ఎలుగ్గొడ్లు (ద.)

**ఎల్లు** వెళ్ళు (తె.)

**ఎల్లెలుకల** వెల్లకిల (తె.)

**ఎవకల** వేకువ, తెల్లవారుఝామున (క.)

**ఎవారం** వ్యవహారం (తె.)

**ఎవుసాయం** వ్యవసాయం (తె.)

**ఎహత్యాల్** జాగ్రత్తగా (తె.)

# ఏ

ఏంటి ఏంది? (తె.)

ఏంటిది ఎందుకు? (తె.)

ఏకటాకీ ఎడతెగకుండా, ఒకే మాటపై, ఏక వాక్యంగా (కో,క.)

ఏకరుపుపెట్టటం పదే పదే అదే విషయం మాట్లాడటం, నొక్కిచెప్పటం (కో,క.)

ఏకులు దారం తీయటానికి తయారుచేసిన దూదిపింజెలు (కో,క,తె.)

ఏగిరం వేగిరం, వెంటనే, శీఘ్రం (తె.)

ఏతంపెట్టు అధికాధికం (కో.)

ఏతరాజ్ అభ్యంతరం (తె.)

ఏనాం సముద్రము (క.)

ఏనాపొద్దు చెలియలికట్ట (క.)

ఏరు నాగలి, ఎద్దులను కట్టి దున్నటానికి సిద్ధపరచిన నాగలి (క,ద,కో,గా.)

ఏర్భాయి ఏ ర్పాసి, దేబె

ఏష్ట విసుగు (తె.)

ఏష్టొచ్చింది విసుగొచ్చింది (తె.)

ఏసంగి ఎండాకాలం, వేసంగి (తె.)

# ఐ

ఐరేని కుండలు బచ్చెనపని చేసిన పెండ్లి కుండలు (తె.)

# ఒ

ఒక్కకోక ముక్కలు తోబుట్టువులు (క.)

ఒగ్గోళ్ళు ఒగ్గుకథ చెప్పేవాళ్ళు (తె.)

ఒడాలు వడియాలు (తె.)

ఒడినింపటం వివాహాది శుభకార్యాలలో వధువు వొడినిండా బియ్యం పోసి మూట కట్టటం (కో,తె.)

ఒడుపు నేర్పు, చాతుర్యము, నైపుణి (క, కో.)

ఒడ్డిగిలు ఒత్తిగిలు, పక్కకు ఒదుగు (కో.)

ఒంటకాలు వంటకాలు (తె.)

ఒత్తుకోవటం స్నానానంతరం తడి తుడుచుకోవటం (కో.)

ఒప్పన్నం ఒప్పందం, అంగీకారం

ఒబ్బట్టు బొబ్బట్టు (క.)

ఒయినం వైనం, తీరు, విధం (తె.)

ఒరగపెట్టి పక్కగాఉంచి (తె.)

ఒరగల్లు ఒర (క,నుడి.)

ఒరపి తెరిపి, విరామం, ఉపశమనం (రా.)

ఒర్లటం వాగటం (తె.)

ఒర్లు గడబడగా వాగు (తె.)

ఒల్లకుండు ఊరకుండు, మౌనంగా ఉండు (క,నుడి.)

ఒల్లెక్కాలకు అబద్ధాలు, హాస్యాలు, పరాచకానికి అబద్ధంచెప్పటం (తె.)

ఒసిలి వదులు (క.)

## ఓ

**ఓడు** ఓటమి, అపజయం (క.)

**ఓపలేనిది** గర్భిణి (క,నుడి.)

**ఓమనగుంటలు** వామనగుంటలు, (కో,క.) ఆడపిల్లలు గచ్చకాయలు, గిల్లాలు, చింతపిక్కలు పోసి, కొయ్యగుంతలలో ఉంచి ఆడే ఆట.

**ఓంబాయి** పల్లకి లేదా మేనా మోసే వ్యక్తి (కో.)

## ఔ

**ఔపాసనం** నిషేకం, శోభనం, గర్భదానం (కో.)

## క

**కక్‌నీళ్ళు** బియ్యంకడిగిన నీళ్ళు, కుడితి (ద.)

**కకాపికలు** చెల్లాచెదురు (క.)

**కకావికలు** చెల్లాచెదురు (తె.)

**కక్క** పినతండ్రి, చిన్నాయన (ద.) పాయసం (ద,సే.) సంకటి (ద,చి.) పాడె (క.)

**కక్కగట్టు** పాడెగట్ట అనేతిట్టుగా ప్రసక్తం (క.)

**కక్కరాలు** గోధుంపిండి, బెల్లం, కొబ్బరి కోరు పాకంలో పూర్ణంపెట్టి తయారుచేసిన పిండి వంట (క.)

**కక్కసం** తప్పనిసరి, కక్కసంగా నిలబెట్టి డబ్బు పుచ్చుకొన్నాడు (తె.)

**కక్కను** మరుగుదొడ్డి (ద.)

**కక్కనుకొట్టు** మరుగుదొడ్డి (క.)

**కక్కాయి** పినతండ్రి, కక్క (కో,చి.)

**కక్కిర** చిన్నచిన్న మచ్చలుగల కోడిపుంజు, పొడకోడి (ద.)

**కక్కు** తిరగలికి కొట్టేగాటు, కత్తివాదరకు (ముఖ్యంగా కొడవలికి) కొట్టేగాటు, కొడవలికి కక్కుకోసినారు, తిరగలికి కక్కుకొట్టారు (కో, ద.) గంటు (క.) ముల్లు వేయటం. (రా.) బిచ్చగాళ్ళలో ఒకతెగ (కో.)

**కక్కుటాకు** పసిపిల్లలు పాలు కక్కుకుంటూ ఉంటే అటువంటి బిడ్డలవేలికి తొడిగే సన్నటి ఉంగరం (ద.)

**కక్కుర్తి** అత్యాశతో లేదా దైన్యంతో తగని పనికి పాల్పడటం, ఆశపోతుతనం (ద,కో,తె.)

**కక్లూతు** కక్కుర్తి (రా.)

**కంక** వెదురు (తె.)

**కంకగుల్ల** వెదురుపేళ్ళ బుట్ట (తె.)

**కంకడం** దెప్పిపొడవటం (కో.)

**కంకణాయి** బిగ్గరగా కూతపెట్టే పిట్ట, బిగ్గరగాస్ఫుటంగా మాట్లాడేరీతి (కంకణాయిలా పలికాడు) (ద.)

**కంకపెనాలు** వెదుళ్ళబీడు (తె.)

కంకాళం పెద్దఆకారం (ద.)

కంకి బలవంతంగా గుంజితెచ్చే తీరు ఉదా: వాడి దగ్గరనుంచి కంకి తెచ్చాడు (కో.)

కంకు నోటిలో పెట్టుకొని పళ్ళతో కరచి తినటం, తిట్టు (తె.)

కంకెడు కమికెడు (తె.)

కంకోష్ఠం కొరకరాని కోయ్య (తె,క.) ఉదా: కంకోష్ఠపద్యం.

కంగలు వేయించిన శనగలు (క.)

కంగాణంచేయు ధాన్యాన్ని నురుచు (రా.)

కంగా బంగా అస్తవ్యస్తంగా, తీరుతెన్ను లేకుండా (కో.)

కంగారు తొట్రుపాటు, కలత, ఆందోళన (కో.)

కంగాలు హీనము, చెడినది, నీచము ఉదా. వాడొట్టి కంగాలోడు (తె.)

కంగాళి అల్లరి, గోల, గొడవ (క.)

కంగించటం గుట్టు బైటికి తీయటానికి యత్నించటం, బైటికి లాగటానికి ప్రయత్నించు (క.) కదిలించు, ప్రోత్సహించు, రెచ్చగొట్టు (ద.)

కంగు సరిహద్దు (ద.) మడత, ఉగ్గు (కో,ద.) గాభరా (కో.) పాలమీద మీగడ (తె.)

కంచరబండి కంచర సామాను (ఇత్తడి పాత్రలు) అమ్మటానికి ఊరూరా తిరిగే బండి (రా,ద.)

కంచి కంచె (తె,ద.)

కంచి ఇడ్లి మామూలు ఇడ్లీ కాకుండా మసాలా లేదా కూరగాయల ముక్కలు కూడా వేసి ఉడికించిన ఇడ్లీ (ద.)

కంచిమేక మేకలలో మేలుజాతి, పొట్టిగా ఉంటాయి, ఈతకు రెండు పిల్లలను ఈనుతాయి.

కంచుగంటలాగా గొంతు రాసుకోకుండా ఠంగుమనే ధ్వని. ఉదా॥ వాడు కంచుగంటలా మాట్లాడతాడు (రా,ద,కో.)

కంచుడి అన్నంతినే పాత్ర (క.)

కంచుడు మట్టిగిన్నె, మూకుడు (తె.)

కంచుపదును మంచిపదును, సున్నితం (తె.)

కంచువట్టలు (లది) (లవాడు) గయ్యాళి, పెత్తనం చెలాయించేది (క,కో.) మగవాని విషయంలో ధైర్యశాలి, సాహసి

కంచె బీడు (తె.)

కంజాయింపు సరిఅయిన అంచనా, అంచనాకు తగిన అమరిక, సరిఅయిన ఏర్పాటు, హంగు (కో.) లోటు లేకుండా చక్కగా ఏర్పాట్లు చూసి నిర్వహించటం

కంజాయింపుచేసి సరిగా అమర్చి, బోధించి, మప్పి (క.)

కంజీమంచం పేము బెత్తం చీల్చిన పోగులతో అల్లిన మంచం (ద,రా.)

కంజు చేనిచుట్టూ ఉంచే రాతిగోడ, కంచెగోడ (రా.)

కండసరి కంటె, మెడలో ధరించే ఆభరణం (కో,ద.)

కంటికి ఆను గౌరవార్హతను, మర్యాదను ఇతరులనుంచి రాబట్టుకొనగలిగి ఉండటం (కో, ద.)

కంటినీరు తుడుచు ఓదార్చు, ఉపశమింపచేయు (కో,రా.) ప్రయోజనంలేని ఊరడింపు, కృతకమైన సానుభూతి కనపరచు (ద.)

**కంటినీరు పోయు** అపరకర్మ రోజులలో కర్మచేసిన వ్యక్తిని ఓదార్చే ఆనవాయితీగా పందిట్లో నిలిపిన కొయ్య గూటాలపై సగోత్రులు నీళ్ళు విడవటం (ద.)

**కంటిపులి** ఎద్దుకు కంటిదగ్గర ఉండే సుడి (ద.)

**కంటిబెదురు** కొట్టకుండా గద్దరింపుతోనే పిల్లలను హద్దులో ఉంచటం, బెదిరించి భయంలో ఉంచటం (కో.)

**కంటిలో కారంచల్లు** మోసగించు, వంచించు (కో,తె.)

**కంట్లపునూనె** గానుగలోనుంచి అప్పుడే తీసిన నూనె (తె.)

**కంట్లాం** అరవైనాలుగు వీశెలబరువు (క.)

**కండ** సత్తువ, బలము, కండగల నేల (క, ద,రా,తె.) శిశువు (క.) కండని కుండను చేశాం అని విశాఖ వాడుక, తిట్టు (తె.)

**కండసక్కెరి** కండచక్కెర, కలకండ (రా.)

**కండువా** మడిచిన ఉత్తరీయం, పేటుత్తరీయం (క.)

**కంౖడ** కనరు, కరుడు (కో.)

**కండ్లకుట్టు** కళ్ళకలక (రా.)

**కండ్లవెఱ్రి** విపరీతమైన ఆకర్షణ (ద.)

**కండ్లు బైర్లుకమ్ము** చూపు మసకలు కమ్ము (కో,తె.)

**కండ్లొచ్చినై** కళ్ళు నొచ్చినవి, కళ్ళు కలిగినవి (తె.)

**కంత** బొక్క, కంచెలోని చిన్న ఇరుకుదారి (ద,రా,తె.) పెళ్ళివంటి శుభకార్యాలలో పప్పు, బియ్యం, ఉప్పు మొదలైన వస్తు సంభారాలు పెళ్ళివారికి విడిదిలో ఇచ్చే ఏర్పాటు (ద.) కణత, కంటి పైభాగం (తె.)

**కంతి** దెబ్బ తగిలి ఏర్పడిన నొప్పి, కణితి, గంతి (రా,ద,తె.)

**కంతికూన** పుంటిమొన, పుండు? (కో.)

**కంతిఅరిస** (కంతరిసె) పెద్ద అరిసె, పెద్ద నిప్పటి (క.)

**కంతిరీగ** తేనెటీగ, కందురీగ (ద.)

**కంత్రీ** నకలు, మోసం, సంకరం, వంచనం, డాబుసరి (కో,రా,ద.)

**కంతు** వాయిదా, కిస్తీ, దఫా (ద,రా.)

**కంద** గణుసుగడ్డ, చిలగడ దుంప, రత్నపురి గడ్డ (తె.)

**కందకంద** అతిమెత్తన కావటం (తె.)

**కందకం** పొలంలో నీరు బయటికి పోవటానికి తీసే చిన్న కాలవ (ద.)

**కందపెట్టె** వివాహ సమయంలో పెళ్ళికొడుకు వెంట ఒకరు మోసికొనిపోయే పేపసజ్జ లేదా పెట్టెవంటిది, దీంట్లో ఒక కందగడ్డ ఉంటుంది. కందలాగా పిలకలతో ఈ దాంపత్యం వర్ధిల్లాలని శుభాశంసనము, సంకేతము (ద.)

**కందమూలం** చిలకడదుంప, గణుసుగడ్డ (క.)

**కందమ్మ** కసిగందు, పసికందు, పొత్తులలో బిడ్డ అని అర్థం (రా.)

**కందా** వంటశాల, వంట, భోజనపు ఏర్పాటు (కో.)

**కందాయం** భూమిశిస్తు (రా.)

**కందిము** పందిటి గుంజ; బాజా (కో.)

**కందిరీగ** తేనెటీగ, కంతిరీగ, కందురీగ (రా,తె,కో.)

**కందిలి** లాంతరు, లాందరు, కందిలు (తె.)

**కందిలు** లాందరు, కందిలి (ద,తె.)

**కందురీగ** చూ. కంతిరీగ, కందిరీగ (ద.)

**కందూరి** పీర్లపండుగ సమయంలో పీర్లకు భక్తులు నివేదించే మాంసభోజనం, దీనితో జరిపే ఉత్సవం (కో,రా,ద,తె.)

**కందెనబెట్టు** నష్టపరచు, వంచించు (తె.) పని జరుపుకోవటానికి చేసే ఉపాయ సాధనం (రా,ద.)

**కంపరము** శవవహనంలో కలిగేగగుర్పాటు, పాడె విసుగు (తె.)

**కంబడి** కంబళి (ద.)

**కంబారి** జీతగాడు, పనివాడు, సేవకుడు, కమతగాడు (క.)

**కంబి** కమ్మి, తక్కువ (ద.)

**కంబోరు** కమ్మవారు (తె.)

**కచిక** పిడకకాల్చిన బూడిద (కో,ద.)

**కచ్చ** నాటు, మొరటు, సరిగాపండని (తె.) పగ, కక్ష (రా.)

**కచ్చకాయలు** గచ్చకాయలు (తె.)

**కచ్చదం** బండి (తె.)

**కచ్చపోతు** చూ. కచ్చిపోతు (ద.)

**కచ్చపోయు** గోచిపెట్టు (తె.)

**కచ్చబిగించు** పోట్లాటకు సిద్ధమగు, పంచ ఎగగట్టినిలుచు (తె.)

**కచర** చెత్త చెదారం (క.)

**కచ్చలుగిల్లటం** విరోధాలు కల్పించటం, కక్షలుపెంచటం (రా.)

**కచ్చాపచ్చా** తెగతెంపులు, వైమనస్యం (ద.) అపరిపక్వం, పచ్చిగా, కసురుగా (కో.)

**కచ్చి** కోపస్వభావంగల, పోట్లాడేస్వభావం గల (రా.)

**కచ్చిపోతు** పగసాధించేవాడు, కుళ్ళుపోతు, కక్షసాధించేవాడు (ద.)

**కచ్చు** గుడ్డలు కలిపికుట్టేటప్పుడు లోపలికి పోనిచ్చిన ఎక్కువగుడ్డ (కో,రా.) గుడ్డ నేసినప్పుడు రెండుమూరలకు మధ్యపేకదారం లేకుండా ఖాళీగా అట్టిపెట్టేభాగం. (చించి వేరు పరచటానికి) (కో.) గోచి, గోడకచ్చు, కీటు (తె.) దెబ్బ, ముక్క, పేనిన మోకులపైన బయటకు వెళ్ళుకొని వచ్చిన మోసులు (ద.) కాటు (తె.)

**కచ్చె** కక్ష, పగ, కచ్చెపోతు, కచ్చి, కసి (ద,తె.)

**కచ్చెపోవు** ఆశ్చర్యపడు, ఆశ్చర్యపోవు (క.)

**కచ్చే** తమలపాకుల చిన్నకట్ట, పిడి (తె.)

**కచ్చేరి** ఆపీసు, ఉద్యోగకార్యాలయం (కో, తె,ద.)

**కజ్జ** దెబ్బలాట, పోట్లాట, ఘర్షణ (కో,తె.)

**కజ్జకాయ** చూ. కజ్జికాయ, కరిబెల్లలు (ద, తె.)

**కజ్జా** కొట్లాట, దెబ్బలాట, కలహం, పోట్లాట, స్పర్థ, గిల్లికజ్జా పెట్టుకున్నాడు (కో, క.)

**కజ్జాయం** తురిమినకొబ్బరి చక్కెరకలిపి చేసే పిండివంట, తినుబండారం, (రా,ద.)

**కజ్జాయాలు** నిప్పట్లు, అరిసెలు (ద.)

**కజ్జికాయ** కొబ్బరికోరు, చక్కెరగానీ, బెల్లం, శనగపప్పు పిండిగాచేసిగాని పూర్ణంగాపెట్టి గోధుమపిండి పైపూతతో చేసినతినుబండారం, తీపిసోమాసి, కజ్జకాయ (తె,ద,రా.)

**కజ్జెం** పప్పు బెల్లం కలిపి తయారుచేసిన చిరుతిండి (తె.)

**కటంబలి** జొన్ననూకలతో వండిన అన్నం, జొన్నన్నం (రా.)

**కటకటఅను** పనుమలు క్రిక్కిరిసి మూగు, కిటకిటలాడు (ద.)

**కటవ** చిన్నతిప్ప, గడ్డివేయటానికి ప్రత్యేకించిన చోటు (ద.)

**కటాంజనం** కటకటాలు (రా.)

**కటాకటి** కచ్చితంగా (తె.) అతికష్టంమీద, ఎంతో శ్రమపడిన తర్వాతగాని (ద.)

**కటామణి** నూర్పిడి, కుప్పనూర్చటం (రా.)

**కటాయించు** కోయు (తె.)

**కటికనిషేకం** వివాహిత అయిఉన్న ఆడపిల్ల పెద్దమనిషికాకుండానే పునస్సంధానం చేయటం (కో.)

**కటికముక్కలవాడు** కఠినాత్ముడు (క.)

**కటిక్కన** తుంచివేసినట్లుగా (కో.) గట్టిగా, పెద్దచప్పుడుతో, మొహమాటం ఏమీలేకుండా (ద.)

**కటుకు** కఠినం (తె.)

**కటేకారుడు** హాస్యగాడు, విదూషకుడు, అరవవారు ప్రదర్శించే భారతకథాత్మక నాటకాల లోని విదూషకుడు (ద.)

**కట్ట** ఇంటిముందరి అరుగు, తిన్నె (ద.) వడ్లబస్తాలు, వడ్లమూటలు. కట్టలున్న కొంపకు, పుట్టలున్న మడికి చెరుపులేదు (క.)

**కట్టకం** కట్టుబాటు పూర్తిఅయిన భవనం, కట్టడము (రా.)

**కట్టుకొమ్మ** నీరు కాలవలోకి మళ్ళించటానికి ఏటిపాయకు అడ్డంగా వేసిన ఆన (కట్ట), కట్టు కొమ్మ అని కర్నూలుమండలం (రా.)

**కట్టగట్టి** సిద్ధమయి, ఏకమై, వరసగా గుంపుకూడి (తె.)

**కట్టడం** కట్టినభవనం, కట్టకము (ద.)

**కట్టడిచేయటం** నిర్బంధపరచటం (తె,కో.)

**కట్టబెట్టు** అసమ్మతిని సూచిస్తూ ఇష్టంలేని పెళ్ళిచేశారు అని చెప్పేసందర్భం, బలవంతపు పెండ్లి (రా,ద.)

**కట్టపాము** కట్లుకట్లుగా చారలుండే పాము, ఇదిసన్నగా ఉంటుంది. దీనికివిషం ఎక్కువ కోస్తా జిల్లాలలో కట్లపామనే అంటారు (ద.)

**కట్టరాయి** ఆయుర్వేదవైద్యులు తరతరాలుగా సిద్ధంచేసి ఉంచుకొన్న, వంశానుగతంగా తెలిసిన ఔషధం, గట్టికోపులాగా ఉండే ఈ మందును సాది యిస్తారు, కుప్పికట్టు (ద.)

**కట్టాయం** దివ్యస్థలములలో దైవనివేదనం చేసిన ప్రసాదం, పూజారులు పంచుకోనే విధానం, వాళ్ళవాళ్ళవంతు ప్రసాదాన్ని వాళ్ళు విక్రయించు కోవచ్చు, నిశ్చయం (ద,నె,చి.)

**కట్టిఇవ్వడం** పరిహారంచెల్లిచటం (కో.)

**కట్టిపెట్టు** బలవంతంగా మనువాడేటట్లు చేయటం. ఉదా॥ వద్దన్నా ఆ పిల్లను వాడికి కట్టి పెట్టారు (కో.) చాలించు, ఆపు. ఉదా: మాటలు కట్టిపెట్టు, అప్పగించు (ద.)

**కట్టిమోత** వరి, చొప్ప మొదలైనవి కట్టలు గట్టి మోయటం, పనమోత (తె.)

**కట్టీత** మారుమనుము, మగడుపోయినతర్వాత ఆ స్త్రీని మళ్ళీఇంకొరు పెండ్లిచేసుకోవటం (కో.)

**కట్టు** ఒకకులంలోని కట్టుబాటు, విషకీటకాల విషం ఒంట్లోకి ఎక్కకుండా మంత్రించి అదుపులో ఉంచు, కందులు మొదలైనవాటి కషాయం, కర్రకుబిగించిన లోహవలయం, మీసకట్టు, కను కట్టు, అదుపు (ద,రా,తె.) తీవ్రత, గాఢత (కో.) ఏటినీటిని నిరోధించి నిలిపే కట్ట (క.) ఉదా: మార్లాపల్లి కట్టు, డెంకాడకట్టు, దీనినే గుంటూరుజిల్లాలో కత్తవ, కత్తువ అని వ్యవహరిస్తారు.

**కట్టుకాల్వ** చెరువుకు ఏటినుంచి నీటిని మళ్ళించే కాలువ, వరవకాలువ (ద.)

**కట్టుకొన్నది** ఇల్లాలు, భార్య (కో,క.)

**కట్టుకొంగు** నడుముకు బిగించిన చీరకొంగు, పైటకొంగు (తె,ద.)

**కట్టుకొను** వివాహం చేసుకొను, పెండ్లాడు (కో,ద.)

**కట్టుకొమ్మ** చూ. కట్టకొమ్మ (ద,రా.)

**కట్టుకోక** నిత్యంధరించేకోక, వాడుకొనేచీర, దాపుడుకోకకానిది (కో,ద,రా.) కట్టినవస్త్రం (ద,ప.) ఉదా: కట్టుకోకతోనే వచ్చేసింది.

**కట్టుగాడిబిగువు** స్థానబలం (రా,ద.)

**కట్టుగుత్త** నిర్ణీతమైన మొత్తానికి సేద్యాధికారం బదలాయింపు (రా.) ఉదా: ఉన్నపొలాలు కట్టు గుత్తకిచ్చి.

**కట్టుగొయ్య** పశువుల్ని కట్టివేసే గుంజ, కొయ్య (కో.)

**కట్టుపంచ** ధోవతి, మొలపంచ (ద.)

**కట్టుబడి** ఒక మాన్యానికి కట్టవలసిన పన్ను, కట్టుబడి మాన్యం (రా,తె,ద.) చేసిన పనికి చెల్లించాల్సిన ప్రతిఫలంమొత్తం, భవన నిర్మాణ పరిమితి (ద,తె,రా.) గ్రామోద్యోగుల దగ్గర పనిచేసే బంట్రోతు, తలారి (రా.)

**కట్టుబడివాడు** తలారి (తె.)

**కట్టుబోతు** మంత్రాలమారి, మంత్రగాడు, అభిచారవేత్త, కట్టుమోతు (తె.)

**కట్టుమట్టు** పశువులు కట్టివేసే కొట్టం, లేదా పశువుల పెంట (ద.) కుప్ప నురిపిడిలో చిట్ట చివరి పడుగులో గింజలపై నిలచిన గడ్డి (ద,నె.)

**కట్టుముడి** నిబంధన, షరతు (తె.)

**కట్టుమోతు** చూ. తోడుబోతు, మాంత్రికుడు మంత్రాలమారి (తె.)

**కట్టువ** పొలం సరిహద్దులో నిర్మించిన రాతి కట్టడం, వంకలకు అడ్డంగా వేసిన కట్ట, (ద.) రెండు చేలమధ్య ఎత్తైన గట్టు, కత్తువ (కో.)

**కట్టె** పంటచెరకు, కర్ర (ద,రా,తె.)

**కట్టెగొట్టినట్లు** ఖండితంగా, కట్టెవిరిచినట్లు (తె.)

**కట్టెపండు** గింజలతోను, ఉట్టెలతోను కలిసిఉన్న చింతపండు (ద,రా,తె.)

**కట్టెపొంగలి** బియ్యం, పెసరపప్పుతో పాలు పోయకుండా వండిన పొంగలి (ద.)

**కట్టెచరచుకొనిపోవు** కట్టెబారిపోవు, కట్టె లాగా వొళ్ళు బిగుసుకొనిపోవు. ఉదా॥ కాళ్ళు చేతులు చల్లబడి కట్టెచరచుకొని పొయినాయి (తె.)

**కట్టెపారు** చూ. కట్టెబారు, కట్టెలాగా పొడుగ్గా ఉండటం, కట్టెపారు మనిషి కొయ్యబారు (తె.)

**కట్టెపిట్ట** బక్కచిక్కిన వ్యక్తి, కట్టెపారు మనిషి (తె,ద.)

**కట్టెబారు** కట్టెలాగా బిగుసుకొనిపోవు (కో.)

**కట్టెలు** కలప (కో.)

**కట్టెలోపెట్టు** ఖైదుచేయు (రా.)

**కట్టెవారు** బిర్రబిగియు (తె.)

**కట్టెవిరిచి పొయిలో బెట్టినట్లు** నిర్మొహ మాటంగా, ఖండితంగా, మోటుగా (కో.) బెట్టుగా (ద.)

**కట్టెసామాను** భవననిర్మాణానికి కావలసిన కలప (రా.)

**కట్నాలు** సోపానాలు, మెట్లు, కట్నాలబావి (తె.) నిషేక ముహూర్తం (ద.)

**కట్రాడ** కట్టుకొయ్య, గుంజ (కో.)

**కట్లపొడి** వక్క, ఆకుతోపాటు చేర్చినమలే పొగాకు (రా.)

**కట్లవిత్తులు** కుంకుడుకాయలాంటి గింజలు (తె,ప్రకీర్ణ.)

**కట్లా** కలహం, వివాదం (రా.)

**కట్లు** బండిచక్రం పట్టాలు, నేములు (ద.)

**కడ** దగ్గిర, ప్రక్కన, పశువుల నోటిలో చివరిపక్కగా ఉన్నుపన్ను (ద,రా.) చివర (తె.)

**కడంచిల్ల** చూ. కడచీల (రా.)

**కడంచున** కట్టకడపట (రా.)

**కడంతరకాలం** జీవిత పర్యంతం, కడంతర కాలం మరిచే మాటయిది (ద.)

**కడంతల** చూ. కడకంతలు (తె.)

**కడకంతలు** దూరంగా ఉండే ప్రదేశము, కడకంతల పల్లె (ద.)

**కడకళ్ళము** కళ్ళంయొక్క అంచులు (తె.)

**కడకాలు** గోడకట్టటానికి త్రవ్వినగునాది, కడగాలు (ద.)

**కడగ** బహిష్కృకావటం, బయటఉండటం, అవతల (ద,)

**కడచిల్ల** చూ. కడచీల, కడసిల్ల, కడంచిల్ల (రా.)

**కడచీల** బండిచక్రం ఇరుసుకు బయట బిగించే ఇనపచీల, కడచిల్ల (ద,తె.)

**కడచేయు** అలక్ష్యంచేయు (ద.)

**కడప** గడప, ఇంటిసింహద్వారం క్రిందిపట్టె, ద్వారబంధం కిందిపట్టె (రా,ద.) ఇంటిగడప, ఇల్లు, ఇళ్లు (ఇంటి సంఖ్య) (తె,ద.)

**కడపదండాలు** వాకిలిముందు సాగిలిపడటం, తక్కువ స్థితికిదిగజారటం (తె.)

**కడపపీట** బండిలో బండి వాడుకూచునే చోటు (ప్రకీర్ణ,తె.)

**కడపపూజబెట్టు** చూ. కడప ముగ్గుపెట్టు (ద.)

**కడపబండలు** నాపరాళ్ళు, కడపరాళ్ళు (రా.)

**కడపమాను** దేహళి, గడప, కడప (రా.)

**కడపముగ్గుబెట్టు** కార్యార్థంగా ఒకరి ఇంటి చుట్టూ పదేపదే తిరగటం (ద.)

**కడమ** మిగితా, మిగిలిన, తతిమ్మా (తె,ద,కో.)

**కడముంత** చిన్న చెంబువంటి మట్టిపాత్ర (ద,తె.)

**కడల కడల** దూరం దూరంగా (ద,రా.)

**కడలు (కడల)** పశువుల దంతాలలో చివరన ఉండేవి, ఇవి వయస్సును సూచిస్తాయి (ద,తె.)

**కడలేయు** గొంగడి అంచులుగట్టు (ద.)

**కడవ** ఏతానికి (తలుము) నీరు ఎత్తటానికి కూర్చే లోహపుబాన (ద,నె.) చిన్న మూతి గల కుండ (కో,రా) బిందె (రా.) మట్టికుండ (తె.) పెద్దమూతిగల కుండ, ముప్పైమూడు శేర్ల కొలగారపుకుండ (రా,తె.)

**కడవరిమాట** తేల్చిచెప్పే మాట, చివరిమాట (క.)

**కడసారం** చివరిసంతానం, కడగొట్టు బిడ్డడు (క.)

**కడసి** కడపటి (ద.)

**కడసీల** బండి ఇరుసు చివరన వేసినసీల (ద.)

**కడాకూ** ఆసాంతం, దారిచివరంటా (క.)

**కడాటీ** చాలా చిక్కని టీ, అతి చిక్కని 'డికాషన్' తో చేసిన టీ (క.)

కడాజి బండి ఇరుసు (ద.)

కడాన చివరన, అందరికన్నా చివర (ద,రా,తె.)

కడాని బండి కడచీల (ద,చి.)

కడి అన్నపుముద్ద (తె.)

కడితగలడం వెంబడించట, వెంబడించి పరుగులు తీయించటం (క.)

కడితి కవిత్తి (ద,)

కడిద నల్లగాచేసి దానిపైన పిండి బలపంతో రాయటానికి వీలైన కాగితం (ద.)

కడిదొబ్బు పెద్ద పెద్ద ముద్దలు ఆబగా దిగమింగు (ద.)

కడిపోవు ఆకులు చిగర్చకుండా చెట్లకొమ్మలు ఎండిపోవు, పాడైపోవు, కడబోవు (రా.)

కడిమి వరికుప్పల నురిపిడులలో తొక్కనలిగిన గడ్డిని కళ్ళం చుట్టూ తాత్కాలికంగా పోగుపరిచిన ఏర్పాటు, మేడివాము, కడెం (ద.)

కడియం చూ. కడిమి (కో.)

కడియంకట్టుట చుట్టూ గుండ్రంగా గుమికూడటం (క.)

కడియం చూ. కడిమి (కో.)

కడియంకట్టుట చుట్టూ గుండ్రంగా గుమికూడటం (క.)

కడియాలు కాళ్ళకుధరించే వెండి ఆభరణాలు (ద,తె,కో.) చేతులకు ధరించే ఆభరణాలు (రా.) ముంజేతి కంకణాలు, మురుగులు (ద,నె.)

కడుగు బియ్యం కడిగిననీరు, పులిసినప్పుడు దీనిని కుడితి అంటారు, గంజిలో కలిపితే కలి అంటారు, ధాన్యాదులు కడిగిన నీరు (ద.)

కడుగునీళ్ళు కుడితి, తట్టువ (కో.)

కడుచిల్లలు బండిచక్రాల చీలలు, కడచీలలు (రా.)

కడుపాత్రం కడుపుకక్కుర్తి, (కో,ద,తె,రా.) రక్తసంబంధం (రా,కర్నూ.)

కడుపుకుట్టు కడుపుమంట, ఓర్వలేనితనం (ద,తె.)

కడుపుకూటివాడు తిండిబట్టలతోనే తృప్తిపడి ఇంటికొలువు, పొలంపనికూడా చేసే పనివాడు (ద,తె.)

కడుపుకోత సంతాన నష్టం (తె.)

కడుపుగొట్టు అతిసారము (తె.) బతుకు తెరువు పోగొట్టు, జీవనోపాధిని తొలగించు (కో,ద.)

కడుపుసెగ సెగవ్యాధి, నీటిచురుకువ్యాధి (ద,చి.)

కడుపుబ్బరం ఓర్వలేనితనం (కో,ద.)

కడుపూదరబట్టు పసిపిల్లలు ఏడ్చిఏడ్చి వెక్కిలుపెట్టు (తె.)

కడుపోదు తిండిపోతు (ద.)

కడుమ కడమ (తె.)

కడెక్కిపోవు ఆరాటపడు, తపించిపోవు (క.)

కడెము వలయాకారంగా వేసిన నిలువెత్తు గడ్డికుప్ప, కడిమి (కో.)

కడొత్తు ఇంటికప్పుకింద చివరన వేసిబిగించే అడ్డవాసం (ద.)

కడ్గం కత్తి (తె.)

కడ్డాయం నిర్బంధం, బలవంతం, ఆన (తె,ద,రా.)

కడ్డీఅంచు సరిగతో వెడల్పుగా ఉండే అంచు, సాదాఅంచు (ద,తె.)

కడ్డీపుల్ల సాంబ్రాణికడ్డీ, ఊదొత్తి (ద.)

కడ్డీలు దూలాలపై పేర్చే వాసాలు (రా.)

**కడ్డు** మొరటు, హఠం, పట్టుదల (రా,ద.)

**కడ్లపుడి** పొగాకు కాడలను తునకలుచేసిన పొడి, కట్టపొడి (ద.)

**కణతలుతీయడం** ఊరేగించడం (ప్రకీర్ణ తె.)

**కణము** చూ. కణెము; లోగాడిపుల్ల (తె.)

**కణయి** నూనెకాచే పాత్ర, కళాయి (క.)

**కణిక** పొదవాటి తిరుమణి, బలపపుకడ్డీ(లు), కోపు (తె.)

**కణిజము** ధాన్యపుకొట్టు (ద,చి.)

**కణితి** కంతి, దెబ్బతగిలి ఒంటిమీద ఏర్పడే బొప్పి (కో,ద.) ఆవులాగా ఉండే పెద్దజాతి జింక, గంతి (ద,నె.)

**కణిసించు** గమనించు, గుర్తించు (ద,నె.)

**కణుజు** కుక్కలకు చీడగాపట్టే కీటకం (కో.)

**కణెం** బండికాడికి రెండుపక్కలా ఉండే రంధ్రాలలో దిగవేసే కొయ్యచీలలు, లోగాడి పుల్ల (తె.) చెరుకు గానుగలోని చెరుకులను నలగజేసే గుండ్రని ఇరుసులు (ద,చి.)

**కణెయించు** కదలక కూర్చుండు, ఖణాయించు (క.)

**కతకతఅని** అయిందంటే అయిందని పెండ్లి మొదలైన శుభకార్యాలు నిర్వహించటం (తె.)

**కతకతఅని** సందులేకుండా దట్టంగా మనుషులు మూగుకొను, కటకట అను (ద,నె.)

**కతలుచేయు** వికారపుచేష్టలు చేయు, నటన చేయు (ద,నె.)

**కతుకు** గుర్తు; కత్తితో గాయపరచినప్పుడు ఏర్పడిన గుర్తు (ద,చి.) కుక్క మొదలైన జంతువులు నాలుకతో నీళ్ళుగాని, ద్రవపదార్థమేదైనాగాని భుజించు, పరిహాసార్థంగా, స్థూలార్థంగా భుజించు-కతికితే అతకదు-నుడికారం (కో.)

**కత్తవ** త్రవ్వకానికుపయోగించే ముఖ్యంగా చేల మడవలు తీయటానికి ఉపకరించే వెడల్పాటి ఇనుప నిర్మాణం చివరగలకట్టె, కొండబోడు (ద.) ఏటిసీటిని మళ్ళించటానికి నిర్మించిన ఆనకట్ట (ద,నె.) చేనుచుట్టూ కట్టినగోడ, కరగోడ (తె.) నీటిని పారుదల కాలవలకు భూవి స్తీర్ణాన్ని బట్టి పంచి పెట్టే తూములకలయిక (ద,నె.)

**కత్తువ** చూ. కత్తవ (ద.)

**కత్తాయి** కరబంద, కలబంద (ద,చి.)

**కత్తిగట్టు** పగపెంచుకొను, క్రోధంవహించు (కో,ద,రా,తె.)

**కత్తిరిగాపు** కట్టుబాటు (కో.)

**కత్తిపీట** కూరగాయలు తరగటానికి కొయ్య చెక్కపై కొంచెం వెనక్కు ఏటవాలుగా బిగించి ఉండే ఇనప కత్తితో లేదా స్టీలుకత్తితోకూడిన సాధనం (కో,ద,రా,తె.) కల్లుగీయటానికి ఉపయోగించే కత్తులు ఉంచుకొనే పెట్టెవంటి సాధనం (ద,నె.) ఒక ఆట (కో.)

**కత్తిరివడ్లు** కృత్తిక కార్తెలో నాటిన (అలికిన) వరిపైరుకుపయోగించు ధాన్యము (తె.)

**కత్తు** సరిఅయిన పద్ధతి (క,ద.) సవయస్కత, జోడు, శత్రుపక్షం (ద,నె.) కత్తిగీత (తె.)

**కత్తువ** చూ. కత్తవ, ఏటికి అడ్డంగా కట్టిన అడ్డకట్ట (రా.)

**కత్తైరవడ్లు** చూ. కత్తిరివడ్లు (తె.)

**కదంబము** అనేక రకాల కూరగాయలు వేసి వండిన పులుసు, దప్పళం (ద,రా,) రంగురంగుల పూలతో కట్టిన దండ, పూలమాల (ద,కో.)

**కదపాయించుకోవటం** వదులుకుంటానని, ఇస్తానని ప్రతిజ్ఞ పూర్వకంగా పలకడం. ఉదా: చెవికదపాయించుకొని వెళ్ళిపోతాను, అని కన్యాశుల్కం (క.)

**కదబడు** అన్నం ఉడుకుతూ పొంగుతగ్గి సరిఅయిన ఉడుకు వచ్చి కుమరుకొను (కో.) తడిసినప్పుడు గుడ్డమొలైనవి నెరవుతగ్గు (కో, ద.) దట్టమగు (ద,నె.)

**కదలిక** పూనిక, ఉత్సాహం (తె,ద.)

**కదమ** తక్కిన, మిగిలిన, తర్వాతదైన (కో,ద,రా.)

**కదవారు** మిగిలినవారు (రా.)

**కదుపు** ప్రస్తావించు (కో.) అటుఇటు కదల్చు, ఊగించు, కదిలించు (ద.) ఒక జాతి పశువుల లేదా పక్షుల గుంపు, మంద (కో,తె,ద.) జ్ఞాపకం చేయు (రా.)

**కదుపులు** గుంపులు (క.)

**కదుము** రక్తం గడ్డకట్టిన తావు. ఉదా: కదుం గట్టినది (కో,ద.) నెట్టివేయు, గదుము (ద.)

**కదురు** రాట్నంలో నూలు చుట్టుకొనే సాధనం, (కో,తె,ద,రా.)

**కదులు** ఆవృత్తి, పర్యాయము (కో.)

**కద్దు** సమ్మతి సూచకమైన మాట, సబబు, సరి (కో.)

**కనకపిళ్ళె** కరణం, కులకర్ణి, పట్వారి, శానభోగు (ద.)

**కనప్పండుగ** పశువులను అలంకరించే పండుగ, కనుము (ద.)

**కనమ** మానిన గాయపుగుర్తు (ద,చి.)

**కనరు** మంకాయ మొదలైన కూరగాయలు కోసినప్పుడు నీళ్ళలో వేయటం మొదలైన జాగ్రత్త తీసుకోనందువల్ల వాటికి ఏర్పడే అరుచి, నీలపురంగు (కో,రా.) పొగరు, అహంభావము (తె.)

**కనాకష్టం** మిక్కిలి కష్టం, దైన్యం (ద,రా,కో.)

**కనాలు** చూ. లోగాడి; వెలిగాడి పుల్లలు (తె.)

**కనిక** ప్రకృతి (క,నుడి.)

**కనికనిచీకటి** అసురసంధ్య, కంటికి వస్తువులు, ప్రకృతికనిపించీ కనిపించకూండా చీకటి ఉండటం, ఇంకా పూర్తిగా చీకట్లువిచ్చుకోక పోవటం, కనుచీకటి (ద.)

**కనికెడు** చూ. కమికెడు, కంకెడు (తె.)

**కనిగ్రుడ్డు** కంటిగ్రుడ్లు (తె)

**కనిపాపలు** కంటిపాపలు (తె.)

**కనిపించి** బాగోగులుచూసి (ద,నె.)

**కనివాడు** భట్రాజు (ద.)

**కనుకొరుకు** కనుకూరుకు (ద,తె,రా.)

**కనుగప్పరగాడు** గబ్బిలం (రా.)

**కనుకూర్కు** చూ. కనుకొరుకు (తె.)

**కనుగొట్టు** కనుసైగచేయు, కనుగిలుపు రూ. కన్నుగొట్టు, కనుగీటు (తె,ద.)

**కనుచీకటి** స్పష్టాస్పష్టంగా వస్తువులు కనపడగల చీకటి చూ. కనికనిచీకటి (కో,ద.)

**కనుచూపులు దొరకవు** అంత్యకాలం సమీపించింది (తె.)

**కనుతాలు** కంటికిఆను, చూపుకుఆను (ద,రా,తె.)

**కనుపిరికి** కొత్తదాన్ని చూసినప్పుడల్లా బెదిరే గుణం (ద,తె.)

కనుమ సంక్రాంతి పండుగ, కనప్పండుగ (తె.) కొండలలో ఉండే పచ్చికబీడు (ద,రా,తె.)

కనుమరుగు కంటిచూపు నుంచి తప్పించుకొను (కో,ద,తె.) దృష్టిదోషం తగలకుండా ఉండవలసిన మరుగు (కో,రా,ద.)

కనుమసక కొంచెంకొంచెం మసక చీకటి (తె.)

కనుమూయు మరణించు (కో,రా,ద.)

కనురు చూ. కరుణ (తె.)

కన్నదల్లా కనిపించినదంతా (తె.)

కన్నది వెలయాలు, కన్నెది (ద,చి.)

కన్నద్రు సేద్యపుగొడ్డుకు మెడపై ఏర్పడే నలుగుడు చర్మం (ద.)

కన్నవాని కన్పించినవాని; విటుని (ద,చి.)

కన్నాకు తమలపాకుల చిన్నకట్టపైన కంటికి నదురుగా కనపడేట్లు ఉంచికట్టిన మేలైనఆకు, శ్రేష్ఠం, ముఖ్యుడైన వ్యక్తి (ద,తె,రా,కో.) తాటాకుల పుస్తకంలో మొదటిది, చివరది అయిన ఆకులు (తె.) చెట్టుమీది పైఆకు, కోటాకు (కో.)

కన్నానదు కంటికి ఇంపునింపదు, తనను మించినదన్న భావానికి ఆస్కారమీయదు (తె.)

కన్నిడుచు తాటికాయలలో ముంజెలు, సీతాఫలం మీదికన్నులు ఏర్పడు (ద,చి.)

కన్నికలు అక్కలు, సప్తకన్యలు, చెరువు కట్టమీద ఏర్పరచే ఏడుమట్టి గుర్రాలు, ముదురు పచ్చని వన్నెవేస్తారు వీటికి, వీటికి పొంగళ్ళు అర్పిస్తే వర్షంవచ్చి చెరువు నిండుతుందని నమ్మకం, అగ్గారు (ద,చి.)

కన్నిరకం వెలయాలు వ్యక్తురాలు అయిన తర్వాత ప్రథమ విట సమాగమం (కో,ద.) వేశ్యకు విటుడిచ్చే ప్రథమ శుల్కం (ద.)

కన్నిరీకం చూ. కన్నిరకం, కన్నెరికం (తె.)

కన్ను చెరువులో తూముర౦ధ్రం (ద,చి.) రంధ్రం, పైరుకంకి, (ద,నె.) పాదానికి రెండు పక్కలా ఉండే ఉబ్బెత్తులు, గుడుపలు, బుడిపెలు (ద,నె.) చెరుకు గణుపులోని కన్ను, కందగడ్డ లోని కన్ను (రా.)

కన్నుంచు కనిపెట్టు (ద,చి.)

కన్నుకురుకు చూ. కనుకొరుకు (కో.)

కన్నుచెడు దర్శనంవల్ల ఆకర్షణకు లోనగు, వ్యామోహవశుడగు (తె.)

కన్నుమప్పు మోసగించు, వంచించు (తె.)

కన్నుమునగ సమృద్ధిగ, ఎక్కితక్కిగా (కో.)

కన్నువేయు ఆశపడు, ఆకర్షణ పెంచుకొను, వలపు పెంచుకొను (కో,ద,రా,తె.)

కన్నె తాడు, పలుపు, బంధం, (క,తె.) స్వచ్ఛం, తేట (రా.)

కన్నెచెర కన్యగాఉండే స్థితి (కో,ద,తె.)

కన్నెరకం చూ. కన్నిరకం (తె.)

కన్నెరికం వెలయాలిని స్థిరంగా ఒకవ్యక్తి ఉంచుకోవటం (క.)

కన్నెలు పశువులు, పలుపులు (క.)

కన్నేయు కన్నువేయు (రా.)

కన్నోడు ప్రతివాదూ, అడ్డమైనవాడు (తె.)

కపదేరటం కవకవ మనటం (క.)

కపాడి చూ. కపాది

కపాది ఎద్దుమీదగాని, గొడ్డుటావుమీద గాని మోతగావేయు బరువు, ఇది రెండు పక్కలా వేలాడేట్లు ఉంటుంది. దీన్ని కంట్లమనీ అంటారు, ఈ విధంగా పూర్వకాలంలో వస్తువులమ్మి జీవించే వారు కబాదీ లేక కపాడి వారు; వీళ్ళు హరిజనులు, పూర్తిశాకాహారులు, తెలంగాణం నుంచి వలసవచ్చి దక్షిణాంధ్రంలో నెల్లూరు ప్రాంతంలో స్థిర పడ్డారు, వీళ్ళను దండువాళ్ళని కూడా అంటారు. కబాడి - కపాది పాళెం (ద,నె.)

**కపిల** మోట, కపిలి, కపిలె (ద,రా,తె.)

**కపిలి** కపిల, మోట, కపిలె (రా.)

**కపిలగురుజులు** దొరువుమీద కపిల అమర్చటానికి బిగించిన రెండు నిలువు కొయ్యలు (ద,చి.)

**కపిలబాన** మోటబావినుంచి నీటినిపైకి తెచ్చే పెద్దపాత్ర, చాలా భాగం ఇది తోలుతో ఉంటుంది, దీనినుంచి నీరుబయటకు రావటానికి పొడవాటి తోలుసంచి తొండంలాగా కనిపించేది అమర్చి ఉంటుంది, ఈ భాగాన్ని తొండమనే పిలుస్తారు (ద,రా,తె.)

**కపిలవేళ** అపరాహ్నం దాటినవేళ, మధాహ్నం, సుమారు 3 గంటలవేళ (ద,చి.)

**కపిలె** కపిల, మోట (రా.)

**కపిలెబిళ్ళ** మోట తోలటానికుపయోగించే కొయ్య చక్రం, గిలక చక్రం (ద,నె.)

**కప్ప** తాళపు బుర్ర, కప్పతాళం (ద,చి.)

**కప్పకురుపు** గుదికాలిపై లేచే పొరలకురుపు (ద,చి.)

**కప్పగుల్ల** అరికాలిలో లేచే పొరలకురుపు, ఇదిచాలా మంట పుట్టిస్తుంది (కో,ద,రా,తె.)

**కప్పడం** కప్పుకోవటానికుపయోగ పడేది, దుప్పటి (ద,చి.)

**కప్పతాళము** పెద్ద తాళంబుర్ర (ద,తె,క.)

**కప్పతేలు** లావుగా కనిపించే పెద్దతేలు, మండ్రగబ్బ (తె.)

**కప్పదాటు** చేస్తున్నపని క్రమంలో చేయకుండా మధ్య దానిని వదిలి అవతల దానిని అందుకోవటం, చెపుతున్న విషయంలోకూడా పొందిక లేకుండా చెప్పటం (కో,ద.)

**కప్పదాట్లు** తప్పుచేసి, ఆతప్పుతాను చేయలేదని ఇతరులను నమ్మించటానికి చెప్పే కారణాలు, చెపుతున్న విషయం మధ్యలో వదిలేసి వేరే విషయం ఎత్తటం (కో.)

**కప్పనాగులు** కంఠవ్యాధి, మరణాంతకమైనది (తె.)

**కప్పరచీకటి** అప్పుడప్పుడే విచ్చుకుంటున్న చీకటి (కో,ద.)

**కప్పలతక్కెడ** అనైక్యం (కో,తె,ద)

**కప్పా** చొక్కా, కవిసె (రా.)

**కప్పి** సున్నపు రాయి కాల్చిన తర్వాత దానిలో నిలిచిపోయే చిన్న ముడిరాయి (ద,రా.)

**కప్పిరచీకటి** చూ. కప్పర చీకటి (ద.)

**కప్పు** తాటిఆకు కప్పటం, తుంగతోకప్పితే నేయటం అంటారు (ద.)

**కప్పుకాలువ** చూ. యారాము (రా.)

**కప్పులు** ఏతానికి రెండువైపులా కాళ్ళు పెట్టుకోవటానికి అమర్చే పొడవైన పలకవంటి కొయ్యలు (ద.)

**కప్పువేయు** జబ్బుచేసినప్పుడు సాధారణంగా పశువులు నలుపెక్కు (ద,తె,రా.), కళ తగ్గిపోవు (కో,ద.) పండ్లకు దాసెనరాసి వేసుకొన్న రంగు (తె.)

**కప్పువేసినట్లు** ప్రాణసంశయదశ (తె.) ఉదా: పైన కప్పువేసి నట్లున్నాడు

**కప్పూరాలు** మేకవృషణాలు (క.)

**కప్పెర** జులపాల జుట్టు (రా.) కప్పెర జుట్టు (ద.)

**కప్పెరచాప** వానకు తడియకుండా ఉండటానికుపయోగించే గొడుగువంటి చాప (తె.)

**కఫాలి** లేవగానే పొద్దున్నే తినే చద్దన్నం (క.) తరవాణి వంటిది, బఖాలి అనేరూపం కూడా ఉంది.

**కబోదులు** రాంబందులు (క.)

**కబచ** చొక్కాయి, కప్పా (ద.)

**కబాడి** చూ. కపాది, కపాడి (ద).

**కబోదినాటకం** చీకటింటతానుండి వివిధ పాత్రల వాచికము ఒకేవ్యక్తి వినిపించు ప్రదర్శనము, ఏకపాత్రాభినయం వంటిది (ద.)

**కబుర్లు** విశేషాలు, వార్తలు, సంగతులు (కో,క.)

**కబ్జ** ఆక్రమణ, ఆక్రమించిన (తె.)

**కబ్బా** జుబ్బా, (కో.) నిశ్చేష్టత, ఆశ్చర్యం (క.)

**కబ్బీగా** గంభీరంగా, గబ్బీగా (రా.)

**కబ్బెల్లి** 'దయ్యం వస్తోంది' అనటం, బూచివాడొస్తున్నాడు మాదిరిగా భయపెట్టటం (రా.)

**కబ్బెల్లిగాడు** భూతం, దయ్యం, శిశుపరిభాషలో బూచివాడు (రా.)

**కమ్** కుదరదు, అంతకు తక్కువ, (తె.) అన్న అర్థాలు

**కమ్‌నై** అంతకు తక్కువ కుదరదు (తె.)

**కమటము** స్వర్ణకారుని కుంపటి, సుత్తి, దాకలి మొదలైన సామగ్రి (ద.)

**కమతం** పెద్దదైన సేద్యభూమిలో ఒకభాగం, ఈడవ (ద,తె,రా.) జమీందారుల సొంత భూములు, రైతుభూములు కానివి (కో.) ఉమ్మడి వ్యవసాయం (ద.) రైతు వ్యక్తిగతమైన వ్యవసాయం (కో.)

**కమరు** కమురు, జుట్టుకాలినప్పుడు వచ్చే వాసన, (ద,రా.) గుడ్డకాలినప్పటి వాసన (తె.)

**కమలా** నారింజ (క.)

**కమలాతొన** నారింజ బద్ద (క.)

**కమలాపండు** నారింజపండు (రా,ద.)

**కమాను** ఇల్లు కట్టేటప్పుడు అమర్చిన ఆర్చి (కో,ద,రా,తె.) పర్యటన (క,ద.)

**కమానువెళ్ళటం** తనిఖీ పర్యటన, పర్యవేక్షణ (క,ద.) కావిళ్ళు మోసేవాళ్ళు దొరక్క-అధికార్లు కమానువెళ్ళటానికి కష్టపడతారు.

**కమానుబెట్టు** అదుపు, ఇతరులకు తనమాట మీదగల లక్ష్యం (ద.)

**కమామిషు** వ్యవహారం (కో,ద.)

**కమాయించు** సంపాదించు (తె.)

**కమాలు** ఎగతాళి, వేళాకోళం, పరిహాసం (తె,ద.)

**కమికెడు** వేళ్ళు ముడువకుండా పెద్ద పిడికెడు, కనికెడు (ద,రా,తె.)

**కమిచి-కమ్చి** గుర్రాన్నితోలే చిన్న కొరడా (ద,రా,తె.)

**కమీజు** అంగీ, చొక్కాయి, జుబ్బా (క.)

**కముజు** గువ్వవంటి పిట్ట, కౌజు, కవుజు (కో,ద.)

**కమురు** చూ. కమురు (ద,రా)

**కమేల** జంతువధశాల (తె.)

**కమ్జోర్** దుర్బలుడు, సన్నగాడు, బలహీనుడు (తె.)

**కమ్జోరైపోవటం** నలిగిపోవటం, దుర్బలుడైపోవటం (తె.)

**కమ్మాటి** పల్లెటూరి రైతు (ద.)

**కమ్మ** జాకెట్టు, రవికె (తె.) ఎండిన తాటి లేదా కొబ్బరిమట్ట, బరిక (కో.)

**కమ్మంచుచీర** గోరంచుచీర (రా.)

కమ్మచ్చుతీసినట్లు (కో,ద,రా.) హెచ్చు తగ్గులు లేకుండా ఒకే పరిమాణంలో, ఆకృతిలో ఉండటం, ఉదా॥ వ్రాత కమ్మెచ్చు తీసినట్లున్నది. స్వర్ణకారుడు బంగారుతీగెను చేయటానికి ఇనుప పట్టె రంధ్రాలగుండా లాగి పొడుపు చేస్తాడు

కమ్మ బ్రాహ్మణులు తెలుగువారైన బ్రాహ్మణులు (క.)

కమ్మరగట్టు నువ్వులు బెల్లం పాకు పట్టిచేసిన ఉండ (ద.)

కమ్మలకత్తి పొడవాటిగడకు కొసన కట్టిన కొడవలిలాగా ఉండే కత్తి (ద.)

కమ్మలయిల్లు తాటాకులఇల్లు (తె.)

కమ్మలు చెవి దుద్దులు, రాళ్ళకమ్మలు (తె,కో,రా,ద.)

కమ్మి పంచెకు వేసిన వెడల్పాటి దట్టమైన అంచు (కో.) బండిచక్రానికి తొడిగే ఇనుప కమ్మి, పట్టా, నేమి (తె.) ముక్కుకు పెట్టు కొనే ఆభరణం (క.) తక్కువ, లోటు ఉదా॥ డబ్బు కమ్మి అయినది (రా,ద.)

కమ్మించు ఉసికొలుపు (ద,రా.)

కమ్మిటపెట్టు దాచు, రహస్యంగా ఉంచు, గోపనంచేయు (తె.)

కమ్మితీశాడు పారిపోయినాడు, చెప్పకుండా కమ్మి తీశాడు (ద,చి.)

కమ్మినేటి దొంగ, చోర్‌అని నిందించే పదం (ద,చి.)

కమ్ము బండి పట్టా, నేమి, కమ్మి (రా.) మూయు, కప్పి ఉంచు, కప్పవేయు (తె,క.)

కమ్ముకపిలె బాన నీటిని పూర్తిగా వెలువరించే మోట (ద.)

కమ్ముడు అవరోధము, అడ్డంకి, ఆటంకం (తె.)

కమ్ములు చేవలు (క.)

కమ్మెచ్చు లోయ, గాడి, భూమిలో వానకు ఏర్పడిన కోత (తె.) చూ. కమ్మచ్చు (రా,తె.)

కమ్మెదీయు చెప్పకుండా వెళ్ళిపోవు, ఉడాయించు (ద.)

కమ్మెరి అహం భావం, అహంభావప్రదర్శనం, దర్పము (ద,చి.)

కమ్మెర్రి కమ్మెరి (ద.)

కమ్మెలు బ్రాహ్మణులలో ఒక ఉపశాఖ, ప్రథమశాఖ అని కూడా అంటారు. (ద,క.)

కమ్మోళ్ళదంటు తోటకూర (ద,చి.)

క్రమ/క్రమా గది (తె.)

కయాలు అస్థిరచిత్తం (తె,ద.)

కయికాడి నిండుబండిని ఎద్దులు కట్టక పోయినా కట్టినట్లే ఉంచటానికి వెనక చట్టానికి పోటీబెట్టి నిలిపిఉంచే కొయ్య, ఈ విధంగానే ముందునిలిపే కొయ్యను బంటుగూటం అంటారు (ద.) చూ. బంటుగూటం

కయికిలి కూలి (తె.)

కయిగింజలు పనిపాటలవారికి ఏటేటా యిచ్చే మేరగింజలు (ద,నె.)

కయ్య మాగాణీచేను, మడికాలు (ద,తె.) ఉప్పు పండించే పాదు (ద.) దంతెవంటి పొడవాటి కొయ్య, దబ్బ, తాటికయ్య (ద,చి.) నీటి ప్రవాహంవల్ల భూమిలో కోతపడినగంటు, (తె.) వరిమడిలో నీరు నిలువటానికి వేసిన మడవ? (రా.)

కయ్యలెత్తు చిట్టికోళ్ళ వేటకు ఉరులొడ్డేటప్పుడు గదులు గదులుగా ఏర్పరచు (ద,చి.)

**కయ్యలోపడు** ఆపదలోపడు, బొందలోపడు (తె.)

**కయ్యారం** రొంపిగాదున్నిన కయ్యలో గట్టు పారతో కొట్టి సరిచేయటం (ద,నె.)

**కయ్యాళీ** స్వేచ్ఛా ధోరణి, వాలకం, గుబులు (కో,ద.)

**కయ్యికుయ్యి** పెద్ద పెద్ద కబుర్లు (క.) నోరు మెదపటం (ద,కో.)

**కయ్యి** పంటనుకొలిచి జాగ్రత్తగా పెట్టుకోవటం (క.)

**కర** పొలంచుట్టు వేసినకంచె, వెలుగు పైరు, దంటు, (ద,తె,రా.) కంబళికి పోగులు పైకి రాకుండా రెండు అంచులలో దారాలు కలిపి కుట్టిన అంచు, పదునుచేయు (రా.)

**కరంటాపీసు** విద్యుత్‌శాఖవారి కార్యాలయం (తె.)

**కరకర** పొద్దుపొడుపును సూచించే నుడికారం (కో,ద,క.) ఎండ బాగా ఎక్కిందని సూచన, (క,తె,ద,కో.) ఆకలి, (పొద్దు బాగా ఎక్కిందని అర్థంలో) (కో.)

**కరకు** పైరు వెన్ను వేయటానికి ముందున్న దశ (ద.)

**కరకుట్లు** ఉప్పు కారం కలిపి ఎండబెట్టి ఒరుగుగా చేసిన మాంసం ముక్కలు, ఉప్పాసులు, ఉప్పుకండలు (ద,చి.)

**కరటం** అల, కెరటం (క.)

**కరడాబత్తులు** సాలెవారు (కో.)

**కరడాలుదిద్దటం** కాపీ పుస్తకంలో వరవడి పెట్టటం (తె.)

**కరడి** ఎలుగుబంటి, కరిడి (ద.)

**కరణకమ్మలు** కళింగాంధ్రంలో ఒక తెగ బ్రాహ్మణశాఖ, వీళ్ళు కరణాలు (క.)

**కరణంకచ్చ** మీదికిగోపనికచ్చా (ధోవతి అంచు) విరోధము, పగ (క.)

**కరదూపం** పొగ, ధూళి మొదలైన వాటి వల్ల ఇంటికప్పుకు పట్టే బూజు, కరుదువ్వ (తె,క.)

**కరబుచ్చ** చూ. కరబూజ (ద,రా.) ఏటి ఇసుకలో కాసే మేలు జాతి దోస, సిద్ధవటందోస, కరబూజు,

**కరబూజ** చూ, కరబుచ్చ (రా,తె.)

**కరవాక** సముద్రం (క.) సముద్రతీర ప్రాంతం (ద.) తాటి, ఈతచెట్లతోపులతో దట్టమైన నీటి దరి, కరాక (ద,నె.)

**కరవాకలవాడు** సముద్రతీరాన నివసించే పల్లెవాడు, పట్టపువాడు (క.)

**కరవాడ** ఉప్పురాసి ఎండబెట్టిన సముద్రపు చేప, వట్టిచేపను కూడా అంటారు (ద,నె.)

**కరాటం** ఔషధాలు దాచి నిలువఉంచే పరికరం (క.)

**కరాపాకు** కరింపాకు, కల్యామాకు (రా.)

**కరాబు** పాడు, భ్రష్టు (తె.)

**కరారావుడి** సున్నా, శూన్యం (కో.)

**కరారావుడు** సున్నా, హుళక్కి, (క,కో.) పూజ్యం, తద్దినం, తద్దినంభోజనం (కో.)

**కరారు** ఒప్పందం, ఒడంబడిక (క,కో. నిశ్చయం, నిశ్చయించు (తె.)

**కరింపాకు** కరివేపాకు, కరియపాకు, కరేపాకు (రా,తె,ద.)

**కరిఎక్కు** (కరెక్కు) తాడుపేనేటప్పుడు బిగియు, పురిఎక్కు (తె.)

**కరిడి** ఎలుగుబంటు, కర్ధి, ఎలుగ్గొడ్డు, కరడి (రా.)

కరిణి తబలా మోగే తోలుభాగంపై కల్పించిన నల్లటి వలయం (రా.)

కరిణె చూ. కనరు (ద,చి.)

కరిదూపం చూ. కరదూపం (కో.)

కరిపించు జిగురుతో అంటించు, అంటుపెట్టు (కో,ద,రా,తె.) రెండు పక్షాలను పోట్లాటకై ప్రోత్సహించు (కో.)

కరిమి ఆవులు, గేదెలు మొదలైన పశువుల మర్మావయవం, మడి (కో.)

కరియపాకు కరింపాకు (ద.)

కరివేపాకు కరింపాకు, కరేపాకు (కో.)

కరుకోల కర్ర (ద.)

కరుణ కనరు, వంకాయ కరుణ ఎక్కింది, కంద్ర, కనురు (ద,రా,తె.)

కరుణు కనరు, కరుణ (ద,చి,నె.)

కరుదువు ఇంటివాసాలకు పట్టే బూజు (ద,చి.)

కరుదువ్వ పొగచూరి ఏర్పడిన నల్లటి దుమ్ము, కరిదువ్వ; కరదూపం (ద,నె,రా.)

కరుధూపం కరుదువ్వ (తె.)

కరుబూజు పుచ్చకాయ (ద.)

కరువు వరిపైరు సంబంధమైన గర్భపుష్పం కరుగు, కరుకు, కరకు (తె.)

కరెం పశువులకు పెరిగిన ఎక్కువధర (తె.)

కరేలు కలుక్కుమనటం, గుచ్చుకోవటం (కో,క.)

కర్చుకిచ్చు తన్ను, కొట్టు, చరుచు (రా,క.)

కర్జకాయ చూ. కజ్జికాయ, కర్జికాయ (రా.)

కర్ణపోతు శవాలను భక్షించే జంతువు (ద,చి.)

కర్దవ పైకప్పున వేలాడేనుసి (ద.)

కర్నకాయ దబ్బకాయ (రా.)

కర్నికాయ చూ. గజనిమ్మ (రా.)

కర్పూరపొగ అరటికాయలకు వేసే కర్పూరపు పొగ, ఈపొగబట్టినకాయలు పరిమళించి త్వరగా పక్వానికి వస్తాయి (ద,చి.)

కర్మాంతరాల దీపం చూసినట్లు అనాసక్తి, పట్టీపట్టనట్లు (ద.)

కర్మాంతం అపరక్రియలు, కర్మాంతరం, తీరాలు (ద,కో.)

కర్మాంతరం చూ. కర్మాంతం (తె,ద,కో.)

కర్మాంతరాలు అపరక్రియలు, ఉత్తరక్రియలు (కో,ద.)

కర్రుగనున్నడు చిక్కిపోయినాడు, శరీరం శుష్కించిపోయినవాడు (తె.)

కర్రలు వంట చెరకు (క.)

కర్రి సమర్థుడు, బలశాలి, గట్టితనంకలవాడు (క.)

కర్రు మచ్చ, డాగు, మరక (క,కో.)

కరపుట్ట చివికిన కర్రలో (కొయ్యలో) లేచే పుట్టగొడుగు (క.)

కర్ర దంటు (జొన్న, సజ్జకర్ర) (రా,తె,కో.) మరక (ద,చి,రా.) పొగరుబోతు (తె.) చేతిలో పట్టుకొనే కర్ర (రా,ద.) కొయ్య (కో.)

కర్రపెత్తనం తాను చేయకుండా ఇతరుల చేత చేయించే పని పెత్తనం, అధికారం చెలాయించు (కో,రా,తె,క.)

కర్సు ఖర్చు (తె.)

కలంముట్టిన గుర్తు వేలిముద్ర గుర్తు, నిశాని (ద.)

కలక చేపలు నీటినుంచి పైకి ఎగసిపడటం, కలత, వరదనీరు పాతనీరుతో కలియటం (కో, తె,రా.)

కలక చూ. కలకరి, కలగరి (ద.)

కలకండ పటికబెల్లం (తె,ద,రా,కో.) నగుబోతు, (తె.)

కలకబారు బెణకు లేదా గాయం కదిలి నొప్పి ఎక్కువగు (ద,కో.)

కలగలుపు అన్నీ కలిపివేయు (కో,రా,ద, తె.) అన్యోన్యం ప్రదర్శించేవ్యక్తి యొక్క స్వభావం, లక్షణం, కలుపుగోలు, (రా,కో.) కలగా పులగం (క.)

కలగా అధికంగా, ప్రత్యేకంగా (ద.)

కలగానుగు చిత్రవధ (క.)

కలగాపులగం కలగలుపు (తె,కో.)

కలగు కలక, కండ్లకలక, పటలమనే నేత్ర వ్యాధి (కో,ద.)

కలగుమ్మటం అన్నిటినీ కలిపి ఏకంగా చేయటం (ద,తె.)

కలగూర పప్పు, కూరగాయలు కలిపి వండిన కూర (రా.) తోటలలో మొలిచే ఒక ఆకుకూర (తె.)

కలజోడాకులు తెల్లటి పలచటి ఆకులు (రా.)

కలతెలిసికొను ఒక వ్యవహారం కొంత సాగిన తర్వాత ఉన్నరూపు లేదా దాని నిజస్వభావం తెలుసుకొను (ద.)

కలనెత్తు కలియబెట్టు (ద,కో.) గుదిగుచ్చు (కో.)

కలప కొయ్యసామాను (కో,రా,ద,తె,క.) కొయ్యలమ్మేఅంగడి, అడితి (కో.) సేద్యపు సామాను (కలపకొట్టు) (ద.) క్షురకుడు తన పనిసామాను ఉంచుకొనేచిన్న సందుగు పెట్టె, పొది, మంగలిపొది (తె.)

కలబంద చూ. కరబంద, ఒకఔషధి, చేల గట్ల వెంబడి గుబురుగా పట్టులవంటి ఆకులతో పెరుగుతుంది, చిన్నజాతి వాటిని పచ్చడిగా కూడా ఆహారపదార్థాలతో ఉపయోగిస్తారు (కో,తె,రా.) కరబంద (ద,నె.)

కలమార చూ. కలబంద (రా.)

కలమాగు పండు బాగా పక్వమగు, ముదర మాగు (రా.)

కలము ఇరవైనాలుగు శేర్లు (ద,చి.)

కలమువేయు గండిపడు (క.)

కలవరి కలవరం కలిగించే, గగుర్పాటు కలిగించే నవల (క,నుడి.) (సాహిత్య ప్రక్రియ) అని మారేపల్లి రామచంద్రశాస్త్రినుడి కడలి.

కలాలివాండ్లు గౌండ్ల వాళ్ళు (తె.)

కలాలి గౌండ్ల కులస్థుడు (తె.)

కలాసు ఓడకళాసు (కో.)

కలి పులిసిన గంజిని కలిపి వండిన కొర్ర సంకటి (రా.) తరవాణి, బియ్యం కడుగు గంజి కలిసినది (ద.) గంజి (తె.)

కలికలియగు నీరైపోవు, ద్రవించు (తె.)

కలికుండ తరవాణి (ద,తె.)

కలిచల్లటం బిడ్డపుట్టగానే ఆ బిడ్డమీద నీరు చిలకరించటం (తె.)

కలిజెం ధాన్యం నిలువ ఉంచటానికి అర గుడిసెలాగా ఇంట్లో కట్టే పాతర, వడ్లకొట్టు (ద.)

**కలిజేడాకు** కారంగాఉండే తమలపాకులు, కమ్మేరాకు, కుంబకోణంఆకు (ద,చి.)

**కలినేత** కలనేత, రెండురంగుల నూలు కలిపి నేసినది (కో,ద,తె.)

**కలిమట్టు** బాగా కలియబెట్టటం (ద.)

**కలిమట్టుగడ్డి** కుప్పనురిపిడిలో ధాన్యం రాలిన తర్వాత వంకములతో బాగా కలియ బెట్టి, విదిలించి ఎత్తి బయట కడియంగా వేసిన తొక్కిన గడ్డి, మట్టగడ్డి (ద.)

**కలిమికాయ** నేరేడుకాయ పరిమాణంలో ఉండేకాయ, ఊరగాయ పెట్టుకుంటారు (ద,చి.)

**కలిమిడి** కలివిడి, కలుపుగోలుతనం, అరమరమరలు లేకుండా కలిసిపోవు (తె.)

**కలియామాకు** కరివేపాకుచెట్టు (తె.)

**కలివి** తెలివి (ద,చి.)

**కలివిడి** ఆనందం, ఉత్సాహం, సంతోషం, సందడి (క.)

**కలిసిగుద్దులు** పొట్టేళ్ళ కుమ్ములాట (క.)

**కలుజు** స్వర్ణకారుడు (తె.), అలుగు (ద,నె.)

**కలుపుకూర** కలగూర (తె.)

**కలుపుగోలు** కలిసిమెలిసి ఉండటం (కో,తె, రా.)

**కలువాయిబ్రహ్మజ్ఞానం** చూ. కలువాయి వేదాంతం (తె.)

**కలువాయివేదాంతం** ఆచరణ శూన్యమైన నీతులు, అట్టి నీతిని బోధించటం (ద.)

**కలుసుకూర** కలగూర (ద.) పులుసు వేయని తీయకూర (ద,చి.) పుల్లకూర (రా.)

**కలింగెడికాయ** పుచ్చకాయ (రా.)

**కలెగలుపు** బాగా కలిసిపోయేట్లు కలుపు, అరమరలేకుండా ఉండటం (తె.)

**కలొత్తుడు** కాలిలో రాయిగుచ్చుకొన్న బాధ (తె.)

**కల్జుకూర** వివిధ రకాల కాయలతో వండిన కూర, కలుసుకూర (ద,చి.)

**కల్తీ** ఒక వస్తువులో అటువంటిదే మరొక వస్తువును కలిపి మోసపుచ్చు, మోసం, వంచన (కో,తె,రా,ద.)

**కల్టిగొడ్డు** ఎలుగ్గొడ్డు, ఎలుగుబంటి, కరిడి, కల్టె (క,ద.)

**కల్యాట్లు** అగచాట్లు, ప్రయాసలు (ద.)

**కల్యామాకు** కరింపాకు (తె.)

**కల్ల** కంచె, తెట్టు (ద,రా.) కంప, కల్లె (తె.)

**కల్లంలో కాలుచుకొనిపోవు** చేసిన ప్రయత్నం ఫలితానికి రాకపోవు, పెట్టింది చేతికిరాక కష్టమే మిగులు

**కల్లచాలు** ముళ్ళకంచె (రా.)

**కల్లవాపు** నొప్పిలేని వాపు, దెబ్బ ఒకచోట తగిలితే వాపు ఇంకొకచోట కనబడటం (ద,రా, తె.)

**కల్లాపు** పేడ, నీరుకలిపి, గుమ్మంముందు చల్లటానికి సిద్ధం చేసినది, ఆ విధంగా చల్లినది, కళ్ళేప (కో,రా,ద.)

**కల్లి** కలబందను పోలిన ఒక మొక్క, గిల్లితే పాలు గారుతుంది, వెలుగు, కంచె, కల్లె (ద.)

**కల్లి** గ్రామదేవతల కొలువులలో భక్తులు తొక్కే ముళ్ళకంప, పల్నాటి వీరుల జాతరలు మొదలైన సందర్భాలలో భక్తులు గుండాలు తొక్కుతారు, ఆ విధంగా కొందరు ముండ్లకంపలు తొక్కుతారు (కో.) కష్టమైనపనిని సాధించు, అల్లరి (ద.)

**కల్లిచేష్టలు** చిన్నపిల్లలు చేసే వినోద చేష్టలు, గారాబపు చేష్టలు (ద.)

**కల్లు** కత్తి మొదలైనవాటి వాదరలో ఏర్పడ్డ చిన్నగండి, గంటు, కల్లె (ద.)

**కల్లుగడవ** కొబ్బరికాయ (కో.)

**కల్లుప్పు** పెద్దపరిమాణంగల ఉప్పు (ద,తె, రా.)

**కల్లురేగు** పశువులు మిక్కిలి కలతచెందు (ద.)

**కల్లూట** మధ్య మధ్య విరామంతో ఒక్కొక్క బొట్టుగా ఊరు (ద,చి.)

**కల్లె** మొక్కపోవు, కల్లు, గంటు (ద.)

**కళంగిడి** పుచ్చకాయ, కళంగిరి (రా.)

**కళంగిరి** పుచ్చకాయ, కళంగిడి (రా.)

**కళపెళ** పొంగు, (ధ్వన్యనుకరణ వాచకం) (కో,తె.) బాగాకాగటం, సలసల పొంగటం (ద,రా.)

**కళవళిక** పోలిక, ధోరణి (కో,తె,ద.)

**కళాచికలు** నాట్య భంగిమలు (తె.)

**కళాబందిమేళం** బోగం మేళం (తె.)

**కళాయి** నీలిమందు మొదలైనవి కాచే పెద్ద లోహపుతొట్టి (ద.) బాణలి, భాండి (కో,క.)

**కళి** సంకటి, జొన్నకళి, రాగికళి, కలి (రా.)

**కళింగం.** చిన్నఅనకట్ట (క,కో.)

**కళింగలు** లాకు, కాలువనీరు చెరువునీరు నియంత్రించటానికి నిర్మించేకట్ట, ఆనకట్ట (కో.)

**కళిక** దీపపుజ్వాల (ద,తె,రా.)

**కళిపెళ** చూ. కళపెళ (ద,కో,తె,రా.)

**కళ్లి** ఎలుగుబంటి, కరిడి, కల్దెగొడ్డు, ఎలుగొడ్డు

**కళ్ళి** రాసి, పోగు (క.)

**కళ్ళె** శైత్యం వల్ల గట్టిపడిన ఉమ్మి, తెమడ, గళ్ళ (కో,తె.)

**కళ్ళేప** సూర్యోదయాత్పూర్వమే ఇంటికి ప్రధానగుమ్మం ముందు చల్లే పేడనీళ్ళు, కళ్ళాపి (ద.)

**కళ్ళేపుగిన్నె** గోకర్ణం, పులుసు మొదలైనవి వడ్డించేపాత్ర (తె.)

**కవ** నిగారింపు, నిగనిగ, జత, తోడు (కో.)

**కవట** లేత తమలపాకు, చిగుళ్ళతోఉన్న లేత కొమ్మ, కవుటు (ద,రా,తె.) ఇటుక ఆమంలో రాళ్ళు బాగాకాలక పోవటం (కో.)

**కవర** రంగు గుడ్డను మొదటిసారి నీళ్ళలో తడిపినప్పుడు రంగు తగ్గిపోవటం, ఈ తగ్గటాన్ని కవరదిగింది అంటారు (కో.) బలిజకులము (ద.)

**కవరబారు** నిర్నిమిత్తంగా కలహించు, మీదికి మీదికి వచ్చు (ద.)

**కవళం** బిచ్చగాళ్ళు యాచించే పట్టెడన్నం ముద్ద (కో,ద.)

**కళవళికలు** మొక్కట్లు, పోలికలు, (ద.) ముఖంలో కనిపించే మార్పులు (కో.)

**కవిల** డబ్బు, నిలవడబ్బు (కో.)

**కవిలకట్ట** తాటాకుల లెక్క పుస్తకం, నిలవ ఉన్న రొక్కం వివరాలు తెలిపేపుస్తకం (కో,ద.)

**కవిలగుట్ట** కవిలతో నీళ్ళుతోడటానికి వీలుగా బావికమర్చిన గుట్ట (రా.)

**కవిలతూము** దక్షిణాంధ్రంలో మారెళ్ళ సీమలో (దర్శి-పోదిలి) వాడుకలో ఉన్న పెద్ద కొలతతూము, దీనికన్నా చిన్నది సింగంతూము (ద.)

**కవిలెలు** పూర్వకాలపు స్థల చరిత్ర మొదలైనవి వ్రాసి బట్ట అతికించిన కాగితపు చుట్టలు (కో,రా.) ఉదా: కొండవీటి దండకవిలె మొ.

**కవిళికలు** పోలికలు, కవళికలు (ద.)

**కవిసె** చొక్కా, కప్పు (రా.)

**కవుకులు** కష్టాలు, ఇబ్బందులు (క.) పసిపిల్లలు (తె.)

**కవుజు** కముజు, గువ్వజాతి అడివిపూరి పిట్ట, కౌజు (ద,రా.)

**కవుటు** చూ. కవట (రా.) నిలవవున్న మురికినీరు, కవుసు (తె.)

**కవుటుగుల్ల** పశువులగిట్టలోని పుండు(ద.)

**కవురు** బలిజకులము, కవర, కవురుగుంట (ద.) గుడ్డకు కొత్తగావేసిన అమితమైన ముదురుచాయ (ద,తె,రా.) కావురు, ఎరుపు రంగు, వర్షసూచకము (రా.) స్తంభం (ద,చి.)

**కవుళిగ** 50 ఆకులుగల తమలపాకుల కట్ట, పిడి (ద.)

**కవుసు** నడుము, ఒకరకమైన చెప్పులజోడు (తె.)

**కవుసు** మురిగిపోయిన కుళ్ళునీళ్ళు, కవుటు (తె.) మాంసాహారము, నీచువాసన (ద.)

**కవ్వలు** గింజలులేని ధాన్యం, తరక, పొల్లు గింజ (క.)

**కవ్వళ్ళు** మూడునాలుగు అంగుళాల పరిమాణం గల చిన్న మంచినీటి చేపలు (క.)

**కవ్వు** దొంగిలు, దొంగిలించు (క,నుడి.)

**కశి** చికాకు, కచ్చ (తె.)

**కస** బిగింపు (కో.)

**కసకట్టడం** కూరుకురావడం, (కన్నులు) మూతపడటం (క.)

**కసక్కున** గట్టిగా, ఉన్నట్లుండి (ద.)

**కసరు** పసివాళ్ళ బేది వ్యాధి, ఆకుపచ్చని మలము (తె.) పొట్టలో బాగా జీర్ణం కాని ఆహారము, కసురు (తె.) తీవ్రమైనగాలి, కొద్దిగా వర్షంతోకూడిన వాతావరణం (కో.)

**కసురుకోవటం** కోపగించటం (కో,తె.)

**కసవు** ఇంటిలోని దుమ్ము ధూళి, (కో,ద.) గడ్డి (ద,రా.)

**కసాయి** జీబు, కీసాయి, దట్టం (రా.)

**కసాల** డబ్బుకు ఇబ్బంది, ఇరకాటం, (ద,రా,తె.) చిక్కులు (ద,చి.)

**కసింకాలవ** ఊటకాలువ (ద,చి.)

**కసింత** కొంచెం, రవంత, కాసింత, కుసింత (తె,క,కో.)

**కసి** పగ (ద,రా.) పచ్చిది, లేతది, కసిగాయి, కసికందు (రా,కో.)

**కసికిపోవు** క్రమేపీ తరిగిపోవు (కో.)

**కసిదుక్కి** నీళ్ళలో గడ్డలు బాగా కరిగిపోయి రొంపి అయ్యేట్లుగా దున్నిన దుక్కి (ద.)

**కసిబిసి** మనసులోని కష్టం ఓర్వలేక పోవటం, కష్టంచూచి సహించలేక పోవటం (తె.) చెల్లాచెదరు, చిందర వందర (ద.)

**కసిలాడు** కదులు, చలించు, ఊగిసలాడు (ద.)

**కసుమూలం** అసహ్యం, కల్మషం (ద.)

**కసురు** పశువుల పేగుల్లోని మాలిన్యం, పూర్తిగా జీర్ణంకాని గడ్డి మొదలైనవి (తె,రా.) పశువుల మూల మలం (ద.)

**కసురు** సముద్రపుహోరు, పొంగు, పోటు, పొగరు (ద.), పిండె (రా.).

కసురుకొను చీదరించుకొను (కో,తె.) పశువుకొమ్ముతో పొడవటానికి వచ్చు (ద.) కోపంతో మందలించు (కో,ద.)

కసువు చెత్త, చెదారం (రా,తె,ద.)

కస్తి అప్పు వసూలు చేయటంలో చూపే ఒత్తిడి (ద,రా.) అధికం (తె.) కష్టం (కో,ద.)

కస్తూరి ఎలక కొండఎలక (క.)

కస్తూరిపట్టి ద్వార బంధానికి రెండుపక్కల ఉండే నిలువుకొయ్యలు, గుర్రపుతుండ్లు (గుర్రపు మెడలాగా ఉండే ఆకృతిలో ద్వారబంధానికి పైన రెండుపక్కలా అలంకారంగా బిగించే కొయ్య తుండ్లు (కో.)

కస్బీ పై సంపాదన, మామూళ్ళ ద్వారా లభించే డబ్బు చూ. నిశీబు

కస్సుమను కోపగించుకొను (కో,తె,ద.) కోపంతో ఎగిసిపడు (రా,కో.)

కాక పినతండ్రి, చిన్నాయన, తండ్రి (తె.)

కాకరకాయపదును పెంకెతనం (గలవ్యక్తి) (క.)

కాకలుతీరిన ఆరితేరిన, అనుభవం గడించిన (ద,రా,తె.)

కాకా (పట్టటం) స్వప్రయోజనం సాధించు కొనే నిమిత్తం ఆత్మగౌరవం భంగకరంగా ఆశ్రయింపు, ఆశ్రయింపు(కో,రా,ద,క.)

కాకి నల్లవన్నె పందెపు కోడిపుంజు (కో,ద.)

కాకిఎంగిలి ఒక రేదైనా తినుబండారం తింటూ చిన్నపిల్లలు తమలోతము ఇతరులకు పెట్టటానికి ఆ తినుబండారం చుట్టూ గుడ్డ చుట్టి కొరికి ఇతరులకు పెట్టటం అని భావం, ఎంగిలి లేదనటం (కో.)

కాకిగోల పెద్దరొద, గుంపు కూడి గోలగా మాట్లాడటం, ఒకకాకి చచ్చిపోతే దాని చుట్టూ కాకులు గుమిగూడి పెద్దగా అరవటంలాగా, గందరగోళంగా అరుపులు కేకలతో మాట్లాడటం (కో,రా,ద,క.)

కాకిచూపు వంకరచూపు, తలపక్కకు తిప్పి చూడటం (ద,తె,రా,కో.)

కాకిచెమ్మలమనిషి విడ్డూరపు వ్యక్తి, అకట వికటపు మనిషి (క.)

కాకిబంగారం అభ్రకం, మైకా (క,రా.) బంగారపురంగు పూసలు (తె.)

కాకిబంగారం కావటం కనిపించకుండా పోవటం (క.)

కాకిబలగం ఎక్కడెక్కడవాళ్ళూ అట్టు పుట్టు ఆనవాళ్ళు తెలుపుకుంటూ చేరిన బంధువుల సమూహం (తె.)

కాకిబొంతరాయి ఇటుకల్ కాల్చడంలో మంట ఎక్కువై చిట్లెంకట్టిన నల్లటి రాయి (ద.)

కాకిబొచ్చు నల్ల రంగుగల బొచ్చుచేప (కో.)

కాకిరాయి 'చాక్‌లెట్' రంగులో ఉండే రాయి (కో,రా.) కాకిరాయి గనులు కడప జిల్లాలో అధికం

కాకిరిబీకిరి చీకిరి బాకిరి, అస్త వ్యస్తం (తె.)

కాకిరెక్కలు ఒకరకమైన వడ్లు (ద.)

కాకిరెల్లు రెల్లు (ద,తె.)

కాకివెదురు కాకిరెల్లు, రెల్లు (ద,చి.)

కాకిసొమ్ములు మూర్ఛరోగం (తె,కో.)

కాకిసోపాలు మూర్ఛలు, కాకిసొమ్మలు (తె.)

కాకిసోమాలు వెర్రిచేష్టలు, వెర్రిబాగులతనం (ద,నె.) కాకిసొమ్మలు

**కాక్క** మనుషులదశ కష్టంలో ఉన్నస్థితి (ద,క.)

**కాగడా** వాసనలేని తెల్లని పువ్వు, మల్లెపువ్వును పోలి ఉంటుంది (ద.), తురకమల్లె అని కూడా అంటారు (కో.)

**కాగితం** ఉత్తరం, జాబు (ద.)

**కాగు** నీళ్ళు కాచటానికి ఉపయోగించే లోహపాత్ర (తె,కో,రా.) ధాన్యాన్ని పోయటానికుపయోగించే రొమ్ముఎత్తు మట్టికుండ (ద,బి.)

**కాచిపోయు** ఆపదలో ఆదుకొను, రక్షణ కలిగించు, మంచిచెడ్డలు విచారించు (తె.)

**కాచు** గౌరవించు, లక్ష్యపెట్టు (తె.)

**కాజేయు** చంపివేయు (రా,ద.) అపహరించు (ద,రా,కో,తె.) తినివేయు (రా.)

**కాట** అంబలి, గంజి, తొందర (ద,నె.) పోకిరి (రా.)

**కాటడు బూటడు** పనికిమాలిన వాడు (ద.)

**కాటావేయు** రంధ్రంచేయు, గుమ్మడి, కర్బూజ మొదలైన వాటికి కాటావేసి పండిందో లేదో గమనిస్తారు (తె,ద.)

**కాటికలుపోవు** జొన్నకంకి నలుపెక్కు (తె.)

**కాటిపాపడు** స్మశానంలో కాపలా వుండే వ్యక్తి (కో,ద.) ఒళ్ళంతా నల్లగా చేసుకొను వాడు (తె.)

**కాటు** కాయ పండో చేదో తెలుసుకోవటానికి కాయలో చేసే చిన్న బెజ్జం (తె,రా.) పంటతెగులు, దోమకాటు మొ॥ నవి (కో.) పాలు కాచినప్పుడు ఎక్కువగా కాగి వెగటు వాసన రావటం (కో.) వంటచెడిపోవటం (తె.)

**కాటుగలియు** జనసమూహంలో చిన్న పిల్లలు తప్పిపోవు, మారుపడు (తె.)

**కాటుబొగులు** పండీపండనటువంటి దశ (కో.)

**కాటుమరుగు** పులి మొదలైన క్రూరమృగాలు ఊరి పశువులను చంపటానికి అలవాటు పడు (ద,తె.)

**కాటేరి** స్త్రీల ఋతుస్రావ సంబధమైన జబ్బు, ఒక గ్రామదేవత (ద.) గయ్యాళి (రా.)

**కాటేరికోక** నల్లటి బద్దె అంచులతో నేయించే ముతక చీర (కో,ద.)

**కాట్కుడు** కఠినచిత్తుడు (తె.)

**కాట్లమారి** జగడాలమారి, కలహాశీలి (తె.)

**కాట్లాడటం** కలహించటం (క.)

**కాడ** వద్ద, స్వాయత్తత తెలిపేపదం, నాకాడ లేదు (కో,రా,తె.)

**కాడికిందికివచ్చు** ఒకవ్యక్తి ఇంకొకరికి స్వాధీనపడు, లోబడు (ద,రా,తె,కో.)

**కాడికొండ్ర** కాడిమధ్య బిగించిఉండే వంకెసీల (ద.)

**కాడిగట్లనుండు** పక్కపక్కనే ఉండు, జతగాఉండు (ద.)

**కాడితగిలించు** పెళ్ళిజరుపు, మెడవంచు (ద.)

**కాడితాకించు** కోడెను కొలిసారిగా వ్యవసాయపు పనులలో ప్రవేశపెట్టు (తె,కో,ద.)

**కాడు** అడవి (కో.)

**కాడుపడు** దారితెలియకపోవు (తె.)

**కాడుబీడు** వ్యర్థం (ద,రా.)

**కాణి** బండికాడి (తె.)

**కాణిగరచు** కాడితాకించు (తె.)

**కాండ్రిలు** నేలబీటలువారు (ద.)

**కాత** కాపు, ఫలసాయము (ద.)

**కాతరు** లక్ష్యము (కో,తె,ద.)

**కాదు** సరిపడదు, విరోధం (కో,ద,రా,తె.)

**కాదుపోదుఅను** ఒప్పుకొనకుండు, అంగీకరించకుండు (తె.)

**కానగచెట్టు** కానుగచెట్టు, గానుగచెట్టు (ద,రా,తె.)

**కానడు** మర్యాదచూపడు, గౌరవించడు (తె.)

**కానము** చూడము, చూడలేము (కో,ద.)

**కాని** రెండు ఎకరములనేల, కాడి (ద,చి.) (అరకాని, కాలుకాని) మాగాని అనే పదం ఇందుకు సంబంధించిందే కావచ్చు, జతఎద్దులు రెండు కాన్ల సేద్యం అంటే జత ఎద్దులు దున్నలిగిన భూమి అని అర్థం. కోస్తాలో రెండుకాండ్ల వ్యవసాయం అంటారు.

**కాని** సరిపడని, సమకూడని, కలిసిరాని, కూడని, కానిపని - అంటే కలిసిరానిఅనీ, చెడ్డ అని కూడా అర్థం,కానిపనికి కష్టం మెండు (ద,రా,తె,కో.)

**కానికపెట్టు** గుడికి వెళ్ళి కానుకలు అర్పించు (తె.)

**కానిగిరి** ప్రైవేట్, వ్యక్తి గతమైన (తె.)

**కానిచ్చు** పనిసాగేట్లు చేయు (ద,రా,తె.)

**కానిపోని** అనవసరమైన (తె,ద.)

**కానూను** చట్టం, న్యాయం (తె.)

**కాపది** కాపుకులానికి చెందిన స్త్రీ (క.)

**కాపాయము** పొదుపు (తె.)

**కాపిరం** కాపురం (తె.)

**కాపీనం** లోభం, మితిమీరినఆశ (కో.)

**కాపుకూలి** పశువులను కాచినందుకు ఇచ్చే కూలి (తె.)

**కాపుదనం** కాపులపెత్తనం, గ్రామపెత్తనం (ద.) కర్షకులు (తె.)

**కాపుదారి** కాపలా, రక్షణ (కో,ద.)

**కాపున్యాయం** రైతున్యాయం, సంసారితీరు (ద,చి.)

**కాపురానికి పంపు** అత్తవారింటికి పంపు (ద,కో,రా,తె.)

**కాపురానికి వచ్చు** పెద్దమనిషి అగు, రజస్వలఅగు (తె.)

**కాపులు** చిన్నపిల్లలకు చేతులకు పెట్టే కడియాలు (తె.) ముంజేతి ఆభరణాలు (రా.) మురుగులు (ద,రా.) గాజులు (ద,చి.)

**కాపెట్టుకోవటం** దారికాచి ఉండటం, ఎదురుతెన్నులు చూస్తూ ఉండటం (తె.)

**కాపేయం** పొదుపరితనం, కాపాయం (తె.)

**కాబట్టు** అవసరమగు, సంబంధించు (క,ద.)

**కాబూసి** పిల్లలను భయపెట్టటానికుపయోగించే పదం, బూచిలాంటిది (రా.)

**కామ** కట్టె, కాడ, గొడుగుకామ (తె,కో.) గొడుగు పట్టుకోవటానికి ముఖ్యంగా తెరచినప్పుడు పట్టుకోవటానికి ఆధారమైన ఇనుప లేదా కర్ర చువ్వ

**కామంకూతు** కామదహన వృత్తాంతం వర్ణించే నాటిక (ద,చి.)

**కామందు** ఖామందు (ద,కో,రా.)

**కామక** తప్పక (ద,రా,కో.)

**కామాటం** జంజాటం, ఏదైనా పని పెద్దఎత్తున నిర్వహించటానికి పూనుకోవటం (కో,రా,తె.)

**కామాటకం** కామాటం, ఏపనిలోనైనా మగ్నం కావటం (కో.) హెచ్చు సజ్జు (క,నుడి.)

**కామాటీలు** తమిళదేశం నుంచి నెల్లూరు ప్రాంతాలు చేరిన అగ్నికుల క్షత్రియులు, వీళ్ళు ధర్మరాజుల తిరునాళ్ళు చేస్తారు, వీళ్ళుండే వీధిని కామాటి వీధి అనటం ఉంది (ద.) బొంబాయిలో స్థిరపడిన తెనుగువారు, బొంబాయిలో కామాటి పుర ఉన్నది (తె.) పోకిరి (తె.)

**కామాపుచేయు** కమ్మీచేయు, మాపుచేయు, జరిగిన విషయం తెలియకుండా అణచివేయు (క.)

**కామాల** కామెర్లరోగం (ద,చి.)

**కాముని పున్నమ** ఫాల్గుణ పౌర్ణమి, హోలీ (తె,కో.)

**కామోను** కాబోలు (కో,క.)

**కామూష్** నిశ్శబ్దంగా ఉండుఅని హెచ్చరిక (తె.)

**కాయ** ఒక సీసా పరిమాణం, ఒకకొలత, (కో,ద.) కల్లులొట్టి (ద.)

**కాయం** గుర్రాలకు పెట్టే మందు (ద.) బాలింతలకిచ్చే పదార్థం (కో,రా.)

**కాయకం** మోసం (కో.)

**కాయకాలు** బూటకాలు, కృత్రిమాలు (కో.)

**కాయతరక** సగమే పాలు పోసుకొని గింజ పట్టిన ధాన్యం, పూర్తిగా తరక పోనిది (రా.)

**కాయతాలు** కాయతరక (ద,తె.)

**కాయప్పొడి** బాలింతలకిచ్చే పథ్యపుపొడి (ద,కో.)

**కాయవాలు** వరిగింజ ముదిరి వెన్నువాలటం (ద,చి.)

**కాయాపండా** పోయినపని అనుకూలమా, ప్రతికూలమాఅని, అంటే అనుకూలమైందా లేదా వికటించిందా అని అడగటం (కో,క,ద.)

**కాయితం లెంకు** కాయితంకోసం వెదకు (తె.)

**కాయిదం** కాగిదం (తె.)

**కాయిదా** అదుపు (క.)

**కాయిలా** సుస్తీ, అస్వస్థత, అనారోగ్యం (క.)

**కాయిలా(పడు)** అస్వస్థతకు గురిఅగు, సుస్తీపడు (క.)

**కారం** పురిటిబిడ్డలకు పోసే ఔషధం, ఉగ్గు పాలవంటిది (ద,రా.)

**కారంచుట్లు** చక్కిలాలు, జంతికలు (తె,రా.)

**కారకం** ఒళ్ళు వేడి కావటం, వేడెక్కటం (రా.)

**కారటు** కార్డు (తె,కో.)

**కారపాకులు** కొంచెం కారంగా ఉండే తమల పాకులు, కమ్మేరాకులు, కుంభకోణపు ఆకులు (రా.)

**కారప్పూస** శెనగ పిండి బియ్యంపిండి కలిపి నీటితో తడిపిగట్టి ముద్దగా చేసి ఇందుకు ప్రత్యేకించిన సాధనంలో ఈ పిండిఉంచి సన్నని కాడలుగా, చుట్లుగా గట్టిగావత్తి నూనెలో వేయించి తీసిన తినుబండారం (కో,క,ద.)
తీపిపదార్థం కాదు అని చెప్పటానికి కారం తిను బండారమన్న ప్రసక్తి.
కొన్ని ప్రాంతాలలో వాంపూస అనికూడా అంటారు. వాము చేర్చటం వల్లనూ, కారంగా ఉంటుందని చెప్పటానికి వాంపూస అంటారను కోవచ్చు.
తీపిగా ఉండేది పూసమిఠాయి మొదలుగా ప్రసక్తం (కో,తె.)

**కారాకిళ్ళీ(ల్లీ)** పొగాకు చేర్చిన మసాలాతో కూడిన తమలపాకులు చుట్టిన కిళ్ళీ (కో,తె.)

**కారాకు** పండుటాకు (కో,ద.)

**కారాలు** మురుకులు, మణుగుబూలు, (ద.) మణుగుబూరెలు

**కారికం** కోరాగుడ్డ (కో,క,ద.)

**కారిమడి** చవిటిపొలము (క.)

**కారు** రెండోసారిపెట్టే పైరు (ద.) (సాధారణంగా ఇది నెలలు తక్కువ పైరు) మెరప కాయలు, సున్నం మొదలైన వాటి ఘాటు (కో,ద.) తక్కువ (ద,కో.) అరుమాసాలు, అదును, ఒకపాటి, (తె,ద,కో.) ఎక్కువ, అధికం, (కో,ద.) నాగలికి వేసే లోహపు మేకు, కఱ్ఱు (ద,చి.) సమకాలీనత, సవయస్కత, వయసు (కో.)

**కారుకూత** వయసువచ్చిన కోడిపుంజువేసే అరకొరల కూత (ద.) నీచపుమాట, పొగరు మాటలు (తె,కో,ద.) అబద్ధాలు, నోటికి వచ్చినట్లల్లా మాట్లాడటం (రా,కో.)

**కారుచౌక** మిక్కిలి చౌక, (కో.) చాలా అగ్గువ (తె.)

**కారుడ్డాలు** కారుకూతలు, పరుషపు మాటలు, దెప్పులు (కో.)

**కారుణ్యం** దెప్పిపొడపు (కో.)

**కారుపాయాలు** కృత్రిమోపాయాలు (తె.)

**కారొడ్డెం** అధిక్షేపం, తలబిరుసు మాటలు (తె.)

**కారుసు** ఘాటు (రా.)

**కారెలు** (ద.) బలిసిన ఎద్దులకు ఏర్పడే తెల్లని చారలు (ద.)

**కార్ఖాన** చిన్న కర్మాగారము, కలపకోత పనులు మొదలైనవి చేయు ప్రదేశము (కో,తె.)

**కార్తెమూల** వర్షఋతువులో మబ్బు తేలివచ్చే ఈశాన్యదిక్కు, కృత్తికా నక్షత్రానికి చెందిన దిక్కు (ద.)

**కార్యం** గర్భాధానం, శోభనం (కో,ద.)

**కాలమ్** వార్తా పత్రికలలో ఒక నిలువుగడిలో పట్టే విషయము, ఒక నిలువుగడి (కో,ద,తె,రా.)

**కాలగంజివొలుకు** చాలా ఇబ్బంది వచ్చు (తె.)

**కాలారు** పశువులు దొడ్లో ఉండి ఉండి బయటకుపోయి తిరిగి రావటం (ద,కో,తె,రా.)

**కాలికిందనిప్పులుతోయు** తొందరపెట్టు (తె.)

**కాలికిబలపంకట్టుకొను** ఒకపనిమీద అదే పనిగా తిరుగు, రాకపోకలుచేయు (ద,కో.)

**కాలికొంది** కాలికొలది, నడవటంలో పరిగెత్తటంలో ఉన్న శక్తినంతా ఉపయోగించు (ద,తె,కో.)

**కాలికొద్దీ** కాలికొలది (తె,కో,రా.)

**కాలు** ఒకటిలో నాలుగోభాగం, పాతిక, పావు (కో,ద,రా.)

**కాలుకుబట్టగట్టకుంట** విరామం లేకుండా, కాలుకు బలపం గట్టుకొని తిరుగు (తె.)

**కాలిగుంజ** ఇంట్లకు ఒకపక్కదించిన వసారాకు దన్నుగా నిలిపిన కొయ్యస్తంభం (కో.) పశువులను కట్టివేయటానికి నాటిన చిన్న గుంజ, గూటం లేదా మేకు

**కాలిపాటు** పశువుల కాళ్ళబలం, పొంకం (ద,కో.)

**కాలు** పొలం, (బీడుకాలు, పొగాకుకాలు) (తె.)

**కాలుకక్కసంగా** నిక్కచ్చిగా (తె.)

**కాలుబట్టు** కోడెలకు బీజాలు కొట్టటం (ద,నె.)

**కాలుబోసుకొను** కోలుకొను (ద,నె.)

**కాలుమడచు** అల్పాచమానం చేయు (రా,క, తె.)

**కాలుమడి** ఒంటేలు, అల్పాచమానం (తె,రా, ద.)

**కాలుముడుచు** చూ. కాలుమడచు (కో.)

**కాలువకుంట్లు** కాలవ తవ్వకంలో గ్రామ సమష్టి నిర్వహణలో విధించే జరిమానాలు (రా.)

**కాలువకుపోవు** బహిర్భూమికిపోవు, కాలువ గట్టుకు వెళ్ళు (కో,రా,ద.)

**కాలువపంపు** కాలువపారే పొలం, కాలువ కింది పొలం (తె.)

**కాలుసాగు** పశువుల్ని కాలుసాగటానికి విడవటం (ద,నె.)

**కాలెత్తు** చెడిపోవు (తె,కో.)

**కాల్చిగంపలకెత్తు** మిక్కిలిగా బాధించు (ద,రా.)

**కాల్చు** బాణలి నూనెలో గారెలు మొదలైనవి కాల్చు (ద,రా,తె,)

**కాల్చుకొనితిను** వేధించు (తె,ద,కో.)

**కాల్మడి** ఒంటేలు (ద,తె,రా.)

**కాల్మొక్త** పాదాలు పడతాను, పాదాలకు మొక్కుతాను (తె.)

**కాళంజి** గచ్చకాయలాటలో ఉజ్జీలుగా ఉంచిన గచ్చకాయలలో మొదట ప్రత్యేకంగా ఉంచిన ఉజ్జీ, ఉజ్జీఅంటే నాలుగు గచ్చకాయలు, చిత్తూరు జిల్లాలో ఉజ్జీని ఉడ్డి అంటారు.

**కాళ్ళకుపోవటం** మలవిసర్జనకై పోవటం (తె.)

**కాళ్ళకుబెట్టు** విరేచనములగు (తె.)

**కాళ్ళగొళ్ళు** గర్భాధానం (తె,కరీం.)

**కాళ్ళబాతు** కిందిశరీరభాగం అంటే కాళ్ళుబాగా పొడవైన వ్యక్తి (ద.)

**కాళ్ళబేరం** రాజీ, ముందువ్యతిరేకించినా, ఎదిరించినా చివరకు లొంగి పోవటం (కో,రా,తె.)

**కాళ్ళమీదిగొడ్డు** కాళ్ళుపొడవైన పశువు, బరువులాగ లేనిది (ద.)

**కాళ్లాడక పోవు** ఆందోళన, ఏమీతోచకపోవు, నిస్సహాయమైన, ఆవేదనతో ఏమీ చేయటానికి తోచకపోవు (కో,క,ద.)

**కాళ్లతీయు** చాలాదూరం నడవటం వల్లగాని, అలసిపోయేట్లు పనిచేయటం వల్లగాని నొప్పి పుట్టటం (ద,తె,రా.)

**కాళ్లావేళ్లాబడు** చాలా దీనంగా ప్రార్థించు (కో,రా,తె.)

**కాళ్లగుంజు** కాళ్ళుతీపులు పుట్టు, నొప్పి పుట్టు (తె.)

**కాళ్లగుద్దటం** సంవాహనం, కాళ్ళుపట్టటం (క.)

**కావక** నిష్ప్రయోజనం (క.)

**కావటి** కావడి (క.)

**కావడిపెట్టె** బోషాణంలాగా ఉండే చిన్న పెట్టె (కో.)

**కావవేయు** మామిడిపళ్ళు మొదలైన వాటిని పండటం కోసం మగ్గవేయటం, మాగవేయటం (కో.)

**కావిలిగడ్డ** గెనుసుగడ్డ (ద,చి.) (చిలగడదుంపజాతిది)



**కావు** నేలపాతరకు కట్టేరాతి కట్టడం, నలుపు (ద.) కాయలు మాగపెట్టడం (కో.)

**కావుగప్పు** అంతట కప్పుకొని పోవు (తె.)

**కావుపాతర** భూమిలో చుట్టూ రాళ్ళు ఒరలా పేర్చుకుంటూ వచ్చి గింజలు పోసుకోవటానికుపయోగించే గుంట (ద.) భూమిలో దించి ఉంచి ధాన్యం పోసుకోవటానికుపయోగించే మట్టిబాన, పొగాకుకు నీరు తడుపుకు తీసినగొయ్యి (కో.) నేలపాతర (రా.)

**కావురు** రాత్రివేళ కిందివెలుతురు పైకి వ్యాపించి ఏర్పడే కాంతివలయం, ఉభయ సంధ్యలలో సూర్య కిరణాల వల్ల ఏర్పడే ఎర్రనికాంతి (ద,తె,కో.)

**కావురుకమ్ము** ఎర్రమబ్బులతో ఎర్రనికాంతి వ్యాపించు (కో.)

**కావేషి** మచ్చరం, క్రోధం, మాత్సర్యం, (క.) అసూయ, ఆగ్రహం, కోపంతోకూడిన పట్టుదల, పగ, కచ్చ (కో,రా,ద.)

**కాశిగడ్డి** పునుక(గడ్డి) (ద,రా.)

**కాషు** సేద్యం (తె.)

**కాసంత** కొంచెం, రవ్వంత (ద,రా,క,కో.)

**కాసరికుండలు** పెళ్ళిలో పెట్టే సగం ఐరేని కుండలు (తె.)

**కాసి** పొడవైన కొండగడ్డి, కొట్టాలపైన కప్పటానికి ఉపయోగిస్తారు (రా.)

**కాసికోక** మొలచుట్టూ చుట్టుకొనే గట్టి దట్టి (ద,కో,రా.)

**కాసిని** కొన్ని, కాసిన్ని (కో,ద,క.)

**కాసిళ్లు** సజ్జ, జొన్న, జొన్న వీటిపచ్చికంకులు కాల్చి నలిపినప్పుడు వచ్చేగింజలు, వీటిని నువ్వులతో కలిపి తింటారు (తె.)

**కాసీవాళ్లు** కాసెపనివారు, రాతిపనిచేసేవారు (రా.)

**కాసు** సవరను (కో.) డబ్బు (రా,ద,క.)

**కాసె** కచ్చ, కుచ్చెళ్ళుపోసిన ధోవతి, చీర మొ॥నవి (కో.)

**కాసెకోక** చూ. కాసికోక (కో.)

**కాసెగట్టు** నాట్యం నేర్చుకోవటం మొదలుపెట్టు (కో.)

**కింక** పీడ, (ద.) గట్టిపట్టు, విడువని ఏడుపు, చీదర, మారాము (కో,ద.)

**కింకలు** చంటిపిల్లలకు వచ్చే క్రిమివ్యాధి (ద.)

**కింకిరి** ఆటలుతప్పు ఆడేవాడు, (క.) అమేధ్యం (తె.)

**కింగిరి** నీచంగా ఉండేవాడు (క.)

**కిండలు** దురుద్దేశంతో ఎకసక్కెం మాడటం, ఎగతాళి, తాటాకులుకట్టడటం (ద.)

**కికుక్కుమను** మాటలాడు, నోరెత్తు (క,నుడి.)

**కికుక్కురుమను** మాటలాడు (క,నుడి.)

**కికుక్కురుమనకుండు** మాటలాడకుండు, నోరెత్తకుండు (క,నుడి.)

**కిగ్గు** జంకు (కో.)

**కిచిడీ** కమలాకాయ, కిచ్చిలి, కిచ్చిడి (ద.)

**కిచిరిమిచిరి** గీబే, గీబేఅని అరవటం (క.)

**కిచ్చపెట్టు** గిల్లిపెట్టు (ద.)

**కిచ్చాటు** ఇబ్బంది, బాధాకరం, గిజాటు (కో.)

**కిచ్చిలిపండు** నారింజపండు (కో,ద.)

**కిచ్చిలిసాంబా** ఒకరకం వరి, పెద్దకిచ్చిలి, గుత్తికిచ్చిలి, ఈ వరిలో రకాలు (క,నుడి.)

**కిటికీగజాలు** కిటికీ చువ్వలు, కిటికీ కమ్మలు (ద,రా.)

**కిటుకు** అసలు రహస్యం, మూలం, పన్నాగం, ఎత్తుగడ, ఉపాయం (కో,ద,తె.)

**కిట్టు** రెండుకొయ్యలను వేసి బిగించిన ముడి (ద,చి)

**కిడికి** కిటికీ (తె.)

**కితాబు** బిరుదు, పొత్రము, యెగ్యతాపత్రం (క,నుడి).

**కిత్తడు** కృష్ణుడు, కిచ్చయ్య (క.)

**కిత్తనార** కలబంద (కో.)

**కిత్తిలిపండు** నారింజపండు (ద.)

**కిత్తా** పర్యాయం, విభాగం, వంతు (కో,ద.)

**కిన్నడచేయు** చిన్నపుచ్చు (క,నుడి.)

**కిమ్మ** రహస్యం (తె.)

**కిమ్మత్తు** వెల, మూల్యం, విలువ, మొత్తం విలువ (ద,కో,క,రా.)

**కిమ్మనకుండు** మాట్లాడకుండాఉండు, నోరెత్తకుండు (కో,క.)

**కిమ్మనటం** కాదనటం, కాదు కూడదనటం (తె.)

**కిరస్తానీ** క్రైస్తవ మతము (కో,ద,తె.)

**కిరాయి** అద్దె (తె.)

**కిరికిరి** పేచీ, వివాదం, రభస, కలహం (తె.)

**కిరుగు** లొంగినది (ద.)

**కిరుదు** నాసిరకం (తె,రా.)

**కిర్రుచెప్పులు** నడిచేటప్పుడు కిర్రు కిర్రుమనేట్టు తయారుచేసిన చెప్పులు (కో.)

**కిర్రుగానుగ** కళింగాంధ్రంలో బాలక్రీడ

**కిల్లాకు** ఆజ్ఞ, మేరమీరరాని వర్తమానం (కో,క.)

**కిల్లుకోవటం** కెప్పుమని కేకవేయటం (రా.)

**కిలాడి** నేర్పరి, (కో,రా,ద.) తగవులు పెట్టేవాడు (రా,తె.) రంకులాడి (తె.) మోసగాడు (కో.)

**కిల్లాడి** చాడి, కొండెం (ద.)

**కిల్లాయిలమారి** తాకట్లమారి (ద.)

**కిశ్తి** ఇనప్పళ్ళెం (తె.)

**కిసాయి** జేబు, కిసిరి (ద,రా.)

**కిసికింత** కొంచెం (తె.)

**కిసిరి** జేబు, కీస, కిసాయి (రా.)

**కిస్తల** వాయిదాలలో (తె,కో.)

**కిస్తి** వాయిదా, పన్ను, పళ్ళెం, తాంబాళం (తె.)

**కిస్మత్** అదృష్టం (తె.)

**కిస్సాబడ్డది** తగాదావచ్చింది (తె.)

**కీంద్ర** ఎక్కువగా నీరు పీల్చే మెట్టనేల (ద.)

**కీచురాయి** (ద,రా.) రొదచేసే చిన్న పురుగు, ఎడతెగకుండా కీచు కీచు అని అరుస్తుంది (కో,ద,తె.)

**కీచులాట** వివాదం, కలహం, కజ్జా (కో,రా,ద,తె.)

**కీజీకటి** క్రీనీడ (తె.)

**కీటకుడు** విషపు బుద్ధిగలవాడు (రా.)

**కీట** చీలిక, పగులు, మట్టిగోడపెట్టేటప్పుడు చుట్టూ ఒక్కొక్క అడుగు ఎత్తు పెట్టుకుంటూ వచ్చే భాగము (రా,ద.)



**కీడిశ** చూ. కీడిస (ద,నె.)

**కీడిస** సగము పాలుపోసి గింజబట్టిన ధాన్యపు గింజ, కాయతరక (ద,నె.)

**కీడు** కత్తిపదును, దాళు (క.) కత్తికి కీడు పెట్టు

**కీతు** కొబ్బరిఆకుల చాప, అల్లిన టెంకాయ మట్ట (ద.)

**కీదొడ** పల్చగా నేసిన బట్టకు నేతవాండ్రు వరిపిండి పలచగా ఉడికించి పూసే ప్రక్రియ (కో.) లోదొడ, లోతాడ (ద,తె.)

**కీనీరు** భూమిపైన కనిపించే ఊటనీరు (ద.)

**కీనెలుదీసిఅలుకు** చక్కని గీతలుపడేట్లు, వంకరపోకుండా నేలను అలుకు (తె.)

**కీనీరుబావి** మంచి ఊటబావి, కీనీరుబావి (క,ద.)

**కీరకాయలు** పందిరిదోసకాయలు (ద.)

**కీలగొంతు** సన్ననిరాపుడు గొంతు (ద.)

**కీలారం** కొష్టం (రా.)

**కీలారి** గొల్ల, కోనారి, పశుపాలకుడు (రా,ద.)

**కీలుబొమ్మ** అస్వతంత్రుడు, ఒకరాడించినట్లు ఆడేవాడు (కో,ద,తె.)

**కీలుమండి** కీలులేదా అవయవ సంధిలో పుట్టే కురుపు, అవయవాలు కలిసే గూడు (రా.) మోకాటిలో బుట్టే వ్రణం (ద,నె.)

**కీలుముడి** వెంట్రుకలు జారుగా వేసినముడి, కీలుగంటి, పిడిగంటి (రా.)

**కీలెరిగివాత** సరియైన ప్రతీకారము, అదును చూసి చేసిన ప్రతీకారము (తె,ద.కో.)

**కీశేరు** చెరువుకట్టకింద సాగుబడి అయ్యే భూమి (ద.)

**కీస** కొంచెం, జేబు (తె.)

**కీసర** జేబు, కీసాయి, కీసర (రా,తె.)

**కీసల** జేబులో (తె.)

**కీసా** జేబు, కీసర, కీసాయి (తె.)

**కీసాయి** జేబు, కీసర (రా,తె.)

**కీసాలు** చొక్కాజేబులు (తె.)

**కుంక** కుక్క (ద,చి.)

**కుంకుడుకాయ** తలంటి నీళ్ళకు ఉపయోగపడే నురుగునిచ్చేకాయ (కో,ద.)

**కుంకుడునురుగు** కుంకుడురసం, పుల్ల, పులుసు (కో.)

**కుంకుడువేరు** కూకటివేరు, తల్లివేరు (క.)

**కుంబీలు** పిట్టగోడలు, కుంబులు, కుమ్ములు (క.)

**కుంచము** చెరువు తూములనుంచి నీళ్ళుబయటకు వచ్చేరంధ్రాన్ని కావలసినప్పుడు కప్పిపెట్టటానికుపయోగించే బరువైన కొయ్యమొద్దు (ద.) ధాన్యపుకొలత పాత్ర, పరిమాణం (రా,ద,తె.) చెరువునుంచి నీళ్ళు ఇవతలకి వచ్చేతూము, గొడ్డలి తూము (తె.)

**కుంచసెగ** పడిశం వదలటానికి పట్టేసెగ, ఉడికించిన వడ్లలో ఇటుకవేసి దుప్పటి కప్పుకొని ఆ సెగపడితే చెమటలు పట్టి జలుబు నెమ్మదిస్తుంది (ద.)

**కుంచాము** కుంచము (ద.)

**కుంచెలు** పశువుల పండుగ, కనుము (క.) పంచెకొంగులు (ద.)

**కుంట** పాతిక సెంటు భూమి, మంచినీటి ఉనికి, మంచినీటిగుంట (కో.)

**కుంట** గుంట (తె.)

**కుంటించు** చేయగూడని పని చేయించు (రా.)

**కుంటికర్ర** గడ్డిని ఎగదోసేకర్ర (క.)

**కుంటికునిష్టి** వికలాంగులు (ద.)

**కుంటికూనాక్షి** కుంటివాడని పరిహసించే మాట, చేతగానివాడు, పనికిమాలినవాడు (తె.)

**కుంటు** ఉమ్మడిపనిలో పనికిపోని రోజున చెల్లించవలసిన జరిమానా, కూలివాడుగాని జీతగాడుగాని పనిలోకి రానిరోజు, నిలవ, కుందకం (రా.)

**కుంటుదినం** జీతగాడు పనిలోకిరానిరోజు, నాగా (తె.)

**కుంటెన** కాడిని కట్టిన వార్నెకు (కాడికట్టు మోకు) తగిలించు లావైన తాటివలయం (ద.)

**కుంటెనదూలం** దూలంపైన చిన్నదూలం, గుంటదూలం, మేలుదూలం (తె.)

**కుంటెనపాము** పెనవేసికొని ఉన్న పెనుబాము, జంటనురక్షించటానికి కనిపెట్టి ఉండే పాము (ద.)

**కుండ** బండిఇరుసును చక్రంలోకి దూర్చటానికి ఏర్పరచిన గుండ్రటిమూలం, చక్రకేంద్రం (ద.)

**కుండపులి** గుంటనక్కల్ని భయపెట్టటానికి ఉపయోగించే దిష్టిబొమ్మ (ద.)

**కుండబంతి** పిల్లలాడే అట (క.)

**కుండమార్పు**ఒక ఇంటిపడచును ఒకవ్యక్తి వివాహమాడుతూ తన తోబుట్టువును తాను పెళ్ళాడేపిల్ల సోదరునికిచ్చి పెళ్ళిచేయటం (కో, రా,ద.)

**కుండలలోకి తీసుకొనిరావటం** రజస్వలాస్నానంతర్వాత ఆడపిల్లను ఇంట్లోకి తీసుకొని రావటం, వంటలోకి అనుమతించటం (ద,కో.)

**కుండలలో గుర్రాలుతోలు** ఇల్లువదలి వెళ్ళకుండా నిర్వ్యాపారంగా కాలక్షేపం చెయ్యటం (కో,తె,ద.)

**కుందకం** కుదించుకొని పోయినది, తగ్గినది (ద.) పనివాడుపనికిరాని రోజు, నిలువ, కుంటు, పనిచేటు (ద,చి.) నష్టం, ఆటంకం, వెల్తి (రా.)

**కుందనం** పెళ్ళికిముందు ముత్తైదువులు వడ్లువంచటం (రా.)

**కుందా** తుపాకిమొదలు (తె.)

**కుందాపన** మనసులో తపన, ఒకవిషయాన్ని గూర్చి ఒకటేఆలోచన (ద,రా,తె.)

**కుందాయి** కుదిమట్టంగా పొట్టిగా ఉండేస్త్రీ (తె.)

**కుంది** చూ. కుందిన, కుందెన (కో.)

**కుందిన** ధాన్యాదులు దంచేటప్పుడు రోటిపై అమర్చే సాధనం, రాతితో మలచిఉంటుంది, లేదా వెదురుదికూడా కావచ్చు, కుంది, కుందెన

**కుందు** పశురోగము (రా.) చిదురు చిదురుగా నరుకు (ద,కో.)

**కుందెన** వెదురుతోగాని, ఇనుపరేకులతోగాని చేసిన కుదురువంటి సాధనం (తె.) ప్రమిద (కో.)

**కుంపటి** వ్యథ, ఆందోళనతోకూడిన ఆలోచన (కో,రా,తె.)

**కుంపటెక్కింది** కోడి పొదగడం ఆరంభించింది (తె.)

**కుంపు** ఎడతెగని దుఃఖం, కుంగిపోయిన లేదా కుంగించబడిన భూభాగం (ద,నె,తె.)

**కుంబులు** పిట్టగోడలు, కుమ్ములు, కుమ్మీలు, కుంబీలు (ద.)



**కుంభకోణం** వంచన, దగా, మోసం, (కో,ద,క.) కూహకం, మాయ (క,నుడి.)

**కుక్కనెత్తిబోనం** అస్థిరవిషయం, నిలకడలేనిది, క్షణచిత్తం, చాంచల్యం (కో.)

**కుక్కనెత్తిమీదటెంకాయ** చలచిత్తత, అస్థిరవిషయం (రా.)

**కుక్కనోమ** పైరులో ఒక తెగకలుపు మొక్క (క.)

**కుక్కి** పాతదై వదులైనిది (కో,రా,ద,) ముసలిది (తె.)

**కుక్కినపేను** పూర్తిగా లొంగిపోయి అణగిమణగిఉండు (కో,ద.)

**కుక్కిరి** చూ. జల్ల, మక్కిరి (రా.)

**కుచ్చం** నాలుగుపైసలు (ద,రా.)

**కుచ్చ** చింతగింజలఆటలో రెండుపుంజెలు, కుచ్చి (కో.)

**కుచ్చీలు** చింతగింజలఆటలో నాలుగు గింజల ప్రోవు (పోగు), కుచ్చిళ్ళు, మడుపులు

**కుచ్చె** చూ. కుచ్చెల (ద.)

**కుచ్చెలి** పిడకలు పేర్చిన గుట్ట, కోసిన జొన్నదంటును కంకితోగూడ తాత్కాలికంగా వేసినగూడు, చిన్నబాలికలు మొలకు కట్టుకొనే వస్త్రము (ద.)

**కుచ్ఛితం** కపటం, కపటమైన (క.) వంకరైన, కుత్సితమైన (కో.)

**కుట్టు** పొయిలోఉండే వేడిబూడిద, కుమ్మ (ద,తె,రా.) పగ, ద్వేషము (ద,రా.)

**కుట్ర** కళింగ సరిహద్దుకొండలలో కనిపించే మృగం (క.)

**కుట్లెళ్ళతినటం** గొంతువరకు మెక్కటం (తె.)

**కుడుక** ఎండుకొబ్బరిచిప్ప (తె.)

**కుడుపు** విందుభోజనం (తె.)

**కుడుమాయ** కుండ (క.)

**కుడుము** తీపిపూర్ణం లోపల ఉంచిచేసిన భక్ష్యం (రా,తె.) పూర్ణంలేనిది, ఉండ్రాయి (ద,కో.)

**కుడుమురొట్టె** ఆవిరికుడుము, గుంతపొంగలి (ద.)

**కుతి** ఒకదానిపట్ల ఎక్కువ అభిలాష, (కో,తె,ద.) మిక్కిలిమోజు, ఉత్కంఠ, ఆరాటం

**కుతిక** గొంతు (కో,తె,ద.)

**కుతికెదాక** గొంతుదాక, గొంతువరకు (కో,తె,ద.)

**కుతికెనవేసుకొను** ఇష్టంలేకపోయినా సహించు (ద.)

**కుతిగంటు** మెడకుధరించే వొత్తుగాఉండే హారం, అడ్డిగ (కో.)

**కుతిగాఉండు** ప్రియమైన వస్తువుకోసం మనిషికోసం తహతహలాడు (కో.)

**కుతుంబిర్లు** కొత్తిమెరలు, ధనియాలు (ద.)

**కుత్తిగంటు** కంఠానికి బిగుతుగాఉండే పట్టెడ నగ (క.)

**కుత్తిగల్లు** మెడలోధరించేకంటె కుత్తిగంట (క.)

**కుత్తెకవద్దది** పొరబోయింది (తె.)

**కుత్తెము** పిక్కటము (తె.)

**కుదప** కంటిలో ఒకకొలికిలో ఏర్పడిన దుర్మాంసము (కో,తె,ద.)

**కుదరవేయు** పొలంలో పశువులను మందగా తోలు (ద.) విశ్రాంతి కలగజేయు, సమ్మతింప జేయు (రా.)

**కుదవ** పశువులమేతకుగాను ప్రత్యేకించిన పొలం, (ద.) దీనిని సూచించటానికి ఈత కంపలు అక్కడక్కడగుచ్చి ఉంచుతారు.

**కుదిచ్చు** కుదించు, తగ్గించు, సరిగాసర్దుకొను నట్లు అటుఇటు కదిలించు (తె.)

**కుదిరిక** స్థిరపడిన రూపం, నిర్మాణం, రూప రేఖలు, ఆకర్షణీయమైన విన్యాసం (కో.)

**కుదిరిచ్చు** కుదుర్చు, ఏర్పాటు చేయు (కో,ద.) పొందుచేయు, సరిచేయు (తె.)

**కుదుపు** ఒళ్ళు అలిసిపోయే కదలిక, (కో.) ఆయాసం (తె.) కదిలిక, కదిలించు (క.)

**కుదురు** వడ్లు మొదలైన ధాన్యాదులు దంచే టప్పుడు రోటిపై ఉంచే వెదురు బుట్ట, రోటి వెడల్పుతో మొదలై పోనుపోను ఇంకా వెడల్పుగా ఉంటుంది (కో,ద,తె,రా.) నెమ్మది, కుదురు పాటు, స్థిమితం, క్షేమం (కో,ద) పాత్రలు సరిగానిలవటానికి కిందపెట్టే చుట్టకుదురు ఆధారం (రా,ద,తె.)

**కుదుర్లుకొను** చక్కబడు (కో,తె,ద.)

**కుదువ** తాకట్టు, గిర్వి (కో.)

**కుదువవేయు** చూ. చదుమలగొట్టు, మలగొట్టు, కుదవ (ద,చి.)

**కుదేయడం** ఎత్తేయడం, ఎత్తిపడవేయడం (కో,తె.)

**కుద్దించి** కుంచించి, సంకోచింపచేసి (క.)

**కుద్దు** రెండడుగుల పొడవూ మూడంగుళాల కైవారమూ ఉండిన రోకలి, దీనికిపన్ను ఉండదు (క.)

**కుని** పీధిమలుపు, మూలమలుపు (కో,ద.) చేలో నలుచదరపుగట్లకు మీరిఉన్న భాగం (ద.) ఇంటిస్థలంలో చతురస్రంగా కాక ఒకమూల ఎక్కువగా ఉండటం (తె.)

**కునిచుట్లు** చూ. కుని (రా.)

**కునుకు** నిద్ర, స్వల్పకాలపు నిద్రవిరామం (కో,తె.)

**కున్ని** చిన్నది, పయసుకు మించిన మాటలు, పనులు వ్యక్తం చేసేది (ద,నె.)

**కున్నె** ముక్క, తుంట (తె.)

**కుప్ప** కోసినపైరు నురచటానికి ముందు అమర్చిన పోగు, చిన్నభాగం (ద,రా,తె,కో.)

**కుప్పమీదకూర్చుండు** మేలుస్థితిలో ఉండు, భద్రంగాఉండు (తె.)

**కుప్పికట్టు** వంశానుగతంగా ఆయుర్వేద వైద్యులు సంగ్రహించి ఉంచే కోపులుగా ఉండే మందులు, వీటిని సాదిఅనుపాన భేదాలతో చాలా రకమైన జబ్బులకు ఇస్తూ ఉంటారు (కో,ద,తె.)

**కుప్పిదొల్లి** పెద్దగంప (ద.)

**కుప్పు** దారాలతో బిగించిన కట్ట (తె.)

**కుప్పె** బంగారం మొదలైన వాటిని కరిగించే మట్టిపాత్ర, మూస (తె.) గాజుబుడ్డి (రా.) కత్తి మొదలైనవాటి పిడి, ఉంద (ఎక్కువగా ఔషధాల గురించిన సందర్భం) (కో.)

**కుప్పెకట్టు** చూ. కుప్పికట్టు (రా.)

**కుమార్** కుమ్మరి (తె.)

**కుముటోసన** చెడ్డవాసన (రా.)

**కుములు** పైకిమంట (మాట) రాకుండా లోపలనేబాధపడు (రా,ద,రా,తె.) కుమ్మరిఆవం మాదిరిగా రాజిరాజిమండు, లోపలలోపల బాధపడు (కో,ద.)



**కుమ్మకుక్క** కుట్ర, లొంగుపాటు, తోడ్పాటు, ప్రోత్సాహం (తె,ద,కో,రా.) అండదండలు, సహాయం, దన్ను (క.)

**కుమ్మరపొయ్యి** కుమ్మరిచేసిన గుండ్రని వంటపొయ్యి, ఎక్కడపడితే అక్కడ పెట్టుకోవ టానికి వీలుగా ఉంటుంది (ద.)

**కుమ్మి** గొబ్బిళ్ళు (ద,చి.)

**కుమ్మిడు** పిట్టగోడలు, కుంబీలు, కుంబులు (ద.)

**కుమ్ము** ఇబ్బంది, సంకటము, అవస్థ (కో, ద.), వేడిబూడిద (ద,నె.)

**కుమ్ముపచ్చడి** వంకాయను పొయ్యికుమ్ము (వేడిబూడిద)లో బెట్టి కాల్చి పిసికి చేసినబజ్జి (ద,తె.)

**కుమ్ములు** పిట్టగోడలు, కుంబీలు, కుమ్మీలు (ద.)

**కుమ్ముసుద్దం** తీవ్రవ్యతిరేకత (ద.) (ఉప్పు నిప్పులాగా), దుర్మార్గం, వేడిబూడిద (ద.)

**కుయిలు** కిటికి, వాకిలిచట్రాలు బిగించ టానికి వాటికొయ్యలకు చివరన వేసేతాలి (రా.)

**కుయ్యన్న** పనికిమాలిన వాడు (ద,చి.)

**కురజాలు** పురుషాంగం (క.)

**కురదల** కొరత, వెలితి, తరుగు (కో,ద.)

**కురదూడ** కోడెదూడ (ద,నె.)

**కురపగొర్రె** దట్టంగా పొడవైన రోమాలు గలగొర్రె (ద,నె.)

**కురప్పొట్టేలు** గొర్రెపోతులలో బలిష్టములైన జాతికి చెందినది. దీనికి బొచ్చుఎక్కువ (ద.)

**కురబ** కురవ (ద.)

**కురమ** చూ. కురవ (తె.)

**కురరిపిట్ట** కళింగదేశం కొండప్రాంతంలో కని పించే ఒకపిట్ట (క.)

**కురవ** గొర్రెకాపరి, గొల్ల, కంబళ్ళునేసే ఒకజాతి, కురబ, కురమ (రా,తె,ద.)

**కురవదారం** ఉన్నితోచేసిన దారం (రా,తె.)

**కురాకు** మాంసం, ఆకుకూర, కూరాకు (రా.)

**కురికుడుము** కజ్జికాయ (ద.)

**కురిడి** నీరులేని ఎండుకొబ్బరి, కోడెలకు ప్రత్యేకంగా అందంగా ఉండటానికి వేసే సన్న చారలుకల తోలు (క,ద.)

**కురిపె** తవ్వటానికుపయోగించే చిన్నపని ముట్టు (తె.)

**కురు** చిన్న, కుర్ర (ద.)

**కురుగు** తొడ, కురువు (ద.)

**కురుజు** చిన్నది, కూన (ద.)

**కురుజు** మొండివాడు (కొయ్యతనంగలవాడు) (క,నడి.)

**కురుపి** తెడ్డు, గరిటె (కో.)

**కురుపుకురుపుగా** ఎంతో ఆయాసంగా, ఆప సోపాలుగా (తె.)

**కురుమట్టం** కురుచ, పొట్టి (క.)

**కురుమాడు** ఇంటికప్పును ప్రక్క రెట్టగోడ మీద వెన్నుఎత్తున నిలపకుండా కిందికి వాటంగా చూరుదించినది, చూరు నాలుగుపక్కలో ఒకే మట్టంలో ఉంటుంది ఈ పద్ధతినిర్మాణంలో కురు మాడుదించినఇల్లు (ద,నె.)

**కురుమాపు** కొద్దిగా మాసిన (క.) సగం మాసినది (రా,క,ద.)

**కుర్ర** లేత ఎద్దు, గూళికుర్ర- ఆవులను దాట టానికై వదిలిన కుర్ర, ఆబోతు (రా.)

**కుర్రదూడ** గేదె సంతతిలో నైతే మగదూడ, ఆడదూడను పడ్డ అంటారు, గోజాతిలో మగదూడ కోడె, ఆడదూడ పెయ్య (ద,క.)

**కుర్రలు** గిత్తలు (క.)

**కుర్రి** ఆవు (తె.)

**కుర్రు** ఎత్తుఎదగని పుట్టల చిట్టడవి (ద,నె.) కోపం, గుర్రు (తె.) గర్వంతో కూడిన కపటం, (తె.)

**కులకర్ణి** కరణం, శానభోగం, పట్వారి (కో,తె.)

**కులకులలాడు** జ్వరంతగలటానికి ముందు కలిగే సలపరింత (ద,నె.)

**కులాకరం** అసహ్యం (ద.)

**కులాలవాళ్ళు** దిగువజాతుల వాళ్ళు (ద.)

**కులాయించు** అభివృద్ధి పొందు (తె.)

**కులాస** సుఖం, సంతోషాతిశయం, ఉత్సాహం (కో,రా,ద.)

**కులికిద్రం** నికృష్టం (క.)

**కుల్లన్ను** మాయ, మర్మం, దాగిఉన్న విషయం (కో.)

**కుల్లులోతోడు** కుళ్ళుబోతువాడు, అసూయా పరుడు, ఓర్వలేనివాడు (తె.)

**కుళ్లేరు** సిమెంటు పూసే పనిముట్టు (ద.)

**కుళాయి** టోపి, నల్ల, పంపు, కొళాయి, (కో,ద,తె.)

**కుళ్ళాయి** చూ. కుళాయి (రా.)

**కుళ్ళిపోవు** మాసిపోవు (క.)

**కుళ్ళు** దుర్గంధం, కంపు (క.)

**కుళ్ల** ఎదుటి వారిబాగుకు చూపోపమి, అసూయ, ఓర్వలేనితనం (కో,ద,రా.)

**కుళ్లబోతు** ఓర్వలేనివాడు (కో,ద,రా.)

**కుళ్లబోతుతనం** ఓర్వలేనితనం, అసూయ (కో,ద.)

**కువాడం** హాస్యం, పరియాచకం, కుచేష్ట, చిలిపి చేష్టలు(రా.) వెక్కిరింత (తె.)

**కువ్వనేల** కువకువలాడే నేల (ద,చి.)

**కువ్వాడము** చూ. కువాడము (రా.)

**కువ్వెన** పొన్నలు, గరాటు, వాళిగ (ద.)

**కుశాల** ఉల్లాసం, హుషారు (కో,రా,తె,ద.)

**కుషామత్** సంబరం (కో,క.)

**కుషి** సంతోషం (తె.)

**కుసంది** ఇరుకు, ఇరుకైనసందు, గొంది (ద.)

**కుసామతు** క్షేమం (తె.)

**కుసి** ఒకదానిని ఇంకొకదాని రంధ్రంలో బిగించటానికి రెండు పక్కలా చెక్కి చేసిన పొడవు భాగం, పిసి, కూసం (రా,తె,ద.)

**కుసిని** (కొట్టు) వంటశాల (క.) వంటవాడు, బట్లరు (కో,క.)

**కుసిద్దము** అసూయ (రా.)

**కుసిలించు** మెల్లగాఏడ్చు, కుసిలిచ్చు, కుంటు (రా.)

**కుసిల్లడం** కుమిలిపోవు (క.)

**కుసిల్లిపోవడం** కుమిలిపోవడం (క.)

**కూకుంటావ్** కూచుంటావ్ (కో,తె.)

**కూకుడు** కూర్చుండు (క.) అస్తమయం, పొద్దుకుంకటం (ద,చి.)

**కూచంటి** మిక్కిలిచంటి (తె.)

**కూచం** మంచపు పట్టె, స్తంభం చివరలు మరొకదానిలోకి దూర్చటానికి చెక్కిన భాగం, కుసి, పిసి (తె.) ఇంటికి ఉపయోగించిన కొయ్య కంబం (ద.) రాతికంబం, స్తంభం, కూసం (ద,చి.)



**కూచీరుగు** విచ్చుకొనిపోవు (తె.)

**కూచుకో** కూర్చో (ద.)

**కూటికలబంద** కళ్ళనొప్పికి పనికివచ్చే చిన్న కలబందజాతిఔషధి, ఇళ్ళలో వేలాడ గడితే దోమలుచేరవు (ద,చి.)

**కూటికునుకు** భోజనానంతరంతీసే చిన్న కూర్కు, నిద్ర (క.)

**కూటిముచ్చు** చాలా తిండిపోతు (తె.)

**కూటిముత్యం** కల్లముత్యం (ద,నె.)

**కూటీ** చిలుకకొయ్య (తె.)

**కూటు** ఎన్నోరకాల కూరగాయలు కలిపి చేసే ముద్దపులుసు (ద.), మొదటఎత్తిన మొలక (తె,కరీం.)

**కూటుపుట్టకెక్కు** ఇసుకలోలేచే చిన్న రకం పుట్టగొడుగు (క.)

**కూచి** ఏమితెలియనివ్యక్తి, అవ్యక్తుడు (కో.)

**కూచి** చిన్న (క,నుడి.)

**కుండజల** పెద్దధారగా ఉబికేజల (క.)

**కూడదీయు** రాబట్టు (క,నుడి.)

**కూడబలుకు** ముందుగాఅనుకొని నిర్ణయం చేయు (కో,ద,క.)

**కూడలి** నదీసంగమం, గూడలి (రా.) వీధులుకలిసే చోటు (ద,తె,రా,కో.)

**కూతకొచ్చినకోడి** వయసువచ్చిన మగకోడి, అరకోడి (కో.)

**కూతదూరం** పిలిస్తేవినబడేంతదూరం, కూతవేటుదూరం (ద,చి.)

**కూతవేటుదూరం** కూతవినపడేంతదూరం, (కో,ద.) పిలుపువినవచ్చేదూరం

**కూతు** వీధి భాగవతం (ద,చి.)

**కూనం** చొక్క (క.) జ్ఞాపకం (తె.)

**కూనరాగం** పిల్లరాగం, లోలోపలే తీసేది, పాడుకొనేటటువంటిరాగం (కో,ద,రా,తె.) సంతోషంతో ఏకాంతంలో తీసేరాగం (ద.) కూనిరాగం

**కూనరొయ్య** చిన్నపాటి సముద్రపురొయ్య, (ద,నె.) రొయ్యపొట్టు

**కూనలు** పిల్లలకు కండ్లలో పెరిగే దుర్మాంసం (తె.)

**కూనిరాగం** చూ. కూనరాగం (కో.)

**కూను** చెవిటి (రా.) నిండుగా, పూర్తిగా

**కూపీ** జాడ (ద,కో,క.), రహస్యం (క.)

**కూపీతీయటం** రహస్యసమాచారం వెలికితీసే ప్రయత్నం (కో,ద.)

**కూర** మాంసం (తె,ద,రా.)

**కూరాకు** వండినశాకం (ద,రా,తె.)

**కూరాడు** బియ్యంకడిగిన నీరు, కడుగు, కలి, ఆదిపోసేకుండ; తరవాణి, ప్రతిశుభకార్యంలో పండుగరోజులలో దీనికి నైవేద్యం పెట్టేఆచారం ఉంది, నూతనగృహప్రవేశ సందర్భంలో ఇంటి ఆడపడుచు ఈ కుండ ఎత్తుకునివచ్చి కట్నంతీసుకుంటుంది. (తె.) ఈ కలికుండకు ప్రతిదినం పసుపు కుంకుమ అద్దుతారు (ద.)

**కూరు** కిటికిలు, వాకిళ్ళు చట్రం బిగించటానికి కట్టెలోవేసే తొలి (ద.)

**కూవారిల్లు** కుసినారిల్లు, పూర్తిగా బలహీన పడిపోవు (ద.)

**కూసం** కొయ్యకంబానికి చివరన తొలిచిన సన్ననితొలుపు, కూచం (కో,తె.) ఇంటికి ఉపయోగించే కొయ్యస్తంభం (ద.)

**కూసం** చూ. కూచం (కో.)

**కూసంత** కొంచెం, కీసంత (తె.)

కూన ముక్కుపొడుం చేసుకొనే మట్టిపాత్ర (తె.)

కూనము చొక్కా (క.నుడి.)

కూసి చిన్నపిల్ల (క.) కూచి, సన్నని మొన (ద.)

కూసు చిన్న, అశ్రమమైన, సులభ సాధ్యమైన (క,ద.)

కూసులు బండిపారులపై బిగించే చిన్న నిలువులు, గుజ్జులు (ద,చి.)

కృష్ణకొండి నెమలిఫించం (ద.)

కృష్ణనీలాలు వరిధాన్యంలో ఒకరకం, సన్ననివరి (ద,చి.)

కృష్ణమూర్తి రసికుడు (క.)

కెకమకెకవుడు మూర్ఖుడు (రా.)

కెక్కరించు కోడికాళ్ళతో పెంటచిమ్ము (క,నుడి.)

కెచ్చల తెలివితక్కువతనం (క.)

కెచ్చు పారతో పెళ్ళగాతీసిన మన్ను, పెళ్ళ (క.)

కెదకు పెల్లగించు (ద.)

కెంపు సారాయి (తె.) కంకరతెగులు (కో.)

కెంపువచ్చు మామిడికాయలు రంగుమారి పండటానికి సిద్ధమగు (ద.)

కెంపెక్కు పండబారు (ద,నె.)

కెర్లడం పొర్లడం (క.)

కెర్లుకురావటం పొర్లుకురావటం (క.)

కెర్లించడం మాటిమాటికీ అదేవిషయం ఎత్తుతూ ఉండటం (కో.)

కెర్లిస్తూ వెక్కుతూ (కో.)

కెలుకు కోళ్ళు మొదలైనవి మురికిచోట్ల తమ ఆహారంనిమిత్తం కెళ్ళగించు,పొడిచిచుట్టుపట్ల విరజిమ్ము, పిల్లలు కంచాలలో చేయితిప్పుతూ అన్నాన్ని అటుఇటుతోయు (కో.)

కెల్లి నుంచి, నుండి (కో,తె.)

కెళవు వైపు (క,నుడి.)

కేకేసి కేకవేసిపిలిచి (తె.)

కేంద్రగించటం కాంద్రించడం (క.)

కేక చిందులుతొక్కుతూ బిగ్గరగా అరచు (ద,నె.)

కేకవేయు పిలుచుకొనివచ్చు (క.)

కేజంగిరేకులు గేదంగిరేకులు, మొగలిరేకులు (క.)

కేటించటం వికటించటం, ధిక్కరించటం

కేటు అసలురహస్యం, మర్మం, లోపలివేరు మొదలు (తె.)

కేడి ఒక జాతిధాన్యంలో కలసిన ఇంకొక జాతిగింజ బెరుకులు, ఇతరుడు, కేళి (ద,నె.) నమ్మరానివాడు (రా,కో.)

కేతిగాడు తోలుబొమ్మలాటలో ప్రధానమైన హాస్యగాని పాత్ర (కో,ద,రా.)

కేదరి ఏటవాలుగా వేసిన మడవ (ద,నె.)

కేదగిబిళ్ళ మొగలిరేకు తిప్పిచుట్టినట్లుండే జడబిళ్ళ (రా.)

కేదరిగాడు చు. కేతిగాడు, గంతోళిగాడు

కేదరివాటు కేదరిమడవలె ఏటవాలుగా నుండేది (ద,నె,తె.)

కేపు మోసము ఉదా॥ వాడు కేపుపుచేసిపోయినాడు, కేపుమారి (ద.) దొంగతనం (తె.) గింజలుపుచ్చటం ప్రారంభించు (కో.)

కేపుమారి టోపీలుమార్చేవాడు, మోసగాడు, కేప్మారి (ద.)



కేప్మారి వంచకుడు; కేపుమారి (రా.)

కేరణాలు కేరింతలు (తె.)

కేరాకు పొగాకులో నాసిరకం (తె.)

కేరింతలు సంతోషంతోచేసే ఆర్భాటం (తె,కో.)

కేరు కోడిపెట్ట గుడ్డుపెట్టటానికి ముందువేసే పొడికూత ఉదా॥ పెట్టకేరుతున్నది (ద,కో,తె,రా.)

కేళి చూ. కేడి (కో.)

కేవు తెలివికలగటం, మెలుకువకలగటం (క.) పడవకూలి, ఒకచోటనుంచి ఒకచోటుకు చేరటానికి పడవప్రయాణం నిమిత్తమై చెల్లించాల్సిన సొమ్ము (కో.)

కేవుకురాడు దారికిరాడు, రేవుకురాడు (ద,నె.)

కేశవ అల్లరి, వేళాకోళపు తనము (ద,నె.)

కైంకర్యం అపహరణం, మోసం (కో,క.ద.)

కైకలవాడు బట్టలునేసేజాతి, వీళ్ళుబేలుదారి పనిగూడా చేస్తారు; పద్మసాలి (ద.)

కైకలు కూలి, కైలు (ద.)

కైకాలవాడు చూ. కైకలవాడు (ద.)

కైకిలి దినకూలి, కూలి (తె.), అదనం (ద,నె.)

కైకురుబొయికురు వ్యర్థమైనవివాదం (కో.)

కైకోల్లువాడు బట్టలునేసేవాడు (ద,చి.)

కైగ బాగా, పొదుపుగా, తగినవిధంగా, రుచిగా (ద.)

కైజారు చిన్నతెడ్డు, కర్ర, గరిటె (తె.) చిన్నకత్తి (కో.)

కైతకములు సాకులు, కల్పనలు (తె.)

కైదుకానా జైలు (క.)

కైనీడ కీనీడ (తె.)

కైఫియత్తు సంజాయిషీ, సమాధానం (క.)

కైఫీతు వాజ్మూలం (క,నుడి.)

కైరతు చతురోపాయం, దండవిధి (తె.)

కైరా తెల్లటిపావురం (క.)

కైలాటం జగడం, కలహం (తె.)

కైలాటకాడు జగడాలమారి (తె.)

కైలాటి తమాషా, కైలాటగాడు (రా.)

కైలు కూలి, కైకలు (తె,కో.)

కైలుచేయు ధాన్యాన్నిపంజగొట్టి తూర్పారబట్టి సిద్ధపరచు (తె.)

కైవాలటం పండినచేను పైరుభూమిపై ప్రవాలటం (కో.)

కైవాసం ధాన్యాదులగాదెలు వర్షానికి తడిసిపోకుండటానికై ఇంటికివేసే మాదిరిఇలారం యొక్క వ్యాసము (ద,నె.)

కైసరు పొగడు (క,నుడి.)

కొంక బెత్తానికి మొదట్లోవుడేవంక; కొంగ; కొంకి (తె,రా.)

కొంకి బట్టలు మొదలైనవి తగిలించటానికి గోడకు అమర్చే సాధనపువంకీగా ఉండేభాగం (కో,తె.)

కొంకర్లుపోవు చూ. కొంగర్లుపోవు (తె,రా.) చలికి ఒళ్ళు కుంచించుకుపోవు, బిగుసుకొనిపోవు

కొంకి వెదురుకొసను తగిలించే కత్తి, కొంకిగడ, కత్తిదోటి (ద,చి.), చేతికర్రకు చివర వుండే వంకరకొంకి (ద,నె.)

కొంకిగడె వాసము (ద.)

కొంకిగాను చెరుకుగానుగు తిప్పే సాధనము (ద.)

కొంకిబద్ద గొడ్లకాపరులు చేతపట్టే కర్ర (కో.)

**కొంకుపూలు** ఎద్దుకొమ్ము కుప్పెలు (రా.)

**కొంగ** చూ. కొంక (రా.)

**కొంగతంత్రం** కార్యసాధనకుచాలని ఉపాయము (ద,నె.)

**కొంగపార** కొంగమూతిలాగా పొడుగ్గా ఉండేపార (ద.)

**కొంగర్లుపోవు** చలివల్లగాని, వాతంవల్లగాని శరీరం వంకరబోవు, కుంచించుకొను (కో,ద, రా.)

**కొంగవాడు** పొడవైన సన్ననివాడు, కొంగకాళ్ళోడు (ద.)

**కొంగాలుకత్తి** వంకరకత్తి, జాతరలలో దీన్ని పైకివిత్తిపట్టుకొని చిందులుతొక్కుతారు, బహుశా కొంగవాలుకత్తినుంచి ఈ రూపం ఏర్పడి ఉంటుంది (ద,క.)

**కొంగిరిచేష్టలు** కొంటెపనులు, కోతిచేష్టలు (రా.)

**కొంగుబంగారం** స్వాధీనంలో ఉన్నద్రవ్యం, స్వాధీనవస్తువు, సులభసాధ్యమైనది (కో,రా.)

**కొంగుముడివేయు** పెండ్లిజరుపు (కో.) గట్టిగా పదిలపరచు (ద,నె,రా,తె.)

**కొంచబోతా** తీసుకొనిపోతా (తె.)

**కొంటబో** తీసుకొనిపో, తీసుకపో (తె.)

**కొంటవోయి** తీసుకొనిపోయి (తె.)

**కొంటె** తెలివితేటలతో గూడిన చిలిపితనం (కో.) చెడ్డతలపులేని అల్లరితనం (ద,రా,తె.)

**కొంటెకాయ** గడుగ్గాయ, అల్లరిపిల్లవాడు (రా.)

**కొంటెకాసులు** కాసులుదండగా చేయటానికి వీలుగా కొండీలు అతికిచేసిన కాసులు (కో.)

**కొంటెగాలం** పోకిరికారు (ద,చి.)

**కొండకొప్పు** కొండశిఖరం (క.)

**కొండక** తీసుకొనిరా, కొంద్రా (ద,చి.)

**కొండకాసులు** కొండకుఅంటే తిరుమలకు కట్టిన మొక్కుబిళ్ళ ముడుపులు (రా.)

**కొండకెదిరిచూచు** నిరంతరం నిరీక్షించు (తె.)

**కొండగెడ్డ** సెలయేరు, ఊటనీరు (క.)

**కొండచీపురు** ఎజన్సీప్రాంతంలో దొరికే ఒక రకం చీపురుగడ్డి (క.)

**కొండచుట్టుతిరునాళ్లు** దేవుడికొండచుట్టూ చుట్టే ఊరేగింపు, రథసప్తమినాడు జరుగుతుంది (ద,చి.)

**కొండజ్వరం** మలేరియా, విషజ్వరం (క.)

**కొండదొర** జోస్యంచెపుతామని, భవిష్యత్తు చెపుతామని అంటూ జులపాలు, కర్ణాభరణాలు, రంగుబట్టలతో కొండప్రాంతాలనుంచివచ్చే గిరిజనుడు (కో.)

**కొండనాలుక** నాలుకకొసనఉండే చిన్న నాలుక ఉబ్బినొప్పి పుట్టటాన్నికొండ నాలుక అయిందని అంటారు, చిరునాల్క, కిరునాలుక

**కొండన్న** తేలు, కొండెన్న (ద,చి.)

**కొండపండు** అపురూపము (తె.)

**కొండమంగలి** పూర్తిగా క్షురకర్మచేయకుండా సగంసగం పూర్తిచేసి మరోచోటికి పరిగెత్తే వ్యక్తి; పూర్వం తిరుపతికొండ మీద భక్తులకిది అనుభవంలో ఉండేది (కో,ద.)

**కొండమెక్కికూర్చుండు** తెగనీల్గు (క, నుడి.)

**కొండి** రెక్కగాని, తోకగానిలేకపోవటం (క.) ఉదా॥ ఆ కుక్కతోకకొండి, మొండితోక, పసిపిల్లల ముచ్చటముడి, ముందుకి అల్లే చిన్న జడ (కో.)



**కొండికాసు** ప్రతిశనివారం భజనబృందం ఊరు చుట్టేటప్పుడు గరుడ కంబంలో వేసేకానుక, నాణెం (ద.)

**కొండిచీల** బండినొగ వెనకభాగంలో బిగించి మోకును కట్టటానికుపయోగించే ఇనుపచీల (ద.)

**కొండిజడ** చిన్నపిల్లలకు ముందరజెడ వేసి చుట్టినది (కో,తె.)

**కొండిమిళ్లి** చిన్నమిళ్ళి, పక్కకుగొట్టంకల ముక్కుచెంబు (తె.)

**కొండిమొల** నాగలికి కర్రుపట్టి ఉంచేమొల (తె.)

**కొండెంగ** మూతినల్లగా ఉండే కోతిజాతి (తె.)

**కొండెకానులు** తేలు మొదలైన విషకీటకాల బాధలేకుండా చేయాల్సిందని కొన్నిచోట్ల దేవాలయంలో దేవునిసన్నిధి ప్రమిదలలో భక్తులర్పించే చిన్న కానుకలు (ద.)

**కొండెక్కు** ఆరిపోవు ఉదా: దీపం కొండెక్కింది (కో,రా,తె.)

**కొందల** తెల్లటి మంచినీటిచేప (రా.)

**కొందు** కుందు (ద.)

**కొక్కి** కొంకి, కొంకె, చొక్కాలు తగిలించుకొనే వంకరచీల, చిలుకు (రా.ద.)

**కొక్కిరించు** ముణగదీసుకొని కూర్చుండు, వ్యాధిచేదుర్బలమగు (ద,తె.) వెక్కిరించు, మాటకుమాట రెట్టించు (కో.)

**కొక్కుబట్టు** కోడి గుడ్డు పెట్టటానికి ముందు కోకో అంటూ గుడ్డుపెట్టేస్థానం కోసం ఇటూ అటూ వెదుకులాడు కోవటం, కేరు (తె.)

**కొక్కువట్టింది** కోడిపెట్ట పొదుగుతూనే మధ్య గుడ్లుపెడుతూ ఉండటం (తె.)

**కొక్కెరతెగులు** కోళ్ళకు వచ్చేరోగం (ద.)

**కొటాయి** అలంకారం చేసిన పెళ్ళిపందిరి (ద.) కొట్టం, సినిమాహాలు ఉదా: ఆ కొటాయిలో ఏమిఆట (ద,చి.)

**కొటారం** పేర్చిన దొంతులవరస (తె.)

**కొటారు** ఉప్పు పెద్ద పెద్ద కుప్పలుగా నిలువచేసి ఉంచే చోటు, ధాన్యపుకొట్టు (కో,రా.) ధాన్యపురాశి (ద.) చిటారు, కొట్టకొన, చివర (తె,ద.)

**కొటీరు** గది, క్రమ (తె.)

**కొటేరువేసినట్లు** కొంచెం వంపుతిరిగి అక్కడి నుంచిసూటిగా ఉండే ఆకృతి (ద,రా,తె,కో.)

**కొట్టము** ఓరపాక, వసారా (రా.)

**కొట్టికొలారంచేయు** అనవసరమైన ఆర్భాటం చేయు (ద,కో.)

**కొట్టినపిండి** బాగాతెలిసిన విషయం, తెలిసిన సంగతి, ఒకవిషయంలో అధికపరిజ్ఞానం (కో, తె.)

**కొట్టిపెట్టు** ఖండించు (తె.)

**కొట్టిపోయు** అధికంగా మాట్లాడు (కో.)

**కొట్టు** గది, కొట్టడి, చెరసాల (కో,ద,రా.) అంగడి (కో.) వినాశం (తె.)

**కొట్టు** ధాన్యం నిలువవుంచే చోటు, పాతర (కో,తె.)

**కొట్టెడి** గది, కొట్టు (తె.)

**కొట్టేశిండు** తీసుకున్నాడు (తె.)

**కొట్నము** వడ్లుదంచటానికి కూలిగా ఏర్పాటు చేసుకొన్న బియ్యం, ఇన్నిశేర్లకిన్నిశేర్ల బియ్యం అని వొప్పందం (రా.)

**కొ్రట** ఉడికిన సంగటిపాకంలో కలిపేనూక, ఉడుకుసంకటి (ద.)

**కొట్లాట** కొట్టుకోవటం, దెబ్బలాట (ద,తె, రా.)

**కొడ** స్పర్శ (తె.)

**కొడమ** చేపలు పట్టేసాధనం, కొదమ (ద.)

**కొడవటిపూజ్యం** పైరుకోయవలసిన పని లేకుండానే ఎండిపోవటం (ద.)

**కొడి** పతాకం, జెండా (ద.) నిలకడలేని చిత్తం, పొల్లు (కో.) శిఖరం(రా.)

**కొడిగట్టు** తిరునాళ్ళు ప్రారంభించటానికి ధ్వజారోహణంచేయు, ప్రయత్నంఫలించు (ద.) దీపపువత్తికి నూనె అందక ఎర్రపడిపోవు, కాంతి విహీనమగు (కో.)

**కొడితి** పిడిగల చిన్న కర్రదిమ్మ (రా.)

**కొడివళ్లు** పిండివంటలు (ద.)

**కొడిశపాలు** ఏజన్సీ ప్రాంతంలో పెరిగే వృక్షం, దీనివిత్తులు ఆయుర్వేద ఔషధాల తయారీలో ఉపయోగిస్తారు (క.)

**కొడిసెపొరక** దూలాలపై వేసే దంతి, వావిలి పొరక (తె.)

**కొడుపు** వరి వెన్నుకు బదులుగా పుట్టే ఒక తెల్లటికాడ, (ద.) ఇది ఒకరకమైన పంట తెగులు; నిచ్చెనకు అడ్డంగా వేసే మెట్టుపుల్ల (రా.) అప్పడాలు మొదలైనవి వొత్తటానికి ఉపయోగించే గుండ్రటి కొయ్య (ద,తె,రా.)

**కొడుపుకొను** రాల్చుకొను (రా.)

**కొడుపులు** పశువులకు వాతలువేసే ఇనప కమ్మిలు, కొణుపులు, కొదుపులు (ద.)

**కొడె** గొడుగు (ద.)

**కొడెక్కింది** దేవాలయ ఉత్సవం ప్రారంభమైంది, కొడిగట్టినారు (ద.)

**కొడెము** బండి పరముల చివర కొమ్ము (ద.)

**కొణతము** చేతులకు వేసే సంకెళ్ళు (తె.)

**కొణాతాము** పెద్ద తాళపు చెవి (క.)

**కొణిదెడు** గిద్దెడు, సోలెడు వంటి పరిమాణార్థ వాచకం, కొలత, రాయలసీమలో పెద్ద కొణెదల మొదలైన కుటుంబ సంప్రదాయాలున్నవి (కో.)

**కొణుజు** మట్టిలో ఉండే సన్నటి పురుగు (ద.)

**కొణుపు** పశువులను వాతబెట్టే ఇనపశలాక, కొడుపు, కొదుపు (తె.)

**కొణుసు** కవుజు వంటి పిట్ట (క.)

**కొత్త** పండించిన పంటను మెదటిసారిగా ఇంట్లో వండుకోవటం, కొత్తపంటను తొలిసారిగా పొంగించటం (తె.)

**కొత్తరికం** కొత్త (కో.)

**కొత్తలు** పైసలు (డబ్బులు) (తె.)

**కొత్తలెట్టటం** కొత్తవడ్లు దంచి, ఇంట్లోవాడటానికి ముందుగా పొంగించటం (తె.)

**కొత్తామాసా** (కొత్త అమావాస్య) ఉగాది (క.)

**కొత్తాము** మెడ వెనకభాగం, కొత్తెము, మెడ (క.)

**కొత్తి** మడిగట్టు (క.)

**కొత్తినరకటం** కొత్తగా పంటభూములు తయారు చేయటం (క.)

**కొత్తిని** చూ. పుత్తెము (కో.)

**కొత్తిపోళ్ళు** అడవి ప్రాంతాలలో కొత్తగా సాగుచేసే భూములు (క.)

**కొత్తెము** తల వెనకభాగము, ముచ్చిలిగుంట (క.)

**కొదమ** మిగిలిన, తక్కిన, తతిమ్మా, (కో,ద,తె,రా.) లేత (కో,ద,తె.)

**కొదుకు** నత్తిగా పలుకు, కొతుకు (తె.)

**కొదుపులు** చూ. కొణుపులు (తె.)



**కొద్దుడ్డి** నాలుగు పైసలు, (దమ్మిడీలు); డబ్బు (ద.)

**కొనచిటుకులు** చేపని పాడి పశువుల వల్ల లభించిన కొద్దిపాలు (ద.)

**కొనామొదటికి** చివరనుంచి మొదటికి, (ద.) తెంపులేని (కో.)

**కొనవేయు** చిన్న మేకపిల్లకు గాని, గొర్రె పిల్లకుగాని తల్లిరొమ్ము పట్టి పాలుకుడిపించు (ద,రా.)

**కొనాకు** కొసాకు, చివరకు (తె.)

**కొనాకెల్లి** చివరిలో (తె.)

**కొనుబడి** కొనుగోలు (కో,క.)

**కొనేరు** వాడిపోవు (క.)

**కొనేరుగా** నిరుత్సాహంగా (క.)

**కొన్నకాంత** కట్టుకున్న ఇల్లాలు, భార్య (ద.)

**కొప్పరం** చూ. కొప్పెర (రా.)

**కొప్పిరిగి** కంబళి లేదా గోనెసంచితో వేసుకొనే ముసుగు (రా.)

**కొప్పు** స్త్రీలు కురులను పాయలుగాతీసి జడ అల్లి చుట్టుతిప్పి అమర్చుకొనే ముడి, మగవారు వేసే ముడిని 'పిడిగంటు' అంటారు, ఇంటి కప్పులో వెన్నుగాడి భాగము (ద,రా,తె,కో.) గోనిసంచి రెండుకొసలను ఒకచోట చేర్చి వర్షంలో తడవకుండా నెత్తిమీద వేసుకొనే గూడ వంటిది, కొప్పెర, కొప్పరము, పర్వత శిఖరము (రా.) తల, శిఖరం (క.)

**కొప్పుగొలుసులు** చెవినుంచి వెనకకుకొప్పుకు తగిలించే గొలుసు నగ (కో.)

**కొప్పులోకొరివి** మహాదుష్టుడు (తె.)

**కొప్పెర** పెద్ద ఇత్తడిపాత్ర, కప్పెర (తె.) చూ. కొప్పరం (రా.) గొంగడి ముసుగు, డేకిసా (తె.)

**కొప్రము** నిండా, కొప్పరము (తె.)

**కొమదులు** ఇంటికప్పు నిర్మించడంలో లేదా ఇంటి కట్టుబాటులో ఉపయోగపడే సాధనం (కో.)

**కొమ్మరిటి** పచ్చరిటి (క.)

**కొమ్ము** అల్లం మొదలైనవాటి ముక్క, (ద,కో.) చెరువుకట్ట మొదలైనవాటి కొనఅంచు, శిఖరం, హరిజనులు ఊరేగింపులలో ఊదే అర్ధవలయాకారపు ఇత్తడి వాద్యం (తె,కో,ద.) చూ. బాకా, బాదు, నగారా, తప్పెట మొ॥ వాద్యాలు

**కొమ్ముగొడిసె** పశువులకు కొమ్ములో పుట్టే వ్రణం (ద.)

**కొమ్ములగొర్రె** కొమ్ములు అరుదుగా మొలిచే గొర్రె, అపూర్వవిషయం, శశవిషాణం వంటిది (ద.)

**కొయికాలు** చూ. కొయ్యకాలు

**కొయితా** పొడుగాటికామ గల ఒకరకమైన వేటకొడవలి (రా.)

**కొయిలగోపి** పెడకట్టె మనిషి (ద.)

**కొయ్య** చెట్లకొమ్మలకు చెందినభాగం (ద, రా,కో.)

**కొయ్యకాలు** జాతరలలోను ఇతరఉత్సవాలలోను చేసే నృత్యాలలో కాలికికట్టుకొనే చిన్న కొయ్యచట్టాలు, వీటిపైనుంచి ఆడుతారు, మరుకాలు, చెరుకుతోటను మొదటిసారి కొట్టివేసిన తర్వాత నరికిన మట్టెలనుంచి మొలిచిన గడలు (ద,రా.) జొన్న, వరి మొదలైన పంటలు కొసినతర్వాత కయ్యలో నిలిచిఉన్న అడుగు మొక్కలు (తె, ద,రా.) మడిలో పైరుకోతలు (రా.)

**కొయ్యగూర** చూ. పెరుగాకు, కొయ్యతోట కూర (తె.)

**కొయ్యగెనుసు** ఒకరకమైన గడ్డ, ఆహారంలో వ్యంజనంగా ఉపయోగ పడుతుంది, కూరచేసు కుంటారు (తె.)

**కొయ్యబారటం** శరీరం కట్టెవలె బిగుసుక పోవడం (కో.)

**కొయ్యలగోపి** పెడకట్టె, కొయిలగోపి, ప్రౌఢ (ద.)

**కొయ్యలపూటీ** గొడ్లుఈని బలహీనమైనప్పటి స్థితి (ద.)

**కొయ్యలు** నోటిపండ్లు (కో,రా.) పశువుల దంతములు (ద.)

**కొయ్యాపండు** జామపండు, రూ. గొయ్యా పండు (ద.)

**కొరకంచు** కొరవి (కో,క.)

**కొరకచ్చు** సగంకాలిన కర్రబొగ్గు, కొరివి (తె.)

**కొరకరానికొయ్య** (కో,రా,ద,తె.) లొంగుబాటుగాని వ్యక్తి, అలవిగాని వ్యక్తి, మూర్ఖుడు (రా.)

**కొరకాసు** కొరకంచు (తె.)

**కొరకూత** కోరకూత, వయస్సువచ్చే సమ యంలో కోడిపుంజువేసే కూత (ద.)

**కొరకొర** కోపాధిక్యత ప్రదర్శించే చూపు, వైఖరి (కో.) ఎడతెగని తగులాటం (తె.)

**కొరకొరలు** కోపంతోకూడిన చూపులు, (కో,రా.) అసంపూర్తిపనులు, అరకొరలు (ద.)

**కొరజా** ఒకఇంటివాకిటికి అవతలఉన్న చిన్న ఇల్లు (క.)

**కొరట** బియ్యపు సన్ననూక ఉడకబెట్టిన సంకటి వంటిది (ద.) దోసెపిండి మెదుపుకోసం దీన్ని చేరుస్తారు, అంబలి, కాట (ద.)

**కొరదా** మిగతా, మినహాయింపు, కొరత, వెలితి (క.)

**కొరమీను** ఒకజాతి మంచినీటి చేప (కో, ద,రా.)

**కొరవ** మిగిలినది, తరువాయి (కో,ద,రా, తె.)

**కొరవా** రస్తా, డొంక (ద.)

**కొరవసరవ** మిగిలిఉన్నది, మిగిలిపోయినది (కో,ద.)

**కొరవికారం** పండుమిరపకాయలు, ఉప్పు చింతపండు చేర్చి రోటిలో తొక్కి ఏడాదిపొడుగున నిలువ ఉంచుకొనే పచ్చడి, పండుమిరపకాయల కారం (కో.)

**కొరసలు** ఉప్పు వ్యాపారం చేసేవారు (ద.)

**కొరితి** బొండగొయ్య, బండకొయ్య (తె.)

**కొరిపె** ఒకరకపుచేప,కురిపె (తె.)

**కొరివి** మండుతున్నకట్టె, (కో,తె,రా,ద.) విసుగుదలను కోపాన్నిచూపేటప్పుడు పిల్లలను తిట్టేతిట్టు (కో.)

**కొరుకు** కాలినకర్రముక్క (తె.)

**కొర్ద** ఒక పెద్దరకం చేప (ద.)

**కొర్ని** దుక్కిచేయకుండా వదలివేసినపొలము, కొర్ను (క.)

**కొర్ను** దున్ననిభూమి; కొర్ని; బీడుపెట్టిన పొలం, పడియ (క.)

**కొర్నుభూమి** రిత్తనేల, చవిటిపర్ర (క.)

**కొర్రమట్ట** చూ. మట్టిగిడస, కొరమీను (తె.)

**కొర్రాయి** చూ. కొరకచ్చు, ఒకరకంపూలు (తె.)



**కొర్రు** కాలుతున్నకట్టె (ద,తె.) చెట్టుపైన ఎండిసగం మిగిలినకట్టె (ద,రా.) ఎండినకొమ్మ, ఇనపకడ్డీ (రా,కో.) ఇంద్రధనుస్సు (ద,తె.) ముండ్లు తగులుకొని కాని మరేవిధంగాకాని గుడ్డలో ఏర్పడ్డ చినుగు, పురణశిక్ష (ద,కో.)

**కొలకుండ** ధాన్యాన్నికొలిచే మట్టిబాన, కుండ, బాన, కొలబాన (ద.)

**కొలగారం** ధాన్యాన్ని (అమ్మటానికి) కొలవ టం (కో,ద.) అమ్మిన ధాన్యాన్ని కొలవటానికి ఇచ్చేకూలి (క.)

**కొలబాన** ధాన్యాన్నికొలిచే కుండ, సాధార ణంగా ఇది తూమెడుగా ఉంటుంది, కొలకుండ (ద.)

**కొలలు** చెంచులు మొదలైన ఆటవికజాతుల దేవతా కొలుపులు (ద.)

**కొలికి** కొస, సురక్షితస్థానం, అనుకొన్న విధమైన ముగింపు, పర్యవసానం, ముగింపు, సమాప్తి, తుదిస్వరూపం, ఉదా॥ ఒక కొలిక్కి తేవటం (కో,ద,తె,క.)

**కొలికికివచ్చు** సమాప్తికివచ్చు, సుముఖ మగు (తె,ద.)

**కొలికిడి** రెండుకొనలను కలిపేముడి (తె.)

**కొలికిలు** మూడునూర్ల కుంచాలులేదా అర గరిసె (క.)

**కొలికెడు** $1\frac{1}{2}$ బండిధాన్యం (క.)

**కొలిమి** స్త్రీపురుషసమాగమం (క.) వడ్రంగి కొలిమి (కో,ద.)

**కొలుగుంట** పుట్టినబిడ్డకు పురిటిరోజుల్లో నీళ్ళుపోయటానికి, అంటే ఆ పోసిననీళ్ళు పోవటా నికి ఉపయోగించే నీటిగుంట, కొల్లు (ద.)

**కొలుపు** (ద.) గ్రామదేవతలకు గొర్లకాప రులుచేసే తిరునాళ్ళు, ఇందులో జంతుబలి ఉండదు, రచ్చ, అమ్మవారికి చేసే కొలుపులు (తె, ద,రా,కో,క.) ఎడతెగని వాక్కలహం, ప్రసం గం (తె.)

**కొలుపులు** మ్రొక్కుబడులు (కో,తె,ద.)

**కొలువు** ఉద్యోగం (తె.)

**కొలుసు** రజకులు ఏటేటా సంక్రాంతి పండుగతర్వాత తమ యజమానులవద్ద వసూలు చేసుకొనేకట్నం (ద.)

**కొల్ల** అధికం, కోకొల్లలు (కో,ద.)

**కొల్లడుచు** పండినపంటను వీలైనవరకు కోసు కొని మిగతాది వదలివేయు, ఈటుబోవు (ద.)

**కొల్లాపురము** లేనిపోనిజంజాటము, గందర గోళం, పెద్దరంగం సృష్టించటం, జాతర సృష్టిం చటం (తె.)

**కొల్లికూర** తోటకూర (క.)

**కొల్లు** పురిటినీళ్ళు అందులోకి ప్రవహించటా నికి త్రవ్వినగుంట, కోలుగుంట (కో.)

**కొల్లుపోతు** పెద్దజాతి దున్నపోతు, ఎడ్డెమడ్డి వ్యక్తి (ద.)

**కొల్వు** ఉద్యోగం, జీవిక, పని (తె.)

**కొళబె** లోపల బోలుగల కొయ్య (ద.)

**కొళాయి** నీళ్ళపంపు, కుళాయి (ద,రా,తె, కో.)

**కొళ్ళ** అధికం, కొల్ల (ద.)

**కొళ్ళు** చూ. కుయిలు (రా.)

**కొవ్వొత్తులు** మైనపువత్తులు, మొంబత్తులు (కో.)

**కొశాకు** బాగా గుబురుగాఎదిగే బీటిగడ్డి (ద.)

**కొస** జడచివరకట్టే పేలిక (క.) పురికొస (ద,కో,తె.)

**కాసి** ఏక్షేత్రైనాస్థలంలోగాని పొలంలోకాని ఒక మూల హెచ్చుగా మిగిలినస్థలం (కో.) వాడి (రా.)

**కాసికింత** కొంచెం, కిసికింత (తె.)

**కాసెగ్రి** ముక్కోపి, వెర్రిబాగులవ్యక్తి, చపల చిత్తుడు (ద.)

**కాస్పెగా** పొడవుగా (తె.)

**కోకొల్లలు** సమృద్ధి, ఇబ్బడిముబ్బడి (కో.)

**కోగిరి** గుర్రంమీద పరచే పరుపు (తె.)

**కోగిరీభర్తీ** మోయదగినంత బరువు (తె.)

**కోచ** పిరికితనం, కోస (రా,ద.) ముక్కు పొడుంతయారుచేసుకొనే మట్టిపాత్ర (కో.)

**కోచీలు** రెట్టకడియాలు (క.)

**కోచెము** రుచిగా ఉండే చిన్నచేప (క.)

**కోటలోపాగావేయు** తలచినది సాధించు, కీలకమును వశపరచుకొను (కో,క.)

**కోటవిడుపుకాలం** దుర్ముహూర్తం (ద.)

**కోటాకు** చూ. పోటాకు (కో.)

**కోట్రం** కోటరికం, కోడరికం (ద.)

**కోడంటికం** కోటరికం (తె.)

**కోడపైరు** మెట్టపైరు, వేసవిపైరు (క,ద, రా.)

**కోడరికం** కోటరకం, కోడంట్రికం (కో.)

**కోడాలు** గొడ్డలి, కట్టెలుచీల్చే పరికరము (ద.)

**కోడి** చెరువుఅలుగు, కలుజు (రా.)

**కోడికత్తి** దబ్బనంవంటి సాధనం, సన్నటి సూది (క.)

**కోడినిదుర** చప్పున మెలకువతెచ్చుకొనే నిద్ర (ద,తె.) అరకొర నిద్ర; నిద్రలో చాలాసార్లు మేల్కొవటం (రా.)

**కోడిపెట్టలు** బండిఇరుసుకు (ఉద్దికి) మధ్య ఉండే కర్రలు (క.)

**కోడిపేను** బక్కచిక్కిన దూడలకు పట్టే పేలు, కోడిగోమారి (ద.)

**కోడివేడి** అతితొందరగా తెచ్చుకొనే కోపం (క.)

**కోడు** కర్రాపుల్ల లేదా బిళ్ళకోడు అనేఆటలో బిళ్ళను ఎగచిమ్మే సాధనం (కో,ద.) చేటతో ధాన్యంతీరుగా చెరగటం (రా,తె.) పొలాలలో అధికమైన వాననీరు నిలిచిఉండే పల్లము (కో.) పడవ, బాడవ

**కోడు** సన్నని కాలవ (కో.)

**కోడుంబిళ్ళలు** చేగోడీలు అనే పిండివంట (ద.)

**కోడుపోయింది** మొరవసాగింది (ద,చి.) ఉదా॥ చెరువు కోడుపోయింది

**కోడుబళ్ళు** పెద్దవైన చక్కిలాలు (రా.)

**కోడెకారు** యౌవ్వనం (కో,తె.)

**కోడెలబేరం** స్థానికంగా మేలైన కోడెలను కొనుగోలు చేసి వాటిని దూర ప్రాంతాలకు తీసుకొనివెళ్ళి డబ్బు వసూలు కాకపోయినా వాటిని అక్కడ అమ్మి మరుసటి సంవత్సరం వెళ్ళి ఆడబ్బు వసూలు చేసుకొనే వ్యాపారము (ద,తె.)

**కోణం** మన్ను తవ్వటానికుపయోగించే సాధనం (క.)

**కోణితి** చిన్నకొలత సాధనం (క.)

**కోత** దుస్సహమైన బాధ, పంటకోత, కోత కాలం (కో,తె.)

**కోతపరువు** పైరు పండి కోతకు సిద్ధమైన స్థితి

**కోతబడు** మినహాయింపుకు గురియగు (కో,తె.)



**కోతలు** బడాయిలు, ప్రగల్భాలు, (ద,కో.) అసత్యాలు (క.)

**కోతికొమ్మంచి** చిన్నపిల్లలాడే ఆట, చెట్టు కింద గిరిగీసి ఆగిరిలో ఒక కర్రను నిలిపి ఒకరు కాపాడుతూ ఉండగా చెట్టు కొమ్మలమీద ఉండే పిల్లలు దాన్ని లాగివేయటానికి ప్రయత్నించే క్రీడ! చెట్టుమీద ఉన్నప్పుడు కర్రకాపాలదారు తాకితే దొంగకారు; కింద ఉండగా తాకితే ఆవ్యక్తి దొంగఅయి, ఇక ఆకర్రను తానే రక్షించాల్సి ఉంటుంది (కో,తె,ద,రా.)

**కోతిపిర్ర** చిన్న పిల్లలాడే ఆట (క.)

**కోదండంపట్టించు** వీధి బళ్ళలో చదువుకొనే పిల్లలను పూర్వం ఉపాధ్యాయులు శిక్షించే అనాగరకమైన, క్రూరమైన విధానం, ఏ దూలానికో పిల్లవాణ్ణి వేలాడదీసి, అంటే వేలాడేట్లుచేసి కింద ముళ్ళు ఉంచటం (కో,ద.)

**కోన** కొండ మూలలో నీరు ప్రవహించేతావు (ద,రా.)

**కోనంగి** గంగిరెద్దుల ఆటలో హాస్యగాడు (ద.)

**కోనయఅనేటోళ్ళులేరు** చూసి పలకరించే దిక్కులేదు, ఆదుకొనేవాళ్ళు లేరు (తె.)

**కోనారి** గొర్రెలు కాచే వ్యక్తి (క.)

**కోనేరు** దేవాలయ సమీపంలో దేవుడి తెప్ప తిరునాళ్ళ నిమిత్తమైన చుట్టు మెట్లుగల చెరువు (ద,తె,రా,కో.) తాగటానికికుపయోగించే మంచి నీటి చెరువు (కో,క.) రోలుకు చుట్టూ ఉబ్బెత్తుగా చెక్కినప్పుడు ఏర్పడే చదరం (రా.)

**కోపలు** చూ. నచ్చు పాతలు, నచ్చు(మూత్రం) మన్ను కలిపిన పేలికలు, మేకలు గొర్రెలు పొదుగులకు వాటి పిల్లలు పాలు పీల్చకుండా పీటిని చుడతారు (రా.)

**కోపు** అదను, బాగా ఎదగటం, మదం (ద) కోలాటంలో ఎదురు నడక (ద,తె,కో.) రోడ్లు పోయటానికి కొలత ప్రకారం మొరం తవ్విన గోతులు (తె.) చెరువు తవ్వేటప్పుడు కాలువలు తవ్వేటప్పుడు వచ్చే గుంటల లెక్కలు, ఒక కొన లావుగా, రెండోకొన సన్నగా ఉండేది (కో,ద, రా.) పట్టిన చేపలను ఒకదానికి గుది గుచ్చినది, కూపీ (కో.) ఒక పక్షాన్ని, ఒక వైపును సమర్థించటాన్ని కోపు కాయడమంటారు, ఒక పక్షపు బలము (రా.)

**కోపులువేయు** ఒకరి పెత్తనాన్ని, పేరును పరోక్షంగా విమర్శించు (ద.)

**కోబలి** పంట కోయటానికి ముందు పొలంలో ఇచ్చే బలి (క.)

**కోమటి వెంకమ్మ కొలువు** ప్రయోజనం లేని సేవ (క.)

**కోయుటాకు** చూ. పెరుగాకు (రా.)

**కోర** బక్కెట్టు (తె.) చెంబు, ముంత (రా.)

**కోరకొప్పు** ఓరగా ఉండే విధంగా పెట్టేకొప్పు (రా.)

**కోరచెప్పులు** ముందు కోరగా ఉండేట్లు చేసిన చెప్పులు (రా.)

**కోరజీవనములు** కోరలుండే క్రూర మృగాలు, కోరమెకాలు (తె.)

**కోరడ** పెండె, కోరడి (క.)

**కోరడి** కంచెలాగా చుట్టూనిర్మించే పెరటి భాగం లేదా ముంగిలి భాగం (కో,ద,తె.)

**కోరణాలు** పిల్లలకు వచ్చే వ్యాధులు (తె.)

**కోరవాటము** చూ. కోరాటము (ద.)

**కోరాం** గుమ్మడికాయని మెత్తగా కోరే సాధనం

**కోరాటం** ఒకజాతి గడ్డి, దీన్ని తింటారు, నిమ్మటాయి గడ్డజాతిది, ఇంటి కప్పుకు ఏటవాలు తనం (ద.)

**కోరిందదగ్గు** చూ. కోరిశదగ్గు, కోరింతదగ్గు (ద.)

**కోరింతదగ్గు** చూ. కోరిందదగ్గు (కో.)

**కోరిశదగ్గు** కక్కాయిదగ్గు, పిల్లలకు సంక్రమించే వ్యాధి, ఊపిరిపీల్చే శక్తికూడా లేనంతగా, విడుపులేనంతగా తీవ్రంగా ఎడతెగని దగ్గు, ఈ వ్యాధిని నిమ్మళింప చేయటానికి కోరిందనార తెచ్చి తాడుపేని మెడలో వేస్తారు, ఇంతే కాక కానుగ కాయలను దండగట్టి కూడా మెడలో వేస్తారు; కోరిందదగ్గు, కొక్కాయదగ్గు (ద.)

**కోరుగట్టు** కురుపు అంచుబెట్టు, మానుకొని వచ్చు (తె.)

**కోర్జాలు** కొత్తగుడ్డలమడుపులు (ద.)

**కోర్టాయి** ఒకఅడవి చెట్టు, దీనిదుంపను తింటారు, గెనుసుగడ్డలాగా ఉంటుంది (ద.)

**కోల** కాస్తపొడవైన అండాకారము, ఉదా: కోలమొహం, కోలనిమ్మ (కో,తె,ద.)

**కోలకొక్కరాయి** పిల్లలను శిక్షించే సందర్భంగా రెండు మణికట్లూ కట్టివేసి మోకాళ్ళ మీదుగా దూర్చి అడ్డంగా కర్రదోపి వెనక్కు నెట్టివేసేశిక్ష, వీధిబడులలో పూర్వకాలం ఇటువంటి శిక్షలు విధించేవారు (కో,ద.)

**కోలనిమ్మ** కోలగా (కొంచెంపొడుగ్గా) ఉండి ఊరగాయకు మాత్రమే పనికివచ్చే నిమ్మ, దూది నిమ్మ (ద.)

**కోలు** మోటబావుల మొత్తలకు ఆనుకొని ఒకమూల తవ్వే చిన్నబావి (ద.)

**కోలుకాడు** పనిచేసేకూలీల మీది పెద్ద, మేస్త్రీ (రా.)

**కోలువేయు** చిగిరించు, పూచు (తె.)

**కోళె** కోయగామిగిలినది, కొయ్యకాలు (ద.)

**కోళ్లగమ్మ** బండికి కట్టిఉన్నప్పుడు ఎద్దు కాలు దుసికిపడటం (తె.)

**కోళ్లతవ్విన పెంట** అస్తవ్యస్తంగా, కెక్కిరించినట్లు (తె.)

**కోళ్లనుగొట్టినకోడి** అతిసమర్థుడు (ద.)

**కోవ** కాలువపెద్దగట్టు (ద,తె.) వైపు (కో,ద.) పాలమిఠాయి, పాలకోవ (తె,కో.)

**కోవాలుపెట్టటం** పశువులకు కొడుపులవంటి వాటితో కాల్చటం (తె.)

**కోశిష్** ప్రయత్నించు (తె.)

**కోశిష్‌చేయటం** ప్రయత్నం చేయు (తె.)

**కోసు** కూచిగాఏర్పడినది (ద.) పొగరు (రా.) లోపంఎంచు (కో.) వంకగావచ్చిన భూభాగం (తె,కో,ద.) రెండుమైళ్ళ దూరం (కో,తె.)

**కోసుగడ్డ** క్యాబేజి (ద,క,రా.)

**కోసుగా** సన్నగా (క.)

**కోసుపువ్వు** క్యాబేజ్, కోసుగడ్డ (కో)

**కోస్పెగ** కోసుగ, కూచిగ (రా.)

**కౌజు** కముజు, కవుజు (కో,ద,రా,తె.)

**కౌటిగుల్ల** గొడ్లగిట్టలసందున లేచేతెల్లటి గుల్లకురుపు, కవుటి గుల్ల (ద.)

**కౌటు** లేతచిగురు, కవటు (కో,ద.)

**కౌడ** పడికేసాధనం (తె.)

**కౌడు** కపటం (ద,కో.)

**కౌదారి** కవుజుపిట్ట (ద.)

**కౌన్** ఎవరు (తె.)

**కౌరు** ఎర్రనిరంగు, కావిరి (రా.) కొత్తగుడ్డ చాయపోవటం, రంగు (ద.)



**కౌలు** పిల్లలఆటలో తీసుకొనే విరామం, అంబాలీస్ వంటిమాట (రా.) భూమి యజమాని తనపొలం ఇతరులు సేద్యంచేసే సందర్భంలో రాసిఇచ్చేపత్రం (తె.)

**క్యాదకి** మొగలిరేకు (తె.)

**క్యాదరి** చూ. కేదరివాటు (తె.)

**క్రియలేకపోవటం** ప్రయోజనశూన్యం (ద, తె,కో.) కృతఘ్నత (రా.)

**క్రోడగ్రంథం** సంపుటీకరణగ్రంథం (కో.)

**క్లిప్తం** నిర్ణయం (ద.)

**క్షేత్రం** ఉపవాసము (తె.)

## ఖ

**ఖజాయించటం** మోపటం, బనాయించటం (క.)

**ఖతల్** తుడిచిపెడతా, చంపేస్తా (తె.)

**ఖతల్‌కాముకద్దామా** ఖూనీకేసు (తె.)

**ఖత్ర** అపాయం (తె.)

**ఖదరు** గౌరవం (తె.)

**ఖనాయించు** నిలుచు (క,నుడి.)

**ఖందా** పెద్దకుటుంబాలలోను, జమీందారీ వ్యవస్థలోని నగళ్ళలోను చేసేఉమ్మడివంట, కందా (క.)

**ఖందాఇల్లు** వంటిల్లు (క.)

**ఖందారాజు** వంటచేసే క్షత్రియుడు (క.)

**ఖందిళ్లు** లాంతర్లు (తె.)

**ఖంబాలు** కంబాలు, స్తంభాలు (తె.)

**ఖబర్** కబురు, వార్త (తె.)

**ఖరా** ఖచ్చితంగా, ఖండితంగా, సరిగ్గా, తూచినట్లు (కో.)

**ఖరాఖండిగ** ఖచ్చితంగా (తె,కో.)

**ఖరా(గా)** ఖచ్చితంగా, తంచనుగా, రికామిగా (కో.)

**ఖరాబు** గాబరా (క.)

**ఖరీద్, ఫోరోక్త్** క్రయ విక్రయాలు (తె.)

**ఖర్చుకరామతులు** వ్యయ ప్రయాసలు (కో.)

**ఖల్లే** హత్యా (తె.)

**ఖవాతు, ఖవాయతు** కవాతు (క.)

**ఖసం** ఒట్టు, షరతు (తె.)

**ఖసఖస** కసకస, ధ్వన్యనుకరణం (క.)

**ఖాజీ** మహమ్మదీయ పురోహితుడు (తె.)

**ఖాతరు** ఖరారు, నిర్ధారణ (రా.)

**ఖానా** అరుగు, వేదిక (కో.) తూము (క.)

**ఖాయలా** అనారోగ్యం, సుస్తీ, అస్వస్థత రూ. కాయలా (క,కో.)

**ఖాయిదా** కట్టడి (క,ద.)

**ఖితాబి** బిరుదు (తె.)

**ఖిలాఫ్** వ్యతిరేకంగా (తె.)

**ఖీమత్** వెల, మూల్యం, కిమ్మతు (తె.)

**ఖుద్దున** ప్రత్యక్షంగా, స్వయంగా (కో,తె.)

**ఖుబూల్** నేరం ఒప్పుకోవటం (తె.)

**ఖుల్లక్‌గా** నిక్కచ్చిగా, నిష్కర్షగా, ఇదమిత్థంగా (ద.)

**ఖుల్లా** వివరాలు (రా.)

ఖుశీ ఉత్సాహం, సంతోషాతిశయం, ఖుషీ (తె.)

ఖుష్కీ మెట్టభూమి (తె.)

ఖుసామత్తు ప్రతిమాలు, బామాలు, రెచ్చగొట్టు, హెచ్చరించు (క.)

ఖూన్ నెత్తురు (తె.)

ఖూబ్ బాగా, నిండుగా (తె.)

# గ

గటక సంకటి ముద్ద, జావ, అంబలి (కో.)

గట్టిపిండి నలుగుపిండి (తె.)

గట్లా అలా, అట్లా (తె.)

గడబడ అల్లరి, గందరగోళం, తొందర (తె.)

గడబిడ తొందరపాటు, ఆత్రం (రా.) హడావుడి (తె.)

గడమంచె ప్రదర్శనలు జరిగేటప్పుడు చూడటానికి ఎత్తుగా కుర్చోవడానికి అమరికగా ఉండేట్టు ఏర్పాటు చేసినది (క.)

గడవగొయ్య గడుగ్గాయి, కొరకరాని కొయ్య (కో.)

గడియాల్ గడియారం (తె.)

గడీ భూస్వాములుండే పెద్ద భవంతి, పూర్వకాలపు దొరలుండే మేడ, చిన్నకోటలాంటి కట్టడం

గడుగా పంచి(చ) పాత్ర (తె.)

గడ్డ ఏరు, సెలఏరు, ఊటదెడ్డ (క.)

గడ్డినూనె కిరసనాయిల్ (తె.)

గణెం భామాకలాపంలో భామతాలూకు శిరోజాలం కరణం (కో.)

గతకలు గుంటలు (క.)

గత్తర కలరా (తె.)

గదమాయింపు తిరస్కారం, కోపభాషణం, ఛీదరింపు, ఛీత్కారం (క.)

గది అది (తె.)

గదువలు గవదలు (తె.)

గద్దించటం కోపగించటం (కో,తె,రా.)

గద్దు శకలం, కందు, పసికందు (క.)

గనిమె/గనిమ చేనిగట్టుదారి (కో,ద,తె.)

గన్నేరుమామిడి మామిడి రకాలలో ఒకరకం (క.)

గప్పాలు బడాయిలు, కోతలు, స్వాతిశయ ప్రకటనలు (తె,రా,కో.)

గప్పీ చూ. గప్పాలు (క.)

గప్పులు అప్పుడు (తె.)

గబ్బు వాసన (తె.) దుర్వాసన (కో.)

గమనం జ్ఞాపకం, గుర్తింపు (రా.)

గమ్మత్తు తమాషా, వినోదం, కుతూహలం (కో,తె.)

గమ్మున మాట్లాడకుండా, పట్టించుకోకుండా, నిశ్చబ్దంగా (క,కో.)

గంటెకట్టటం గుండ్రడగా గుమికూడటం (క.)

గందరగోళం అస్తవ్యస్తత, కోలాహలం (కో,రా,ద,తె,క.)

గందిక తొక్కిడి, సందడి, కోలాహలం, ఆడంబరం, కలకలం (క.)

గంధూళి బుక్కా (రా.)



గంగ నీరు, పచ్చిగంగ అనికూడా వ్యవహారం (రా,ద,తె,కో.)

గంగ² ససేమిరా, ఉదా॥ నేను గంగ మాట్లాడను (కో.)

గంగవెర్రి నీటిభయం, ముఖ్యంగా కుక్కలకు వచ్చేవ్యాధి (కో.)

గంగవెర్రులు నదికోతకోసి ఒడ్డునున్న గ్రామాలను భూములను మింగేయడం, ప్రవాహ బీభత్సం (కోరా,తె,క,ద.)

గంజిఫా దశావతారి అనే చీట్లపేక (కో,క.)

గంజు గండ్రని, బాగా ముదిరిన (క.)

గంజుముఖం ఉబ్బిరించిన, కొట్లవచ్చేట్లున్న గంభీరమైన ముఖం (క.)

గంపచిక్కు క్లిష్టమైన విషయం, క్లిష్టమైన సమస్య

గరమ్ కోపావేశము, ఉద్రేకం (తె.)

గరిగబుడ్డి చిన్న అరివేణికుండ, శోభ, శోభనసందర్భాలలో వాడేది (ద.)

గరిగెముంతలు వివాహవేళ ఉపయోగించే ముంతలు (తె.)

గరిబోండ్లు బీదవాళ్ళు (తె.)

గరిసె ధాన్యపుకొలత (కో,క.)

గరుజు గర్జు, బాధ్యత, పట్టింపు, అవసరము (తె.)

గర్జులేదు అవసరంలేదు, పనిలేదు (తె.)

గర్రా గర్వం, కావరం, అతిశయం, గీర, బడాయి, డంబం (క.)

గర్రాగా అతిశయంగా, నిటారుగా (క.)

గలగ్రహం గొంతువ్యాధి, మింగుడు పడని జబ్బు (కో.)

గలదరించటం ఒళ్ళుజలదరించటం, వెలపరం (కో.)

గలాయించు కరిగించు (తె.)

గలిబలి గజిబిజి, కలత, (రా.)

గల్లాపట్టి మెడపట్టి (తె.)

గవా సాక్ష్యం (తె.)

గవాయి సాక్ష్యం, రుజువు (తె.)

గవిని ప్రవేశద్వారం, ప్రవేశించే ఏర్పాటు (క.)

గవిసెన పైన చుట్టే నల్లటి గుడ్డ (రా, ద,కో.)

గయ్యి గుహ లేదా బలము (ద.)

గాజులు నూతి వొరలు (తె.)

గాడికి అక్కడికి, బండికి (తె.)

గాడెము ఏతాము (తె.)

గాడ్పు గాలి, వాయుప్రసారం (తె.)

గామాట ఆమాట (తె.)

గాయింత ఆమాత్రం (తె.)

గాయిపెట్టు గోలచేయు (తె.)

గావ్/గావు గ్రామం, ఊరు (తె.)

గావంచా కొల్లాయిగుడ్డ (క.)

గావర గాబరా (తె.)

గాష్తి గస్తీ, ఆజ్ఞాపన (తె.)

గాస్తు అజమాయిషీ (క)

గాజులమలారం గాజులగుడి, గాజులమ్మే వ్యక్తిదగ్గరుండే సరుకు (తె,కో.)

గించుకోవటం గింజుకోవటం (క.)

గిజగిజ గబగబ, (తె.) సంకటం, బాధ (కో.)

**గిజగిజ ఊరకటం** గబగబ పరిగెత్తటం (తె)

**గిట్టా** ఇట్టా (తె.)

**గిట్రా** ఇట్లారా, ఇరారా (తె.)

**గిట్లా** ఇలా, ఇట్లా (తె.)

**గిట్లాసుంటి** ఇటువంటి (తె.)

**గిడుగు** గొడుగు (క.)

**గిద్దగిద్ద ఊరకటం** గబగబ పరిగెత్తడం (క.)

**గిన్నికాను**

**గిరాకి** చెలామణీ హెచ్చుగా ఉండటం, ప్రియంగా ఉండటం, ఎక్కువ చెల్లుబాటు (తె, కో,ద,రా.)

**గిరిప్తార్** నిర్బంధం, అరెస్ట్ (తె.)

**గిరివి/గిర్వి** తాకట్టు (తె.)

**గిర్క** గిరక, పత్తిని విప్పతీసి ఏకులుచేయటానికుపకరించే సాధనం (తె.)

**గిర్ని** పిండిమర (తె.)

**గిర్రలు** బండి చక్రాలు (తె.)

**'గిర్లి' పువ్వులు** మన్యప్రాంతంలో ఉండే ఎర్రటి పూలు (క.)

**గిలాబా** చెక్కసున్నం (క.)

**గిలాబు** చూ. గిలాబా

**గిలాస** గ్లాసు, పానీయపాత్ర (తె.)

**గిలేటు** గిల్టు (తె.)

**గీదర** వంచన, మోసం, కపటం (క.)

**గుంజాటన** వెనకముందాడటం, ఇద మిద్ధమని నిర్ణయించలేని మానసికస్థితి (కో.)

**గుంజు** లాగు (కో,తె.)

**గుండ** పిండి, పొడి, చూర్ణం (కో,క.)

**గుండపిండి** పొడిపొడి, పిండిపిండి (క.)

**గుండుకొమ్ములు**

**గుండుజోళ్ళు** చెవి కుండలాలు (క.)

**గుంత** సాలెవారిమగ్గం ఉంచేచోటు (తె.)

**గుంభన** గుట్టు, రహస్యం (కో,క.)

**గుజారాయించింది** సంభవించింది, జరిగింది, (తె.) గడచిపోయింది

**గుజ్జనగూళ్ళు** బాలబలికలు ఆడుకొనే ఆట (కో,క)

**గుడంబ** బెల్లపుసారాయి (తె.)

**గుడాకు** బెల్లం, పొగాకుకలిపిచేసే లేహ్యం వంటిది (క.) తీనితో పళ్ళు తోముకుంటారు

**గుడాలు** గుగ్గిళ్ళు (తె.)

**గుడిసెబండి** గూడుబండి, గూడు అమర్చిన రెండెడ్లబండి (కో.)

**గుత్త** మొత్తం, పరిపూర్ణమైన అజమాయిషీ, (కో,తె.) పరిపూర్ణమైనబాధ్యత, మొత్తంమీద,

**గుదికర్ర** గుదిబండ (కో.)

**గునియ** కులుకు, గొడుగుకొను (కో,తె.) ఆడు, చలించు

**గునుపు** అసంతృప్తిలో సణుగు (కో.క,)

**గుప్పు** అధికసంఖ్యాకంగా ప్రయోగించు, విడుచు (కో.తె,)

**గుబులు** అధికమైన వాసన, వయం, ఉడుకు, తాపం, బాధ (తె.)

**గుమాయింపు** ఉక్క, ఎండవేడిమి, ఊష్మం (క.)

**గుమ్మి** నీటిమడుగు, చెలమ, గుంట, (క.) ధాన్యపాతరి (కో,క.)



**గుమ్ము** కుంట, చెలమ (క.)

**గురువమ్మ** ఉపాధ్యాయపత్ని (తె,రా.)

**గులక** గుల్ల (క.)

**గులాం** సేవకుడు (తె.)

**గులుగు** గునియు (తె.)

**గుప్తి** తనువు, జ్ఞాపకం, గుర్తు (కో.)

**గూడు** డూడుబండి (క.)

**గూడుపుఠాణి** కపటయత్నం, వంచన, (కో,క,ద.) మోసం, దగా, పన్నుగడ

**గెంటీలు** చెవులకు ధరించే ఆభరణాలు, దిద్దులు (తె.)

**గెడ** గొళ్ళెం, తలుపుబొండ, తలుపుకొయ్య, గడి (క.)

**గెడ్డ** సెలఏరు, ఊటగడ్డ, (క.) స్వతస్సిద్ధంగా ఏర్పడ్డ నీటికాలువ, ప్రవాహం

**గెత్తం** ఎరువు, చెత్త చెదారం (క.)

**గేరా** నెత్తిన సగంజుట్టుఉంచి, ముందువైపు నున్నగా కత్తిరించుకోవడం, గిరజాలు, ఒకరకమైన కేశాలంకరణ (క.)

**గై** వెదురుగడ (తె.)

**గైరిది** గొప్పది (తె.)

**గైరు** శ్రేష్ఠత, గొప్ప (తె.)

**గొంచబోయి** తీసుకొనిపోయి (తె.)

**గొండాలు** గొళ్ళెలు (తె.)

**గొండ్లి** వలయాకారంగా బాలికలుచేసే నృత్యం (రా.)

**గొంతెమ్మకోరికలు** అసాధ్యమైన కోరికలు (కో,తె,రా,ద,క.)

**గొట్టికాయలు** గోలీలు (క.)

**గొట్టు** చిక్కైన, గహనమైన, శ్రమ సాధ్యమైన (కో,తె.)

**గొడవ** అనవసరమైన బాధ, తగులము (కో,తె.) జంజాటం

**గొడారి** కసాయి (ద.)

**గొడ్డుగోదా** పశువులు (కో,రా,ద,తె.)

**గొటిబిళ్ల** బిళ్ళగోడు, కర్రాబిళ్ళఅనే క్రీడ

**గొప్పులు** పాదులు (కో,క.)

**గొబ్బికూర** క్యాబేజి, కోసుగడ్డ (ద,క.)

**గొలగటం** వలవటం, గేరటం (క.)

**గొల్లపొల్ల** గొల్లాళ్ళపిల్ల (తె.)

**గోతాలు** కోడలు, బడాయిలు, అతిశయాలు

**గోతి** గొర్రి, వెట్టిచాకిరి, పాలిగాపు (క.)

**గోదలు** ఎడ్లు (తె.)

**గోదాగొడ్డు** ఎద్దులు, బర్రెలు, పశువుల సామాన్యజాతివాచకం (తె.)

**గోరం** చిత్రం, విచిత్రం (తె.)

**గోరీ** సమాధి (కో,తె,రా,ద,క.)

**గోరోజనం** గర్వం, కావరం, పొగరు, అతిశయం బాగాపైత్యంచేసిన మనిషి తల తిరుగుడుగా ప్రవర్తిస్తాడని ఈ నుడికారం భావం (కో,క,ద, తె,రా.)

**గోర్జ** మన్నెపుదారి, ఊళ్ళో ప్రవేశించేదారి (క.)

**గోలు** గుండ్రని, వర్తులాకారమైన (తె.)

**గోల్మాలు** గంద్రగోళ్ళం, సందడి, అలజడి, (క,కో,తె.) కింగుమీదు, రభస, సమస్య (కో,క.)

**గోవిందం** పొడుగుబొట్టు (పంగనామం) (క.)

**గైర్** పరారీ (తె.)

**ఘటికుడు** సమర్థుడు, రాటుదేలినవ్యక్తి, ఒక విషయంలో ఆరితేరినవ్యక్తి (కో.)

**ఘాటీ** కొండదారీ, కొండలలో పైకి ఎక్కేదారి (క.)

**ఘిరాయింపు** కమ్ముకోవటం, చుట్టుముట్టి నిల వేయటం (క.)

**ఘుమాగా** గుమ్మగా, ఎక్కువగా ముక్కుకు తాకుతూ, ఘుమ్మని (క.)

# చ

**చంటికూన** పసికూన, అప్రౌఢుడు (కో.)

**చందుగపెట్టె** సందుగపెట్టె, కావడిపెట్టె, వస్తువులుంచుకొనే పాతకాలపు నాటి కొయ్యపెట్టె వంటిది (క.)

**చంద్రకాంతలు/చెంద్రకాంతలు** ఇటుక ఆకారంలో ఉండే తినుబండారం, పంచదార, పప్పు సాధారణంగా పెరసపప్పుతో పూర్ణం చేస్తారు. నూనెతో వేయిస్తారు, బంగారు బిస్కెట్ల సైజులో ఉంటాయి. చెడిన కాపరం చెడనే చెడింది చెంద్ర కాంతలు చెయ్యవే పెళ్ళామా అని సామెత

**చక్కర్** ఒళ్ళు తిరుగుడు, కళ్ళు తిరుగుడు (తె.)

**చక్కిలం ముక్కిలం** బాసెనపట్టు, మఠం వేసుకోవటం (తె.)

**చక్కీ** పర్యవసానం, పరిష్కారం, ముగింపు (కో.)

**చక్కీతిరగటం** వలయాకారంగా పరిభ్రమిం చటం (క.)

**చక్కెర్లు** చక్కర్లు, షికార్లు (క.)

**చక్రతైలం** తాజాతైలం, అప్పుడే ఆడి తీసిన తైలం (కో.)

**చక్రపొంగలి** చక్కెర పొంగలి, జీడిపప్పు కిస్మిస్, పాలు మొదలైనవి చేర్చి చేసేది, మిరియపు పొడి చేర్చి చేసేది వొట్టి పొంగలి, దీన్ని దధ్యోజనం అనికూడా అంటారు (క,కో.)

**చట్టున** వెంటనే, అవ్యవధానంగా, అవ్యవహి తంగా (కో.)

**చడామడా** నిలుపునిదానం, ఆలోచన లేకుండా నోటికి వచ్చినట్లు దూషించటం అనే అర్థంలో అను ప్రయుక్తం, చేతికి చిక్కినట్లు బాదడం, కొట్టడం అన్న స్ఫూర్తి కూడా ఉంది (కో,క.)

**చత్వారం** ముఖ్యంగా నలభై సంవత్సరాల వయసు పైబడిన తర్వాత కంటిచూపు సరిగా ఆనక పోవటం (కో,తె,క,రా,ద.)

**చద్ది** పులిహోర, చిత్రాన్నం (క.)

**చపాయించడం** ఆక్రమించటం, ఆహరిం చటం, సొంతంచేసుకోవటం, లాక్కోవటం (క.)

**చప్పర్‌పలంగ్** పట్టెమంచం

**చప్పరక** పందిరి (రా.)

**చప్పుళ్ళాండ్లు** మేళగాళ్ళు, భజంత్రీలు (తె.)

**చబుకు** కొరడా, బెత్తం, చెర్నాకోల (క.)

**చమ్డా** చర్మం, తోలు (తె.)

**చరుపు** దెబ్బ (కో,త.)

**చలికాగడం** చలికాచుకోవటం (క.)

**చల్లపాలకాయలు** ఒక పిండివంట, బియ్యపు పిండితో చేసి నూనెలో వేయిస్తారు (క.)

**చవట** అసమర్థుడు, వ్యర్థుడు, వాజ, వాజమ్మ, అప్రయోజకుడు

**చవ్వడం** చావడం (క.)

**చవ్వు** చావు (క.)

**చహల్ చహరాలు** ఆటపాటల బాల్యంనాటి ఆనందోత్సాహాలు (కో.)



**చహల్** చమక్కులు, చమత్కారాలు, షోకు, హాస్యధోరణి (కో.)

**చాకచకి** చాకచక్యం, నేర్పు, మెలపు (కో.)

**చాకిబాన** చిన్నపిల్లలాడే ఒక ఆట (క.)

**చాడీలు** కొండేలు, ఒకవ్యక్తికి వేరొకవ్యక్తి పట్ల లేనిపోనివి కల్పించి అతడిపై సదభిప్రాయం లేకుండా చేయటానికి చెప్పే మాటలు, చెప్పుడు మాటలు (రా,కో,క,ద.)

**చానిపి** కళాపి (తె.)

**చాపరాళ్ళు** నాపబండలు, నాపరాళ్ళు (క.)

**చాల్ జెయ్యి** చాలించు, కట్టిపెట్టు (తె.)

**చింతగేరు** చింతచెట్లదగ్గర నిర్జన ప్రదేశంలో వినిపించే ధ్వని, చింతచెట్టు (క.)

**చిందరవందర** అస్తవ్యస్తం, ఒకక్రమము, పద్ధతి లేకపోవటం, చెల్లాచెదరు (కో,రా,ద,క.)

**చికిలీ** పదును, వాదరకోసం నూరే ప్రక్రియ, సాన, సానపెట్టటం (కొ,క.)

**చిక్కదనం** పొదుపరితనం, గట్టితనం (క.)

**చిక్కనం** ముగ్గుపిండి (తె.)

**చికుక్క** చీరు, బరుకు, చెక్కు (క.)

**చికుక్కడుకాయలు పెట్టటం** కితకితలు పెట్టటం, చక్కిలిగింతలు పెట్టటం (తె.)

**చిగిరెపుఎముక** పక్కటెముకలలో మొత్తటి భాగం

**చిగురుకు** చివరకు, కడపటికి, మొత్తానికి (కో.)

**చిటికెలు** చిటికెలు వేయటం అనే ఒక పందెం (క.)

**చిట్టి** పినతండ్రి, బాబాయి, కక్కయ్య (క.)

**చిట్టిడగాడు** పులి (క.)

**చిట్టెడ** పులి (క.)

**చిడపొక్కులు** జిలకాయలు, చెమటకాయలు (క.)

**చితలప్పండు** శీతాఫలప్పండు (తె.)

**చితారు** సివారు, వాయిద్యం (క.)

**చిత్తలిపండు** చూ. చితలప్పండు (తె.)

**చిత్తుపక్కు** బొమ్మబొరుసువంటి ఆట (క.)

**చిత్రకన్ను** మిక్కిలి వేడుకైన దృశ్యం, కన్నుచెదరే దృశ్యం (కో.)

**చిత్తరంగం** చూ. చిత్రకన్ను (కో.)

**చిన్ని** పినతల్లి (తె.)

**చిమ్మిరి/చిమ్మిలి** బెల్లంనువ్వులు దంచివేసిన భక్ష్య పదార్థం (కో.)

**చిమ్మెడు** ఒకపట్టు (తె.) చిమ్మెడునశ్యం, ఒకపట్టుపొడుం, అంటేముక్కుపొడుం లేదా నశ్యం

**చిరతలు** చిటికెలవంటి వాయిద్యం, (తె.క.) దీన్నివాయిస్తూ రామాయణం చెపుతారు, చిరతల వాయిద్యం

**చిరుకన్ను** చూ. సిరికన్ను, శీతకన్ను (క.) చిన్నచూపు, ఉదాసీనత (క.)

**చిలకట్టు** గోచిపోసి కట్టుకునే పంచెకట్టు (క.)

**చిలిపి** కొంటె, చురుకుతనం (కో.)

**చిలిపితనం** కొంటెతనం (కో.)

**చిలుకు** గొళ్ళెం, గడి (ద,రా.)

**చిల్కరించు** చల్లు (తె.)

**చిల్లంగి** పశుమారణక్రియ, పశువులుపోయేట్లు వాటికి మందుపెట్టటం, మంత్రతంత్రాలతో క్షుద్ర ప్రయోగం, మందు మాకులు పెట్టే క్షుద్రప్రక్రియ (క,కో.)

**చివుక్కుమను** మనసువిరుగు, బాధపడిపోవు (కో,తె.)

**చీకటీగలు** దోమలు (కో,తె.)

**చీకు** గుడ్డి మనిషి (కో.)

**చీడీలు** మెట్టు, సోపానాలు (క,కో.)

**చీపరపాపర** అల్లిబిల్లి (క.)

**చుట్టం** ఉంచుకొన్న మనిషి (రా,ప్రకీర్ణ.)

**చున్ని** తవుడు, పొట్టు, పశుగ్రాసం

**చురకటం** కాలటం, చురుక్కుమనటం, బాగా వేడితగలటం (క.)

**చూయించు** చూపించు (తె.)

**చెక్క** వక్క (క.)

**చెక్కపొడి** వక్కపొడి (క.)

**చెక్కలు** పోకలు, వక్కలు (క.)

**చెట్టాపట్టా** చేతులు చేతులు కలుపుకొని బుజం బుజం కలుపుకొని, చేతులు చేతులు కట్టుకొని, పట్టుకొని (కో,క.)

**చెట్టాచేమా** పచ్చని ప్రకృతి చెట్టూ, గట్లూ (కో,క.)

**చెడావులు** చెప్పులు, పాపోసులు (క.)

**చెతకారి(సెటకారి)** నీతిమాలిన పని, తప్పుడుపని (క.)

**చెతచెత** చితచిత, బురదబురదగా (క.)

**చెన్నంగికొబ్బరి** పొట్టిజాతి కొబ్బరి చెట్లు (క.)

**చెమరకాకులు** చాలా నల్లని కాకులు (క.)

**చెమరకాయలు** చెమటకాయలు (క.)

**చెమ్మ** తడి, ఆర్ద్రిత (కో,రా,తె.)

**చెర్క** గాలిపటం (పతంగి) తాలూకుదారం చుట్టేకొయ్య సాధనం (తె.)

**చెర్రూబుర్రూ** చిర్రూ బుర్రూ, తొందరపాటు కోపంతోకూడి ప్రదర్శించే అసహనము, ముఖచేష్టా వైఖరి (క.)

**చెర్లాటం** వినోదక్రీడ (కో,క.)

**చేటపెయ్య** చచ్చిపోయిన దూడ చర్మంలో గడ్డిగాదం కూరి కృత్రిమంగా నిర్మించినదూడ, చేతపెయ్య (కో,క.)

**చేతబడి** క్షుద్రప్రయోగం, మంత్రతంత్రాలతో హాని కలిగించటం, బాణామతి వంటి ప్రయోగం (కో.)

**చేద** నీళ్ళుతోడే సాధనం, బొక్కెనవంటిది (కో,క.)

**చేపోవటం** బదులు తేవడం, చేబదులు తీసుకొని రావటం (తె.)

**చేరేళ్ళు** ద్వారబంధాలు (తె.)

**చైసు** నిదానించు (తె,ప్రకీర్ణ.)

**చొక్కాకు** పండుటాకు, వొగుడాకు (క, వ్యామభా.)

**చొప్పదంటుప్రశ్న** అసందర్భపు ప్రశ్న, తలతిక్క సందేహం (కో.)

**చోరీ** దొంగతనం (తె.)

**చోవి** పిండి, రుబ్బిన మెత్తనిపిండి (క.)

**చౌక** విరివిరిగా ఒక వస్తువు లభించటం, ప్రియం కాకపోవటం (కో,రా,ద.)

**ఛత్రి** గొడుగు (తె.)

**ఛీయు** కల్లు (తె.)



# జ

**జంకాన** జంపఖాన (తె.)

**జంగిలిగాడు** ఎడ్డెమనిషి, మోటుతనం గలవాడు (తె.)

**జంగిలిగుంపు** మోటు మనుషులు (కో.)

**జంగెడ** జంగిడీ, తినుబండారాలు పెట్టుకొని అమ్మే పళ్ళెక (క.)

**జంతి** ఇరుకు సందు, గొంది, కుసందు (క.)

**జంపు** పొడవు, నెరవు (ద.)

**జఖిమ్** గాయము (తె.)

**జగడం** పోట్లాట, కలహం, కొట్లాట,తగాదా (కో,తె.)

**జజ్జరిల్లడం** దద్దరిల్లటం (క.)

**జట్టీ**[1] గుత్తవ్యాపారులు, గుత్తవ్యాపారం (క.)

**జట్టీ**[2] పోటీ, పేచీ, స్పర్ధ, జగడం (క.)

**జట్టుదారు** జతగాడు, స్నేహితుడు, సంగడికాడు (క.)

**జనమంచి** లోకానికంతా ప్రియం, లోకహితం (క,కో.)

**జబర్దస్తీ** పెంకెతనం, పట్టుదలతో కూడిన మొండితనం, ఒకరిని వొప్పించటంలో కనపరచే భరించటానికి వీలైన దుడుకుతనం (కో,తె.)

**జబ్బ** భుజం, దండ, మోచేతిపైభాగం (క,కో.)

**జబ్బలు** బుజాలు, దండలు (క,కో.)

**జమలోపడటం** లెక్కలోకిరావటం (తె.)

**జమాయించు** గుదిగూర్చు, (తె.) షోకు, విలాసంతోకూడిన ప్రవర్తన, డాబుసరితనంచూపు (క.)

**జమికె** అద్దలాంటి సంగీత వాద్యసాధనం (క.) ఒకపక్కనతోలుతో మూసిమధ్యనుంచి తాడులాగుతూ వాయిస్తారు. ఇట్లాచెప్పేకథలను జముకుల కథలంటారు. సారంగధర, బొబ్బిలి యద్ధం ముఖ్యంగా ఈ కథకులు చెపుతారు. జమికెల కథ ముగ్గురు చెపుతారు. ఇద్దరిదగ్గర వాద్య సాధనాలుంటాయి. చూ. జముకులకథ.

**జమీన్** భూమి, నేల (తె.)

**జయంతి** ఒక మహాపురుషుని పుట్టినరోజు, ఆయన చనిపోయిన తర్వాత సంస్మరణంగా జరుపుకొనేరోజు (కో,తె,ద,రా,క.)

**జరపు** వేగం, వడి (కో.)

**జరుగురు** జరూరు, తొందర, అవసరం, ఆవశ్యకత (క.)

**జర్ర** కొంచెం, కొంచెంసేపు, కొద్దిపాటివ్యవధానం (తె.)

**జలగడగటం** బాగావిమర్శించడం, తీవ్రంగా నిష్ఠూరమాడటం, కడగటం (కో.)

**జల్ది** తొందరగా, వేగిరపాటు, త్వరగా (తె.)

**జల్దుకోవటం** హఠాత్సన్నద్ధత, నిలదొక్కుకోవటం, కమ్ముకోవటం, గుమికూడటం, కూడదీసుకోవటం (క.)

**జల్లిహూరు్వ** అతుకులబొంత (కో.)

**జవాబుచేయడం** జవాబుదారీ వహించటం (క.)

**జవాబుదారీ** పూచీ, సంజాయిషీ (కో,క.)

**జాగ**[1] స్థలము, చోటు (తె.)

**జాగ**[2] సంగీతపరిభాష, విరామం (క.)

**జాగారం** మేల్కొని ఉండటం, ముఖ్యంగా శివరాత్రినాడు రాత్రంతా మేల్కొని ఉండటం (కో,తె,క.)

**జాగిరాలు** కుక్కలు (తె.)

**జాతర** తిరునాళ్ళు, ఉత్సవం, గ్రామదేవతలకు గ్రామస్థులుచేసే ఉత్సవాలు, యాత్ర (కో,తె.)

**జాదుపూయటం** ఎర్రమట్టిపూసి ఇల్లు మొదలైన వాటిని అలంకరించటం (తె.)

**జాన్వర్లు** పశువులు (తె.)

**జాపోయడం** గసెపెట్టటం, శ్రమవల్ల కలిగిన ఆయాసం (క.)

**జామార్లు** కొత్తపంచెలు (కో.)

**జామార్లుకట్టుకోవడం** శుభకార్యంనిమిత్తం తాంబూలాలు పుచ్చుకోవటం (కో.)

**జాయాపోనివ్వటం** నలుసు, కణం, కూడా వృధాచేయక పోవడం (కో.)

**జాలరిసందడి** బెస్తవారికోలాహలం, చేపలమ్మే చోటిసందడి (క.)

**జాలాట** ఎదురుకోలు (తె.)

**జాలాదేత్** కాల్చివేయటం (తె.)

**జింగిపోయింది** ఆగిపోయింది (తె.)

**జిట్టెడు** వేలెడు (తె.)

**జిమ్మ** నాలుక (క,కో.)

**జిమ్మేదారి** బాధ్యత (తె.)

**జీతగాడు** పనివాడు, నౌకరు (తె,కో.)

**జీబిలిపుల్ల** గువిలితెడ్డు, గువిలిపుల్ల (తె, ప్రకీర్ణ.)

**జీబు** పొదలదట్టమైన ప్రదేశం, కీచుకీచుమనే నట్టడవి, దట్టం, సాంద్రం, గుంపు (క.)

**జీవు** జీపు (తె.)

**జీవాలు** పశువులు (ద,రా,తె.)

**జుంకాలు** జూకాలు (క.)

**జుబ్బా** చొక్కా, కమీజు (కో,క.)

**జునపరాయి** నాపరాయి (క.)

**జునపాలు** జులపాల జుట్టు, (క.) మెడమీద వెనక్కువేలాడే జుట్టు

**జుమాయింపు** డీలాపడిపోవటం, మూర్ఛస్థితి (క.)

**జుమాలు** మిక్కిలి అలసట (క.) డీలాపడిపోవటం, బిక్కుబిక్కుమనటం, ఉసూరుమనటం, సుక్కిపోవటం, సోలిపోవటం

**జుర్మానా** ధనదండన, జుల్మానా (కో.)

**జుల్మచేయు** అధికారం చెలాయించు (తె.) గంద్రగోళపరచు

**జూకడం/జోకడం** తూచటం (తె.)

**జూజములపున్నమ** జంధ్యాలపున్నమ, (క.)

**జూలు** గుబురు, దట్టం, గుత్తం (క.)

**జెర** ఇంచుకసేజు, కొంచెంసేపు (తె.)

**జెల్ల** చిన్నదెబ్బ, బుగ్గలమీద తలపైన తాటించేది (క.)

**జెల్లకాయ** మొట్టికాయ (క.)

**జెల్లకొట్టటం** మొట్టికాయలు వేయటం, హేళనచేయటం (క.)

**జేగుర్లు** ఎర్రమన్నుపట్టెలు (క.)

**జొన్నగటక** జొన్నసంకటిముద్ద (తె.)

**జొరబడు** బలవంతంగా ప్రవేశించు, హడావుడిగా లోపలకు దూరు (కో,తె.)



**జోరు** ఉత్సాహం, ఆధిక్యం, వేగం, సమృద్ధి (కో,తె.)

**జోడీ** జత, జంట, లంకె (కో,క.)

**జ్ఞాపిక** ఒక విషయం గుర్తుకుతెచ్చే పత్రం (కో.)

**ఝుగ్గా** తగాదా (తె.)

## ట

**టక్కు** మోసం, కపటం, బురిడీ, వేషం (కో,క.)

**టక్కులమారి** వేషగాడు, వంచకుడు, దగాచేసేవాడు (కో.)

**టక్కుటమారాలు** మోసాలు, గారడీలు, డంబాలు, డాంబికాలు (కో.)

**టముకులు** డప్పులు (కో,క.) డప్పుచప్పుళ్లు, చాటించి చెప్పటానికి ఉపయోగించే వాద్యం

**టికాన** సామర్థ్యం, శక్తి, సత్తువ (తె.) చోటు, జాగా, తిష్ఠ (కో.)

**టుప్పు** సిగరెట్లు, బీడీలువంటి పొగకాల్చేటప్పుడు పదార్థం (క.)

**టూకీ** సంక్షేపం, ముక్తసరు (కో,క.)

**టెక్కు** అతిశయం, గర్వం, నీలుగుడు (కో,క,ద,రా.)

**టొంప** గుదిబండ, నిర్బంధం, బంధనం, కాళ్ళకు అడ్డుపడే వ్యక్తి, వస్తువు (క.)

**టొంపాయిగాడు** మెడలో గుది బండలాగా అడ్డుతగిలేవాడు, పనికాకుండా ఆటంక పరిచే వ్యక్తి (క.)

**టొంబై** తొంభై (తె,ప్రకీర్ణ.)

**టోకుర్లు** గురకలు, గుర్రుపెట్టి పోయేనిద్ర, నిద్రలోనిగుర్రులు (క.)

## ఠ

**ఠంజాం** సంపన్నులు, సంస్థానాధిపతులు పూర్వకాలంలో పర్యటనకు ఉపయోగించిన సాధనం, పాలకీలాగా మనుషులు మోస్తారు. దీనికి పై కప్పు ఉండదు (కో.)

**ఠికాణా** నిర్ణయం, నిశ్చయం, ఎంపిక, జాడ, పత్తా, తావు, ఆధారం (క.)

**ఠికాన** జాడ, అలుపు, పైనం, సామర్థ్యం, నమ్మకం, భరోసా, ఉనికి, చిరునామా, పత్తా, అవకాశం, జమ, పోగుచేయటం (కో.)

**ఠీక్** సరిగా, సమంగా, సరిపడేట్లు (తె.)

**ఠుకుఠుకుఠు** సంజాటన (క.)

**ఠైరో** ఆగిపో, ఆగు (తె.)

## డ

**డంగు** ఆశ్చర్యం, విస్మయం (తె.)

**డకేటి** దోపిడి (తె.)

**డప్పాలు** గప్పాలు, డాబుసరిమాటలు, డాబులు (క.)

**డప్పీలు** డాబులు, కోతలు, డాబుసరి ప్రసంగాలు, దంబాలు, గప్పాలు (క.)

**డాకా** దొమ్మి, దోపిడి (తె.)

**డాకు** దొంగ (తె.)

**డాకురేకు** రంగుకాగితపురేకు, నకిలీవస్తువు (కో.)

**డాబుడాబడం** డాబులుకొట్టటం, వాచాలత, వాగుడు, వదరటం (కో.)

**డుబ్రుచ్చి** కేరింత, గేలితోకూడిన సంరంభం, సంతోషంతో అరుపులు (క.)

**డెకాయింపు** తృణీకారం, తీసివేయటం, నిర్లక్ష్యం, టొకాయింపు (క.)

**డెకారించటం** చిన్నబుచ్చటం, తృణీకారం, నిర్లక్ష్యం (క.)

**డెక్కులు** ఎక్కిళ్ళు (క.)

**డేకటం** ప్రస్తుతవిషయాన్నుంచి మరోదానిలోకి పోవటం, అప్రస్తుత విషయగ్రహణం, జారటం (కో.)

**డేకురు** పృష్ఠం నేలమీద ఆన్చిముందు ముందుకు జరుగు (క.)

**డేగాట** దండాడింపు (తె.)

**డొల్ల** జోలె (క.)

**డోకి** ఎండి డొల్లఅయిన తరవాత పాత్రగా వాడుకొనే ఆనపకాయమొదలైన వాటి సాధనం (క.)

**డాలు**[1] గ్రామంమీద వసూలయ్యే శిస్తుమొత్తం (కో.)

**డాలు**[2] సంకోచం, పరువు, అభిమానం, (రా.) మర్యాద, పరపతి, అంతస్తు (క.)

# త

**తండ** మూక, లంబాడితండా (కో,తె.)

**తండులంగలది** పాడిపంటలకు కొదువలేనిది (కో.)

**తంతెలు** మేడమెట్లు (తె,ప్రకీర్ణ.)

**తంపట** నిప్పుతో పచ్చికాయలు, కంకులు మొదలైనవి కాల్చడం (కో,క.)

**తంబం** స్తంభం, కంబం (తె.)

**తంబళి** శివార్చకులైన ఒకకులం, జంగం (కో,తె.)

**తకరారు** నిర్బంధం, నిలదీయటం (క.) కలహం, పోట్లాట (తె.)

**తక్లీఫ్** కష్టం, శ్రమ (తె.)

**తక్‌దీర్** అదృష్టము (తె.)

**తగవులు** బహుమానం, లాంఛనాలు, కానుకలు (కో.)

**తగిలేయటం** వెళ్ళగొట్టటం (క.)

**తగువు**[1] పెళ్ళికూతురితో పంపవలసిన కట్న కానుకలు (కో.)

**తగువు**[2] తీర్పు, పరిష్కారం (క.)

**తటపటాయింపు** గుంజాటన, ఇతమిద్ధంగా నిర్ణయించుకోలేని స్థితి (కో.)

**తటాల్న/తటాలున** వెంటనే, అవ్యవధానంగా (తె,కో.)

**తటుక్కున** చటుక్కున, వెంటనే, అవ్యవధానంగా (క.)

**తట్ట** కంచం, భోజనంచేసే పళ్ళెం (ద.)

**తట్టాబాజీ** వేళాకోళం, పరిహాసం, తాటాకులు కట్టటం, ఎత్తిపొడుపు, ఎగతాళి, ఎద్దేవా, అపహాస్యం (కో,క,తె.)

**తట్టె** తట్ట (తె.)



**తడలు** అలలు, కెరటాలు (తె,కరీం.)

**తడాఖా** నాశక్తి, నాప్రతాపం, నాదెబ్బ అనే అర్థాలలో ప్రయుక్తం (కో,రా.)

**తనఖా** జీతం (తె,ప్రకీర్ణ.)

**తను** ఆవ్యక్తి, అతను (క.)

**తనుపు** జ్ఞాపకం, స్మరణ, గుర్తు (క.)

**తనుపుకిరావటం** జ్ఞాపకంతెప్పించుకోవటం, జ్ఞాపకానికిరావటం (క.)

**తపించు** ఆరాటపడు, తహతహలాడు (తె.)

**తపిసీలు** వివరం, వివరణ, సంగతిసందర్భాలు (కో.)

**తప్ఫియచేయటం** పరిష్కరించటం, ముగించటం (తె.)

**తబిసీలు** చూ. తపిసీలు, వివరం (కో.)

**తబుకు** తప్పేళా, పాత్ర, కొయ్యపాత్ర (క,కో.)

**తభావతు** వ్యత్యాసం, తేడా, తేడాపాడా (కో,క.)

**తమాము** పూర్తిగా, మొత్తంగా, అంతా (కో,తె.)

**తమామ్** చూ. తమాము, బొత్తిగా, అన్నీ, అంతా (తె.)

**తమురు** ఒకజలాధారంనుంచి సంక్రమించే ఊట, చిత్తడి ఉదా: తమురు భూములు (క.)

**తమ్మి** చెంపపట్టీ (క.)

**తరకారి** కాయగూరలు, కూరగాయలు, వాటిని విక్రయించే వ్యక్తి (తె,రా.)

**తరవాణి** చద్ది అన్నంలో మజ్జిగకలిపి పొద్దుటే భుజించేది (క,కో.)

**తరవాయి** మిగులు, శేషం, మిగిలినది (కో.)

**తర్బీద్** శిక్షణ (కో,తె.)

**తరీక** పద్ధతి, సబబు (తె.)

**తరువుచీటి** ముందు తనపని మొదలుపెట్టి పూర్తిచేయాలి అని పంపే చీటి (ద.)

**తర్లిపోవు** వివాహాదులలో మగపెళ్ళివారు ఆడపెళ్ళివారింటికి వెళ్ళే సందర్భం (కో,తె.)

**తలంటారం** తలంటు, అభ్యంగం (తె, ప్రకీర్ణ.)

**తలపోత** ఆలోచన (కో,తె.)

**తలుగు** పలుపు, పశువుమెడకి కట్టినతాడు (రా.)

**తలువాలు** తలంబ్రాలు (తె.)

**తశిహ** పళ్ళెం, ప్రసాదపుపళ్ళెం (కో,ద.)

**తవ్వాయి** తగువు, కలహం, పేచీ (కో,క.)

**తష్తరీ** పళ్ళెం (తె.)

**తస్ఫియ** తీర్మానం (తె.)

**తస్వీర్** ఫోటో, ఛాయాచిత్రం (కో,తె.)

**తస్వీర్‌పెట్టె** ఫోటోతీసే పరికరం, కెమేరా (తె.)

**తహఖీబాత్** న్యాయవిచారణ (తె.)

**తాంద్రపిడసలు** తాండ్రచెట్టుపిక్కలు (క.)

**తాంబాళం** పళ్ళెం (కో,తె.)

**తాకట్లమాటలు** కలహం రెచ్చగొట్టే మాటలు (తె.)

**తాకట్లమారి** కలహశీలి, దెబ్బలాటలు కల్పించేవ్యక్తి (తె,క.)

**తాకించు** తగ్గించు, శ్రమకలిగించు (తె.)

**తాఖత్** అంతస్తు, బలం, పరువు, స్థాయి (తె.)

**తాజీరాత్** నిజాంరాజ్యంలో శిక్షాస్మృతి

**తాజుబ్** ఆశ్చర్యం, ఆశ్చర్యం కలగటం (తె.)

**తాటాకుదళ్ళు** బలహీనమైన రక్షణలు, కట్టడులు (కో.)

**తాడుకూతంకరకూ** పిడుక్కు బియ్యానికి (క.)

**తానం** స్థానం, స్థావరం (క.) ఉదా॥ తానంవేశాం, తానం ఎత్తివేశాం (బుట్టలల్లేవాళ్ళు, ఎరుకలవాళ్లు, పందులు కాసుకొని జీవించేవాళ్లు తానంవేయడం, తానం ఎత్తివేయడం, అంటూ ఉంటారు. ముఖ్యంగా సంచారజాతుల వాళ్ళు)

**తానం²** స్నానం (తె.)

**తానికి** దగ్గరకు, సమీపానికి (తె.)

**తాపీ(గా)** విశ్రాంతిగా, నిమ్మళంగా (కో,క.) తొందరలేకుండా (కో.)

**తాబొందు** తాడుదూర్చి ధరించే బొందు (క.)

**తామర** చర్మవ్యాధి (కో,ద,తె.)

**తామరమందు** చూ॥చూ. తామర (కో,ద, క,తె.) ఒంటినిండాలేచే చిడుము, దురదలకు వాడేపూత

**తామరఖండీ** స్వచ్ఛమైన జలసమృద్ధి (క.)

**తామీల్** అమలు (తె.)

**తాయపెంకు** ఇనుపసిబ్బి (తె,ప్రకీర్ణ.)

**తాలం** తాళం, బీగము (తె.)

**తాలింఖానా** గోదా, కసరత్తు, శరీర వ్యాయమశాల (కో,తె.)

**తాలెము** చూ. తాలింఖానా, (కో.) కసరత్తు నేర్పించే చోటు, వ్యాయామ శిక్షణ స్థానము

**తాళం** తాళపుచెవి (క.)

**తావ** పెనం (క.)

**తావరం** స్థావరం, చోటు, ఉనికి (కో,క.)

**తాసు** గంటన్నర వ్యవధి (తె.)

**తింపు** తిప్పు (తె,ప్రకీర్ణ.)

**తిట్టుమోతు** దూషణశీలి, దురుసుమాటలాడేవాడు (కో.)

**తిత్తి** సంచి ఉదా॥ తిత్తెత్తుకో (ద.)

**తిను** ఇతను, ఈ వ్యక్తి, ఇవతలి వ్యక్తి (క.)

**తినేస్తారు** మింగేస్తారు, దోచేస్తారు, చాలా ఎక్కువగా శ్రమకలిగిస్తారు, బాధిస్తారు అనే అర్థంలో (క.)

**తిన్నగా** నేరుగా, సరాసరి (కో,క.)

**తిన్నె** అరుగు, గట్టు (కో,ద,రా.)

**తిపాసి** దేశదిమ్మరి (కో.)

**తిప్పలు** కష్టాలు, ఆపదలు (కో,తె.) ఇరుకు ఇబ్బందులు

**తిరకాసు** వ్యత్యస్తం, తలకిందులు, వ్యత్యయం, వ్యతిరేకం, పొరపాటు (క,కో.)

**తివ్వ** తీగ (క.)

**తివ్వచుట్లు** తీగచుట్లు (క.)

**తీంతారు** చెల్లాచెదరు, కకావికలు (క,కో.) ఆరుమూడు

**తీగెమేకు** సీల, మొల (కో.) మరమేకుకానిది

**తీటకోయిల** దూలగొండి, దూలగుండ (తె,ప్రకీర్ణ.)

**తీరుతీర్లు(గా)** మిక్కిలి వైవిధ్యంతో, రకరకాలుగా (తె.)



**తుంటకుతుంట** చాలా లావుగా, దొబ్బుగా (తె,ప్రకీర్ణ.)

**తుండు** తువ్వాలు, అంగవస్త్రం (క.)

**తుండుగుడ్డ** చూ, తుండు (కో.)

**తుంబ** మొద్దు, సొర మొ॥లైన కాయలు ఎండిన తర్వాత వాటి ఆకృతి (క.)

**తుకతుక** పకపక వివ. నెల్లూరు ప్రాంతంలో నవ్వుకు సంబంధించిన అనుకరణ వాచకమని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు కథలు - గాథలలో రాశారు (క,గా.3,296.)

**తుకిడీ** తండా, గుంపు, జట్టు, చిన్న సమూహం (క.)

**తుట్టపోయినాడు** దండుగ పడ్డాడు, నష్టపోయినాడు, నష్టపడ్డాడు (తె,ప్రకీర్ణ.)

**తుడవటం** ఊడవటం, శుభ్రంచేయటం (క.)

**తునకాలదుండ్లు** లాటీకర్రలు (క.)

**తుప్పతల** మాసిపోయిన దుబ్బతల (క.)

**తురపుగుర్రం** పందెం వొడ్డిన గుర్రం (క.)

**తురుఫైపొయినాడు** కనపడకుండా పొయినాడు, మాయమై పొయినాడు (క.)

**తుర్తి** తృప్తి (తె.)

**తుర్రబడాయించింది** పొగరెక్కింది, ఒళ్ళు బలిసింది (తె.)

**తువ్వాయి** ఆవుదూడ (కో,రా,క.)

**తుశ్శి** గజ్జెల పట్టెడ (తె,ప్రకీర్ణ.)

**తూటకట్ట** వ్యర్థ విషయం (కో.)

**తృటి¹** పొరపాటు, లోపం, ప్రమాదం (క.)

**తృటి²** క్షణం, వెనువెంటనే (కో.)

**తెగ** ఎక్కువ, సమృద్ధి, పూర్తి పుష్కలత, అతిశయిత ఉదా॥ తెగనీలుగు, తెగబెక్కు (కో.)

**తెగలు** పంటకోతలు (తె.)

**తెనుగుమీరటం** మిక్కిలి ఆధునికత, నాగరకత అలవరచు కోవటం, తెలివిమీరటం (కో.)

**తెరువు** దారి, ధర్మమార్గం, ఉపాయం, సాధనం, న్యాయం, సంగతి, జోలి (తె.)

**తెరపి** ఎడము, వ్యవధానం (కో.)

**తెలువుకోవడం** గుర్తించటం, తెప్పరిల్లటం, తెలుసుకోవటం, గ్రహించటం, కనిపెట్టటం (క.)

**తేజుగావుంది** ఎక్కువగా వుంది (తె,ప్రకీర్ణ.)

**తేప** చొంగ, నోట్లో ఊరేచిక్కని పదార్థం (క.)

**తేపనీరు** జొల్లు, చొంగ (క.)

**తేరగా** అప్రయత్నంగా, దానంతట అది (క,కో,రా.)

**తైపారు** అంచనా (క,కో.)

**తొంటచెయ్యి** పుర్రచెయ్యి, అభావం, నిరర్థకం తెలియజేసే చెయ్యి, కుడిచేతితో కాకుండా ఎడమ చేతితోనే లేదని చెప్పటం (కో,క.)

**తొండం** పెట్టెకు వేసే గొళ్ళెం, తాళం (క.)

**తొందర** ఇబ్బంది, నిర్బంధం, కట్టడి, ఇరకాటం (కో.)

**తొక్కు** పచ్చడి, ఊరగాయ (తె.)

**తొగటోండ్లు** నేతవాళ్ళలో ఒక తెగవాళ్ళు, ఒక శాఖ సాలెవాళ్ళు (తె.)

**తొగరుమల్లె** మధ్యాహ్నం మల్లె, దేవుడి పూజకై వినియోగించే ఎర్రని పువ్వు (కో.)

**తొడచిమ్ము** తొడపాశం (తె,ప్రకీర్ణ.)

**తొడుగు** అలంకారం, ఆభరణాలు (తె,కో.)

**తొ్ర** లోటు, లోపం, చాలమి ఉదా॥ బడ్జెట్ అంచనాలలో పెద్దతొ్ర (కో,తె,క,ద,రా.)

**తొలి** కాడి మొదలైన వాటిలో తొలిచిన రంధ్రం (ద.) (తె.)

**తొవ్వ** దారి (తె.)

**తొవ్వపొంటె** దారివెంబడే, దారివెంటనే (తె.)

**తోచ్చి** పినతల్లి, పిన్నమ్మ, చిన్నమ్మ, పిన్ని, శ్రీకాకుళం ప్రాంత బంధుత్వ మాండలిక ప్రయోగం, ద్రావిడ పరిభాష (క.)

**తోజు** సిద్ధం, తోడ్పాటు (కో.)

**తోడెం** కొద్దిగా, కొంచెం (తె.)

**తోడెం తోడెం** కొద్ది కొద్దిగా, కొంచెం కొంచెంగా (తె.)

**తోలటం** పంపించటం, పంపించి రావటం

**తోలుకురావడం** తీసుకొని రావడం (తె, ప్రకీర్ణ.)

**తోలుకొనిరావటం** తీసుకొని రావటం (తె.)

**తోలిచ్చుటం** పంపించటం (తె.)

**తోలించు** పంపించు (తె.)

**తోవాసం** సహవాసం, తోడు (కో.)

**తోప** సంకటి ముద్ద (క.)

**తౌర్యత్రికం** నాట్యం, సంగీతం, వాయిద్యం (కో.)

**త్రాహి** త్రాణ, ఓపిక, సత్తువ (క.) అభయార్ధనం, ప్రార్థన (కో,తె,క,రా.)

# ద

**దఖలు** స్వాయత్తం, సొంతం (కో,క.)

**దఖలుపడటం** చేజిక్కటం, వశంకావటం, స్వాధీనంకావటం, లభించటం (క.)

**దగ** దాహం, దప్పిక, దాహం, ఆవురావురు (క,కో.)

**దగపట్టడం** నోరెండిపోవటం, దప్పికతో నాలుక ఎండిపోవటం (క.)

**దగా** వంచన (కో,రా,క,ద.)

**దగాకోరు** మోసగాడు, కపటి (కో,రా,ద, రా.)

**దగుల్బాజీ** వంచకుడు, మోసగాడు, కుటిలుడు, నిష్ప్రయోజకుడు (కో,ద,క,రా.)

**దగ్గిరసా** సమీపంలో, దగ్గరగా, దాపుననే (క,కో.)

**దంగు** చూ. డంగు, సున్నం, గచ్చు, బియ్యం మొదలైన వాటిని పైపొట్టు పోయేట్టు నలగగొట్టు (తె.)

**దట్టించు** పూర్తిగానింపు (కో,క,ద.)

**దడాదడివర్తకం** ధరలు నిలకడ లేకుండా వస్తుపుష్కలతను పట్టి హెచ్చుతగ్గుల మార్పులు ముందుగా దృష్టిలో పెట్టుకొని చేసే వర్తకం (కో.)

**దడియం** ఒకరకమైన మూకుడు (తె.)

**దడియూత** నిలువీత (కో.)

**దంటుకూర** తోటకూర (రా.)

**దండటం** యాచించి పుష్కలంగా తెచ్చుకోవటం, సేకరించటం, ధనధాన్య సంగ్రహణం (క.)

**దండితేవటం** చూ. దండటం (క.)

**దండుగ** పరిహారం, నష్టానికిచ్చే భర్తీ (కో,రా,ద,తె.)

**దండేలు** వ్యాయామ పరిశ్రమ చూ. బస్కీలు

**దండెపట్లు** వ్యాయామ సాధనలు (క.)

**దద్ది** పినతండ్రి (తె.)



**దద్దమ్మ** దేనికీ కొరమాలినవాడు, అసమర్థుడు

**దద్ది** పినతండ్రి (క.)

**దంతహర్షం** పండ్లు పులిసి పోవటం (కో.)

**దందలు** కడ్డీలు, వాసాలు (తె.)

**దండెడ** పెద్దమాను (తె,ప్రకీర్ణ.)

**దన్ను** సహాయం, అండ, అండదండలు, ప్రాపు (కో,క,రా,ద.)

**దప్తరు** ఆఫీసు, కార్యాలయం, ప్రభుత్వోద్యోగ కార్యాలయం (తె.)

**దప్పాలు** దెబ్బలు (తె,ప్రకీర్ణ.)

**దఫా** పర్యాయం, ఆవృత్తి, ఇంకోసారి, ఇంకోమారు అనే అర్థంలో ప్రయుక్తం, (కో,క,ద, రా,తె.) శిక్షాస్మృతి సంఖ్య, పరిచ్ఛేదం (తె.)

**దఫ్తర్** చూ. దప్తర్ (తె.)

**దబదబ** గబగబ, తొందర తొందరగా, వెంట వెంటనే (కో,తె,ద.)

**దబాయించు** అదుము, నెట్టివేయు, తోయు (తె.)

**దబాలు(న)** వెంటనే, అవ్యవధానంగా, గబుక్కున (క,కో.)

**దబ్బదబ్బ** తొందర తొందరగా, వెంట వెంటనే, అవ్యవధాన పూర్వకంగా (తె.)

**దబ్బున** చూ. దబదబ (కో.)

**దమాకు** బుద్ధి, జ్ఞానం, తల (తె.)

**దమాగు** చూ. దమాకు (తె.)

**దమ్ము** వగర్పు, ఆయాసం, రొప్పు (తె.) ఊపిరి(పీల్చుకోవటం) (కో.)

**దరకాస్తు** అభ్యర్థన పత్రం, వినతి పత్రం (తె.)

**దరవాజ/దరవాజు** తలుపు (కో,తె.)

**దరస్తు** దస్తు, శిస్తువసూలు (కో.)

**దరహం(మీద)** మొత్తంమీద, మెట్టుకు (కో.)

**దరిబేసి/దర్బేసి** వ్యర్థుడు, పనికిమాలినవాడు, తిరుగుబోతు (కో,ద.)

**దరిమిలా** అటుతర్వాత, ఆపిమ్మట, ఆపైన, తర్వాత (కో,ద,క,తె,రా.)

**దర్యాప్తు** విచారణ (కో,క,తె,రా.)

**దవాఖాన** ఆస్పత్రి, మందులిచ్చే చోటు (తె,ప్రకీర్ణ.)

**దవ్వు** దూరం (తె.)

**దస్కతు** చేవ్రాలు (కో,తె,ద,రా,క.)

**దస్తకత్తు** సంతకం, చేవ్రాలు చూ. దసకతు (తె.)

**దస్తరం** వ్యవహారానికి సంబంధించిన కాగితాల కట్ట, ఇచ్చిపుచ్చుకొనే వడ్డీ వ్యాపారం ఉదా॥ దస్తరం, వస్తరం ఉందా అని తెలంగాణం నుడికారం. తినాగుడువా ఉంది అని కోస్తా నుడివలె. (తె.)

**దస్తార్** పటకా (తె.)

**దస్తి** జేబుగుడ్డ, చేతిగుడ్డ, రుమాలు, కర్చీఫ్ (తె.)

**దస్తీగుడ్డ** చేతి రుమాలు (తె,ప్రకీర్ణ)

**దాంట్ల** అందులో (తె,ప్రకీర్ణ.)

**దాక్షిణ్యం** దయ, ఆదరం, అభిమానం (కో,ద,రా.)

**దాఖలా** రుజువు, (కో.)

**దాఖలాచేయు** సమర్పించుకొను (తె.)

**దాగలి** చేప (క.)

**దానాపాణీ** కూడూనీళ్ళు (క.)

**దాపట** ఎడమవైపు (కో,క.)

**దాపరించు** దగ్గరగు (తె.) అనిష్టార్థంలో పాలబడు (కో.)

**దాపుమూపులు** కల్లకపటాలు, గోప్యంగా ప్రవర్తించటం (క.)

**దారయిన** సూటి అయిన, వాడి అయిన (క.)

**దారువు** ఒళ్ళు, శరీరం, విగ్రహం (క.)

**దావత్** విందు (తె.)

**దాశిన్చెక్క** పళ్ళపొడి (తె,ప్రకీర్ణ.)

**దాష్టికం** అధికారాతిశయం, అధికారం చెలాయింపు (కో,తె.)

**దిగుడు** పల్లం (ద,కో.)

**దిడ్డి** దొడ్డి, పెరడు (తె.)

**దినపాతం** రోజువెళ్ళబుచ్చటం (కో.)

**దినామూ** ప్రతిరోజు (తె.)

**దిప్పకాయ** అల్లరి చిల్లరి యువకుడు, పిల్లవాడు (కో.)

**దిబ్బడు** కుర్రకుంక, పిల్లడు (క.)

**దిబ్బపని** ఒళ్ళు విరుచుకోవాల్సిన పని, ముంచుకొచ్చిన పని (రా.)

**దిబ్బభడవ** పిల్లకుంక (క.)

**దిమాకు** దిటవు, ధైర్యం, నిబ్బరం (కో.)

**దియ్యి** దీపం, జ్యోతి (తె.)

**దిరుసు** దినుసు, పదార్థం (క.)

**దిలాస** హెచ్చరిక, ధైర్యం, హుషారు, ఉల్లాసం (తె,కో.)

**దివాలా** నష్టం (కో,క,తె.)

**దివిలి పండుగ** దీపావళి పండుగ (రా.)

**దివెలె** దీపావళి (తె.)

**దిశరానికారు** వనికి మాలిన వాళ్ళు (తె.)

**దిష్టి** కనువేదురు, చూపోపమివల్ల కలిగే కీడు (కో,క,తె,ద,రా.)

**దిస్స** శూన్యం, బోసి (క,కో.)

**దిస్సపోవడం** బోసిపోవడం, బావురుమనడం, మొక్కలేకుండా ఖాళీగా ఉండటం, ఈడ్పుల తర్వాత పొలాలస్థితి (క.)

**దీందీం** బిక్కుబిక్కు, విజనస్థలంలో కలిగే విభ్రాంతికి ధ్వన్యనుకరణం (క.)

**దీవి** బిడ్డమరులు, బిడ్డ తీపి (క.) మనసు పీకుతూ ఉండడం (తె,కో.)

**దుంకు** దుముకు (కో,తె.)

**దుంపాదుట్రా** భూమిలోపలి గడ్డలు, వేళ్ళు, కందమూలాలు (క,కో.)

**దుకనం** దుకాణం (తె.)

**దుకునం** చూ. దుకనం (తె,ప్రకీర్ణ.)

**దుక్క** లావు, మందం, స్థౌల్యం, ముడి (కో,క.)

**దుక్కడలు** దుక్కిఅయ్యేట్లు వర్షించు (క.)

**దుక్కతన్ను** బలియు (క.)

**దుచ్చినాకు** పచ్చకామెర్లుతగ్గించే ఒక ఔషధి, మొక్క (క.)

**దుట్ట** రాయిరప్పా, ధూళి (క.)

**దుద్దులు** చెవికమ్మలు (కో,తె.)

**దునియా** జగత్తు, ప్రపంచం (తె.)

**దుమ్మలముచ్చు** దుమ్మలగొండి, పొడుగాటి కొమ్ములుండే వన్యమృగం (క.)

**దుమ్ము** ఎముక (క.)

**దురస్తు** చూ. దరస్తు (కో.)

**దురుసు** పొగరు, అహంకారపూరితమైన స్వభావం (కో,క,ద,తె.)



**దుసెళ్ళు** నిర్మూలమగు, దుంపనాశనమగు

**దూపు** దాహం, దగ (తె.)

**దూబటం** దగకొనటం, చాలా దప్పిక కావటం (తె.)

**దూయబట్టు** నిందించు, తెగడు (కో,క.)

**దూల్లు** దూడలు (తె.)

**దెగ్చా** డేగిస, గుండిగ (తె.)

**దేబె** పనికిమాలినవాడు, నిష్ప్రయోజకుడు, అనధికారి

**దెష్టది** దరిద్రురాలు (తె.)

**దేకీచ** దేకిసా (తె,ప్రకీర్ణ.)

**దేఖీలు** రుజువులు (కో.)

**దేఖ్/దేఖో** చూడు (తె.)

**దేవరవాండ్రు** సాముగరడీల వాళ్ళు (క.)

**దేవిడి** భవనముఖద్వారం (కో,క,తె.) సంస్థానాధిపతులు పూర్వం కట్టించిన రాజభవనం (తె.)

**దేవిడీమన్నా** కఠినశిక్ష, తీవ్ర ఆంక్ష (కో,తె.)

**దేవురుగొట్టు** అడుక్కుతినే దీనమనస్తత్వం గల వ్యక్తి, యాచించేవ్యక్తి (కో.)

**దేవులాడు** వెదకు (కో,క.)

**దేహాతిపని** (తె,ప్రకీర్ణ.) దేశవాళీపని, స్వదేశపుపని (తె.)

**దొంగఇసుక** ఊబినేల (క.)

**దొంతికూర్చోటం** (ప్రకీర్ణ.) గొంతుకూర్చోటం (తె.)

**దొంబి** విచ్చలవిడి వ్యయం, వెనకాముందు చూడకుండా వెచ్చపెట్టటం (రా.)

**దొడ్డు** లావు, స్థూలం (కో,తె,ప్రకీర్ణ.)

**దొప్ప** నౌకరు, బానిస, తొత్తు (క.)

**దొబ్బ/దొబ్బు** (తె,ప్రకీర్ణ.) లావు, స్థూలం

**దొమ్మి** మూకఉమ్మడి అల్లరి (కో,క,తె, రా,ద.) గుంపు దౌర్జన్యం

**దోక** ధోకా, మోసం, వంచన (తె.)

**దోడెం** కొంచెం (తె.)

**దోనె** గుండటి చిన్నపడవ, పుట్టి, (రా.) తెప్ప

**దోస్తు** స్నేహితుడు, మిత్రుడు (రా.)

## ధ

**ధడవత్** ధరావత్, ఒక ఒప్పందం కుదుర్చుకోవటానికిగాని, ఎన్నికలు మొదలైనవాటిలో అభ్యర్థిగా ఉండటానికిగాని ముందుగా కట్టవలసిన నిర్ణీతశుల్కం, నిర్ణీతనిక్షేపధనం (తె.)

**ధణుతు** తలదిమ్మెక్కు, విపరీతమైన ఆశ్చర్య ప్రశంస (క.)

**ధప్పాయిస్తా** పూడ్చి పెట్టిస్తా (తె.)

**ధప్పడం** చప్పళం, శుభకార్యాలలో సంతర్పణంలో తయారుచేసే పులుసు (క,కో.) ఉదా॥ పప్పుధప్పళం

**ధప్పా** నెత్తిమీదతన్ను (తె,ప్రకీర్ణ.)

**ధరణా** తీవ్ర నిర్బంధం, తానుకోరిన దానిని ఇతరులను బలవంతంపెట్టి అంగీకరింపచేయటం, అసమ్మతిగాచేసే జైతాయింపు ప్రదర్శన (కో,క,తె,ప,రా.)

**ధరిమానా** ఎంతమాత్రం, సమీపానికి (కో.)

**ధారాళం** మిక్కుటం, ముందు వెనకలు చూడకుండా (రా.)

**ధాష్టీకం** చూ. దాష్టీకం, అనుచితమైన (కో.) పెత్తనం, అధికారం (కో,ద.)

**ధిమాకు** గుండెదిటవు, నమ్మకం, ఆత్మవిశ్వాసం (కో.)

**ధిలాసా** కులాసా, ఉత్సాహం, సంతోషం

**ధీమా** ఆత్మవిశ్వాసం, స్థైర్యం, తన ప్రజ్ఞపట్ల తనకు నమ్మకం

**ధౌతి** సిరాబుడ్డి (తె,ప్రకీర్ణ.)

# న

**నంగనాచి** చేయవలసింది చేసి ఏమీఎరగనట్లు అమాయకంగా ప్రవర్తించే స్త్రీ (కో,క,ద.)

**నంగాగాడు** తక్కువవాడు, తులువ, చాలా బీదవాడు, పనికిమాలినవాడు, అప్రయోజకుడు (తె,ప్రకీర్ణ.)

**నంజగాలి** చల్లటిగాలి (క.)

**నంజభూమి** మెట్టభూమి (ద.)

**నంద** పశువులమంద (క.)

**నక్క** దొంగతవ్వే కన్నం (తె,ప్రకీర్ణ.)

**నక్కు** ఇనుపబద్ద (క.)

**నఖముఖాలా** చేతికివచ్చినట్లెల్లా, చెల్లాచెదురు (కో.)

**నగిడి** నెగడు (క.)

**నగిడిమంట** నెగడు (క.)

**నగు** నవ్వు (కో,తె.)

**నగుబాటు** అవమానం, చిన్నతనం (కో, తె,ద.)

**నగుబోతు** పటికిపంచదార, కలకండ చక్కెర (తె,ప్రకీర్ణ.)

**నజరు** కంటికింపైన (కో.) నజరాన, కానుక, దృష్టి (క,రా.)

**నజరుబందీ** నిర్బంధితులు నిత్యం హాజరు వేయించుకోవాల్సిన కట్టడి (క.)

**నజా** శిక్ష (తె.)

**నడమంత్రపుమాటలు** అతిశయంతో కూడిన మాటలు, కలహ ధోరణి, ఎత్తిపొడుపు (తె.)

**నడవ** ముంగిటిల్లు, ఇంటివసారా (కో.)

**నడవా** చూ. నడవ

**నడిమ/నడుమ** మధ్య, అర్థంతరంలో (తె.)

**నడ్డి** నడుము, కటిమధ్యం (క,కో.)

**నత్తగొట్లు** నత్తలు (క.)

**నదురుడు** నసుగుడు, గొణుగుడు, ముభావం (కో.)

**ననపక** ఆహారం మొదలైనవి అరగక, ఇమడక, సరిపడక (కో.)

**నమోన** మాదిరి, మాదిరికొలత (తె.)

**నయం** చౌక, విస్తారంగా లభ్యం కావటం (ద.)

**నమోనలు** రకరకాలు (తె.)

**నయోద్దం** నైవేద్యం (తె.)

**నరవ** దారి, బాట (ద.)

**నర్మి** ఓర్పు, నెమ్మది (తె.)

**నలి** చెలరేగిన స్థితి, విచ్చలవిడి (క.)

**నలిరేగు** చూ. నలి (క).

**నలీతాలీ** ప్రాథమ్యం (కో.)

**నల్లగుడ్డ** మసిగుడ్డ, మసిపాత, అంట్లగుడ్డ (క.)



**నల్లేరు** ఒక ఓషధి (తె,క,కో,రా.)

**నసీబు** అదృష్టం, తలరాత (తె.)

**నసుకు(డు)** గొణుక్కోవటం (తె.)

**నాకాయనూకాయలు** లూకలాకాయలు, అసమర్థులు, అనామకులు (కో,క.)

**నాగా** పనిలోకిరానిరోజు, పనివిడుపు, గైరుహాజరు (కో.)

**నాగాకట్టు** పనిలోకి రానిరోజు(ల)కు ఇవ్వవలసిన ప్రతిఫలం తగ్గించిఇచ్చు, లెక్కకట్టు (కో.)

**నాచురంగు** వేశ్యల ఆటపాటలు, మేజువాణి (క.)

**నాతాన** నాదగ్గర, నావద్ద (తె.)

**నాతిరి** రాత్రి, రేతిరి (తె.)

**నాత్రి** చూ. నాతిరి, రాత్తిరి, రాత్రి (తె, ప్రకీర్ణ.)

**నాను** కంఠహారం (కో,తె.)

**నాపసాని** ఆరిందా, ఫామేదా, ఈడుకు మించిన హావభావాలు, తెలివితేటలు ప్రదర్శించే వ్యక్తి (కో.)

**నామోషి** చిన్నతనం, న్యూనత, అవమానం (కో.)

**నాయుడు** ఇంటియజమాని, భర్త (క.)

**నాయురాలు** ఇంటిఇల్లాలు, భార్య (క.)

**నాలుగక్కళ్ళనించి** (తె, ప్రకీర్ణ.) నాలుగువైపులనుంచి (తె.)

**నాష్ట** ఫలహారం, ఉపాహారం (తె.)

**నాసి** తక్కువ (కో,తె.)

**నాసిది** తక్కువది (తె,కో.)

**నాసిరకం** తక్కువరకం, శ్రేష్ఠమైనది కానిది (కో,తె.)

**నింపాది** నెమ్మది, నిదానం, తొందరపడని స్వభావం (కో.)

**నింపాది(గా)** చూ, నింపాది (కో.)

**నికాల్‌దేవ్** తీసెయ్యి, ఆపు (తె.)

**నిగా** కను కలిగిఉండు, గురిపెట్టిఉండు (ద,తె.)

**నిఘా** ఏకాగ్రత, గురి (క.)

**నిచ్చర** నివ్వెర, ఆశ్చర్యం (క.)

**నిచ్చెర** చూ, నిచ్చర (క.) ఆశ్చర్యం, విస్మయం, నివ్వెర

**నిభాయించడం** తట్టుకోవటం (కో,క.) నిబ్బరించగలగడం, శక్తికలిగిఉండటం, నెగ్గుకొనిరావడం, భరించడం

**నిభాయించుకోవడం** చూ, నిభాయించడం (క.)

**నిమ్మళం** నెమ్మది (కో.)

**నియతు** పద్ధతి, నియతి (తె.)

**నియ్యతు** నీతి (తె.)

**నిరభ్యంతరం** ఆటంకం లేకుండా (కో,క, ద.) అడ్డులేకుండా

**నిరవసరం** అనవసరం (కో.)

**నిరుకు** నిశ్చయం (కో,క.)

**నిర్గెం** విఘ్ననివారకంగా సుముహూర్త ప్రయాణానికి సన్నాహంలోఉండి సామాన్లు ముందుగా తమ ఇంటినుంచి వేరొకఇంటికి తర్లించటం (కో.)

**నిర్గెంపెట్టడం** చూ. నిర్గెం, ప్రయాణ నిర్గమన ప్రయత్నం (కో.)

**నిర్బంధం** నిలుపుదల, కట్టడి (కో.)

**నిర్వాకం** నిర్వహణ, నిరసనసూచకంగా వ్యాఖ్యానించడం (కో,రా,ద.)

**నిలుకు** నెమ్మదితనం, నిలుపునిదానం (కో.)

**నివాలి** హారతి (తె.)

**నివేదిక** ఒక విషయాన్ని గురించిన వివరణం (కో,తె,ద,రా.)

**నిసీబు** లంచం, అక్రమలాభం (క.)

**నిస్సాకారం** నిర్లక్ష్యం, తృణీకారం, ఎల్లిదం (క.)

**నీటిపదును** నీటివేగం, ప్రవాహవేగం (క.)

**నీటు** టెక్కు, దంభం, నీలుగుడు (కో,ద,రా.)

**నీతాన** నీవద్ద, నీదగ్గర (తె.)

**నిరపనిందలు** చూ. నీలాపనిందలు (కో.)

**నీలాపనిందలు** నిర్హేతుకమైన అపవాదులు (కో,ద,రా,తె.)

**నీలివార్తలు** చెడ్డవార్తలు, అపవాదులు చూ. నీలాపనిందలు (కో,ద,రా.)

**నీలుగు** గర్వం, అతిశయం, దర్పం, స్వాతిశయం (కో,క,ద,తె.)

**నీలుగుడు** చూ. నీలుగు (కో,ద,రా.)

**నీళ్ళచాయ** మలవిసర్జనానికి పోవటం (ద.) బహిర్భూమికి పోవటం (ద.)

**నీళ్ళుపోసుకోవటం** చూలునిలవటం, గర్భం ధరించటం, చూ. నీళ్ళోసుకోవటం (కో,క,ద.)

**నీళ్ళోసుకోవటం** గర్భం ధరించటం (క,కో,ద.)

**నుచ్చగిత్త** అచ్చువేసిన ఆంబోతు (కో,క.)

**నుయ్యి** బావి (క.)

**నురుగుదబ్బలు** చొంగలు, నోటివెంటవచ్చే నురుగులు (కో.)

**నులుచుకానిపోవటం** మెలికలు తిరగటం (క.)

**నులుచుకోవటం** ఒళ్ళు విరుచుకోవడం (క.)

**నుసి** దురద (క.)

**నుసేయడం** జిలపుట్టటం, దురదపెట్టటం (క.)

**నూకు** తోయు, నెట్టు (కో,తె.)

**నూకటం** మెడబెట్టి గెంటటం (కో.) తోసివేయటం (తె.)

**నూటేయటం** మొత్తటం, ఒళ్ళుహూనం చేయటం (క.)

**నూలుపున్నమ** జందాలపున్నమ, శ్రావణపూర్ణిమ (తె.)

**నెంకులాడటం** వెతకటం, వెతుకులాడటం (తె.)

**నెగడు** చూ. నెగడి, మంట (తె.)

**నెట్టుకోవటం** పూనుకోవటం, ఆరంభించటం, జరిగించటం, తలపడటం, సిద్ధపడటం (క.)

**నెయ్యిలు** పేలాలు (క.)

**నెరవడం** తోసివేయటం, తొక్కివేయటం (క.)

**నేమాను** పెళ్ళికూతురితో మర్లు పెళ్ళికి పంపవలసిన కట్నకానుకలు (క.)

**నేయడం** కప్పటం, పూన్చటం (కో,క.)

**నేవకం** నేత (తె.)



**నేస్తం** స్నేహితుడు, చెలికాడు (కో,క.)

**నొల్లు** కుప్పవేయు, కూర్చు (క.)

**నొల్లుకర్ర** సన్ననిపుల్ల (క.)

**నొల్లుకురావటం** పోగుచేయటం (క.)

**నొల్లుకోవటం** కూర్చటం, కుప్పవేసుకోవటం (క.)

**నోటీసు** ప్రకటన, రాతపూర్వకమైన హెచ్చరిక (కో,తె.)

## ప

**పకడ్‌బందీ** గట్టియత్నం, నిర్లోపంగా పూనుకోవడం (కో,తె,ద.)

**పకీరు** వ్యర్థుడు, దరిద్రుడు, నిర్ధనుడు (కో.)

**పచ్చడం** దుప్పటి, శాలువా (తె,క.)

**పచ్చెపువాండ్రు** జీనిపనివాండ్రు, రంగురంగుల బొమ్మలు చేసేవాళ్ళు (క.)

**పంచకజ్జాయం** బెండు, బత్తాసు, పప్పులు, మొరమొరాలు, కాజాలు (రా.)

**పంజు** కాగడా, గడ్డిదుబ్బు, ఒకరకమైన దీపం, కాలువ, చెరువు పనులకై కూలిపనిచేసే వ్యక్తి ఒకరోజుకు తవ్వగలిగిన పరిమితి (తె.)

**పాంజీవులు** కాళ్ళ కడియాలు (క.)

**పటాక్యర్లు** మోసగాళ్ళు, దగాకోరులు (క.)

**పట్టాకడాలు** కాలిపట్టీలు (తె.)

**పట్టెడాట** నవారుపట్టీ గుండ్రంగా చుట్టి దాంట్లో ఒక పుల్ల దోపి ఆడేఆట (క.)

**పట్టెతోలడం** దున్నినతర్వాత చదునుకావడం కోసం పట్టెతోలటం (క.)

**పట్నంచలాక్** షోకిల్లా, నాగరికుడు, చలాకీపురుషుడు (తె.)

**పట్లాను** చూ. పంట్లాము (తె.)

**పంట్లాం** పొడుగులాగు, పేంటు (కో.)

**పండుకొను** పడుకొను, శయనించు (తె,కో.)

**పండుతల** నెరిసినతల, మిక్కిలిఅనుభవశాలి (క.)

**పడగొట్టిరా** పంపించిరా (తె.)

**పడగొట్టిరావటం** పంపించిరావటం (తె.)

**పడమటిశాంబరం** వడగాడ్పు, వేసవిగాలులు (కో.)

**పడిపోయింది** దిగబడింది (తె.)

**పడుగులబండ** నేతనేసేటప్పుడు ఉపయోగించే సాధనం (తె.)

**పణుకులు** బండరాళ్ళు, (ద.) పెద్ద పెద్ద శిలలు (క.)

**పతంగి** గాలిపటం (తె.)

**పతకం** పథకం, పన్నుగడ (తె.)

**పత్త** చిరునామ (తె.) జాడ, వైనం, ఉనికి (క,కో.)

**పత్తిపని** శ్రమతోకూడిన పని, విసుగుకలిగించేది (కో.)

**పత్తులు** పాశీలు (క.)

**పత్రంజీలు** విలువైన వస్త్రాలు (తె.)

**పదగజేయటం** పదునువచ్చేటట్లు చేయటం (తె.)

పదడు అడుసు (కో.)

పన్నడం పడుకోవటం (తె.)

పంచార చక్కెర పంచదార (తె.)

పండుంపుల్ల పళ్ళుతోముకొనేపుల్ల చూ. పల్లుంపుల్ల (కో,క.)

పన్నాగం వంచనతో కూడిన ప్రయత్నం, కుట్ర (కో.)

పన్నీరుపువ్వు గులాబీ పువ్వు, రోజా పువ్వు (ద.)

పన్నె చూ. పయిని, దువ్వెన (క.)

పప్పులు పిండివంటలు, తినుబండారాలు, తాయిలం (క.)

పప్పుఅరది ఘనమైన పిండివంట, పోలేరమ్మ అమావాస్యనాడు విధిగా చేస్తారు (క.)

పయ్య బండిచక్రం (తె.)

పరకాయించు జాగ్రత్తగా చూచు, గమనించు కనిపెట్టిఉండు (కో,తె.)

పరగటిగాలులు పడమటిగాలులు (క.)

పరగడ ఉదయం, పొద్దున (క.)

పరగడపు ఉదయం నిద్రలేచిన తరవాత ఏమీ భుజించకుండా ఉన్నప్పటి స్థితి (కో,క.)

పరద తెర (తె.)

పరవానా ఫర్మానా, ఆజ్ఞాపత్రం (తె,ద.)

పరష ఎద్దులసంత (రా.)

పరస సంత (క.)

పరాకతు తెలియజేయు (తె.)

పరాకు పరధ్యాన్నం, అశ్రద్ధ, అనవధానత (కో,ద,తె,రా,క.)

పరారీ ఖైదునుంచి తప్పించుకొని పారిపోవటం, వెన్ను చూపటం, కాలికి బుద్ధి చెప్పటం, పిక్కబలం చూపటం (కో,ద,క,తె,రా)

పరాశ్కం ఎగతాళి, హాస్యం (తె.)

పరిసిపోవటం పాసిపోవటం, పాడైపోవటం (కో.)

పరేశాన్ ఖంగారు, అస్తవ్యస్తం, ఆందోళన (తె.)

పరేషాన్ చూ. పరేశాన్, మనస్సుకకావికలై పోవడం, భీతికలగటం (తె.)

పర్రం ఎసుడు, మెట్ట (క.)

పర్షించు భోజనోపక్రమంలో విస్తరిచుట్టూ కాసినినీళ్ళుతిప్పి జార విడవటం (కో,క,ద.)

పలకరసేయటం పళ్ళుతోముకోవటం (క.)

పలకర్ర పళ్ళుతోమే పుల్ల (క.)

పలవరించు కలవరించు (కో,క.)

పలారం ఫలహారం (తె,కో.)

పలుచాలు పలువరుస, పలుకుదురు (క.)

పల్లురాయి పటికిరాయి (తె,కో.)

పల్లక పల్లెత్తకుండా, మాట్లాడకుండా, కిక్కురుమనకుండా, నోరువిప్పకుండా (క)

పల్లకి మేనా (తె.)

పల్లా ఒక కొలమానిక, నూరుమానికలకొలత, బియ్యపుబస్తా (తె.)

పల్లిటీలు పల్టీలు, మొగ్గలు (కో.)

పల్లీ వేరుసెనగ, వేరుసెనగకాయలు (తె.)

పల్లిపప్పు వేరుసెనగపప్పు (తె.)

పసందు ఇష్టం, శ్రేష్ఠం (తె.)

పసిజిగంటి సన్నని దబ్బనంవంటి సాధనం (క.)

పసులు పాడిపశువులు (తె.)



పస్తాయించడం నిదానంగా ఉండటం, తొందరపడకపోవటం, నిలుపుకలిగి ఉండటం (కో.)

పాంకోళ్ల పాదరక్షలు, చెప్పులు (క,కో.)

పాంగ్యం ప్రాంగణం, పందిరి (కో.)

పాంపొర పాముకుబుసం, కూసం (క.)

పాగల్ ఉన్మాది, పిచ్చివాడు, వెర్రివాడు (తె.)

పాటక్ గేటు, ప్రధానద్వారం (తె.)

పాటాకు శ్రేష్ఠమైన పొగాకు (క.)

పాటోలి ఒక తినుబండారం (క.)

పాతు చుట్టుకొలత, పరిధి (క.)

పాదిత్యం పాపం (కో.)

పాన్ ఆకు, వక్క, తాంబూలం (తె.)

పానీ నీరు (తె.)

పానుదాను తమలపాకులు, తాంబూలం సాధన సామగ్రి ఉంచుకొనే సాధనం, చిన్న పెట్టె (కో,క.)

పామడం పూయడం, ఒంటికిరాయడం, తోమడం, మర్దించడం (క.)

పాయకట్టు (ద.)

పాయకాన మరుగుదొడ్డి (తె,కో.)

పాయింపు పాళ్ళు పంచుకోవటం, ఆస్తిని విభాగంచేసుకోవటం (క.)

పాయిద ఉపయోగం, మేలు, ప్రయోజనం (తె.)

పారకత్ కాయిదం విభాగపత్రం (తె.)

పారవపిట్ట పావురం (క.)

పారాగతాలు ఇహపరాలు, పరువు (కో.)

పారీకత్తు విభాగనిర్ణయపత్రిక (కో.)

పారీకత్తుఇచ్చు విడాకులిచ్చు (తె.)

పారు విరేచనాలుకావటం (కో,తె.)

పాలఅరది పిండివంట, మిఠాయి, తియ్యని సరుకు, పెసరపప్పు, ఏలకులు, కొబ్బరి, పంచదార, నేతితో వేయిస్తారు (క.)

పాలగుల్ల వెదురుపేళ్ళ బుట్ట (క.)

పాలబిండె నల్లికళ్ళ పాము (గుంటూరు మండలం) నల్లికిళ్ళ పాము (గోదావరి) (తె.)

పాలుమాలిక బద్ధకం, మందకొడితనం, మాంద్యం, బడలిక (కో.)

పావంచా మెట్టు, సోపానం (క.)

పావడా పరికిణీ (కో,క.)

పావళ్ళు పావుకోళ్ళు (క.)

పాశం పాయసం (తె.)

పాసీ ఉరిశిక్ష (తె.)

పింగటింపు పీగడీయు, బతిమాలు, సాగదీయు (తె.)

పింజలు పిందెలు (క.)

పింజారీ దుష్టుడు, రౌడి (క.)

పింజెరు దూదిపింజెలు (తె.)

పికపికలాడటం నిండుగా కోలాహలంగా ఉండటం (క.)

పికరు జాడ, గుర్తు, సమాచారం, పత్తా (క.)

పిచ్చ మోసం, కపటం, (ద,కో.) ఉదా॥ పిచ్చకొలత, మాటగొప్ప మానికపిచ్చ అని సామెత

పిట్టకలం ఊట కలం (క.)

పిట్టమనిషి శూన్యం, జీబురుమంటున్న విజనప్రదేశం (క.)

**పిట్టమనిషి (లేకుండా)** ఒక్కమనిషికూడా కనబడకుండా పోవడం (క.)

**పిట్లా** ఉప్పుడుపిండి (తె.)

**పిడస** పిడత, చిన్నముద్ద (కో.)

**పిడి** తరం (తె.)

**పిడియేనుగు** ఆడయేనుగు (ద,రా.)

**పితురు** ముక్క (తె.)

**పితూరీలు** వెక్కసంమాటలు, ఫిర్యాదులు లేనిపోని నిందారోపణలు (కో,రా,ద.)

**పిత్తపరిగెలు** జెల్లచాపలు (క.)

**పిత్రీలు** పితూరీలు, ఫిర్యాదులు (రా.)

**పినిచుట్టు** గూడపోసిచుట్టూ ధరించే వస్త్ర ధారణ (క.)

**పిన్నాడు** పిల్లాడు

**పిల్లనకర్ర** పిల్లంగ్రోవి (క.)

**పిల్లసమేరీ** చిలిపితగాదా, తవ్వాయి, వివాదం, జగడం (కో.)

**పిసరుగాడు** నిష్ప్రయోజకుడు, పనికిమాలిన వ్యక్తి, అల్పుడు, తక్కువవాడు (క.)

**పిసికిళ్లు** లేతకంకులధాన్యం అరిచేతుల్లోనలిపి, రాచి, పొట్టుపోయేట్లు చేసినగింజలు (కో,ద.)

**పిసినారి** లోభి (కో,ద,క.)

**పిసరు** కొంచెం, కొద్ది, అల్పం (కో,క.)

**పిస్సవాడు** పిచ్చివాడు (తె.)

**పీక** కంఠం, గొంతు (క.)

**పీకలబంటి** గొంతువరకు (కో,క.)

**పీకలమొయ్యా** కంఠంవరకు, వేలుపెడితే గొంతులో అందేదాకా (కో,క.)

**పీత** ఎండ్రకాయ, రొయ్య (క.)

**పీతనడక** అడ్డిదిడ్డపుపని, సక్రమంగా సాగని పని (క.)

**పీత్వా** మద్యప్రియత, పానత (క,కో.)

**పీనె** వేదిక, తిన్నె (క.)

**పీచచేయు** వెన్నంటు, వెంబడించు (తె.)

**పీతాంబరాలు** పసుపుబట్టలు (తె.)

**పుంగనూరు** వెర్రిబాగుల, మతిస్వాస్థ్యంలేని (ద.)

**పుంజభూమి** మాగాణి (ద.)

**పుంజలూరు** వ్యర్థుడు, నిష్ప్రయోజకుడు పనికిమాలినవ్యక్తి, పనికిమాలిన (ద.)

**పుంజాలు** సిగ్గు అభిమానాలు, మెడతాళ్ళు, బంధాలు (క.)

**పుంటికూర** గోకగూర, గోగుకూర (తె.)

**పుంటికూరతొక్కు** గోంగూరపచ్చడి (తె.)

**పుండాకోర్** రౌడీ, దుర్మార్గుడు (కో,క.)

**పుక్కటికి** ఊరకే, ఉచితంగా (తె.)

**పుటం** కుమ్ము, కొలిమి (కో,తె.)

**పుట్టిభూమి** 8 యకరాలు (పుట్టెడుధాన్యం పండేభూమి) (కో.)

**పుట్టిములక** ప్రమాదం, మునిగిపోయేప్రమాదం (కో.)

**పుట్నాలు** శెనగపప్పు, వేయించిన శనగలు (తె.)

**పుప్రేపనలు** ప్రేరేపణలు, రెచ్చగొట్టటాలు (కో.)

**పుత్తం** పుస్తకం (తె.)

**పునక** పుర్రె (క,కో.)

**పురమాయించు** పురికొలుపు, ఆజ్ఞాపించు, అప్పగించు (తె,కో.)



**పురోతుడు** పురోహితుడు (తె.)

**పుర్రాకులు** చాడీలు, కల్పనలు, కల్పించిన మాటలు (క.)

**పుర్సతు** తీరిక, వ్యవధి (తె.)

**పులమటం** పూయటం, రుద్దటం (కో,క.)

**పులికండ్లు** గుండ్రటి అక్షరాలు (క.)

**పులిచారలు** మబ్బులు (ద.)

**పుల్లగండోడు** పోకిరి (తె.)

**పుల్లగుమ్మడి** బూడిదగుమ్మడి (క.)

**పుల్లవిరుపు(మాటలు)** మనసుకి కష్టం కలిగించే, విముఖతకలిగించే మాటలు (కో,క.)

**పుల్లింగాలు** చాడీలు, పితూర్లు, రెచ్చగొట్టే మాటలు, కలహబీజాలు, చెవికొరకడాలు (కో,క.)

**పుసలాయించడం** మభ్యపెట్టి ఆకర్షించటం, కినుగప్పటం (క.)

**పుస్తె** తాళిబొట్టు, మంగళసూత్రం (క,కో, తె,ద.)

**పూజు** కాడి (క.)

**పూజ్యం** అభావం, శూన్యం (క,కో.)

**పూతిక** పూచిక (క.)

**పూయడం** పూన్చటం (క.)

**పూరా** పూర్తిగా, మొత్తం, అంతా (తె.)

**పూరాగ** చూ. పూరా, నిండుగా, సాంతంగా (క,తె,ద,కో.)

**పూసి** పూన్చి (క.)

**పూసుకురావటం** సమర్థించటం, బలపరచటం (కో.)

**పెంకువడియాలు** బూడిదగుమ్మడికాయ పెచ్చుతో ప్రత్యేకించిపెట్టే వడియాలు (క.)

**పెంకె** మంకుతనం, పట్టినపట్టు విడువని స్వభావం (క.)

**పెంకెతనం** గట్టి పట్టుదల, రాలుగాయతనం (కో,క.)

**పెండ** పేడ (కో,తె.)

**పెండె** కంచె, దడి, పశువులురాకుండా కాపాడుకోవటానికి నిర్మించిన రక్షణసాధనం (కో,క.)

**పెండెం** చూ. పెండె (క.)

**పెండెరువు** పేడఎరువు (తె.)

**పెటుకు** కఠినం, కరుకైన (కో,ద.)

**పెడక** చూ. పెణక, పొది (క.)

**పెడసరం** పొగరుబోతుతనం, నోటిదురుసుతనం, తలతిరుగుడు, దురహంకారం (కో,క.)

**పెద్దఉజ్జీ** మేటిఆటగాడు (క.)

**పెద్దపెయి** స్థూలశరీరం (తె.)

**పెయి** శరీరం (తె.)

**పెద్దమనిషి** ముసలివాడు, వృద్ధుడు (తె.)

**పెద్దల్నాటినంది** పూర్వకాలంనుంచి (తె.)

**పెద్దాయి** పెదతల్లి, పెత్తల్లి (తె.)

**పెద్దేకాదశి** తొలేకాదశి (క.)

**పెనిమిటి** భర్త (క,కో.)

**పెమ్మిద** ప్రమిద (క,కో.)

**పెయ్య** వొళ్ళు, శరీరం (తె.)

**పెయ్యన్న** పెగతండ్రి, పెదనాన్న (క.)

**పెయ్యమ్మ** పెదతల్లి, అమ్మ, దొడ్డమ్మ (క.)

**పెయ్యి** చూ. పెయి (తె.)

**పేత్రేగటం** పెచ్చుమీరిపోవటం, విర్రవీగటం, రెచ్చిపోవటం, పైపైకి రావటం (క,కో.)

**పేనా** కలం (రా,ద.)

**పేరెలుకలు** పెద్ద పెద్ద లావుపాటి ఎలుకలు (క.)

**పేలకొట్టటం** విజృంభించటం, అతిశయంగా వాదులాడటం (కో.)

**పేషీ** విచారణదినం, విచారణరోజు, విచారణ స్థానం (తె.)

**పైటన్నం** పైటిబువ్వ (కో,క.) పొద్దు తిరిగినతర్వాత (పైటివేళ) సంసారులు అంటే కృషీవలులు మొదలైనవారు రెండోపూట తినే అన్నం.

**పైదల్** కాలినడకన (తె.)

**పైపందెం** వేలంపాటలో ఒకరిని మించి ఒకరు పై పాట పాడటం (కో.) ఒకరు పందెం ఒడ్డగా దాన్నిమించి మరొకరు ఒడ్డే పందెం.

**పైరకూర** పయరగాలికి ఎదిగిన గోంగూర మొదలైనవి (కో,ద.)

**పైరగాలి** దక్షిణపుగాలి, పంటలకు మేలుచేస్తుంది (కో,ద.)

**పైలకాపరి** పశులకాపరి (కో.)

**పైల్వాన్** పహిల్వాను, వస్తాదు (కో,తె,ద.)

**పొంగడం** పులిబొంగరం (క.)

**పొంటేలు** ఝాములు (తె.)

**పొచ్చెం** న్యూనత, లోపం (కో,తె,ద.)

**పొట్టె** మంద్రగబ్బ (తేలు ముదిరితే పొట్టె) (క.)

**పొట్టిగాడు** కుర్రవాడు, పిల్లవాడు (తె,రా.)

**పొడగొట్టు** పోగొట్టడం (తె.)

**పొణక** అటకవంటి ఎత్తుప్రదేశం (క.)

**పొత్తినూలికాయ** పట్టుపురుగుకాయ, మల్బరీ చెట్టుకాయ (క.)

**పొత్తిపంచ** పట్టుపంచ (క.)

**పొత్తొళె** వల్లెవాటు (క.)

**పొత్రలు** సంభావనలు, యాచనలు (కో, క.)

**పొదం** పొదుపు, జాగ్రత్త (కో,క.)

**పొదిగిలి** బిడ్డను పొదువుకొన్న స్థితి (కో, క.)

**పొదువు(గా)** సుకుమారంగా, (కసుగందకుండా చూస్తాను అనే అర్థం) (క.)

**పొద్దుమూకు(ట)** పొద్దు కూకు(ట) (తె.)

**పొద్దుమూకుట** సాయంకాలంకావటం (తె.)

**పొద్దులు** పురిటి రోజులు (తె,క,కో.)

**పొన్నూరు** పొరుగూరు, పరాయిచోటు, ఇతర ప్రదేశము ఉదా: ఉన్నవూరు విడిచి పొన్నూరుకిపోతే పూనినకర్మం మానీనా అని సామెత (క,ద.)

**పొప్పడికాయ** బొప్పాయికాయ (తె.)

**పొర** కపటము (తె,క.)

**పొరకట్ట** చీపురుకట్ట (క,తె.)

**పొరపొచ్చాలు** కల్లకపటాలు (కో,క.)

**పొర్క** కట్ట (తె.)

**పొర్లుకిరావటం** ఎదఅయి గర్భధారణకు అనువైన ప్రాయం (క.)

**పొల్తి** పోలిక (క,కో.)

**పొల్తిపట్టడం** పోల్చుకోవడం, పోలికపట్టడం, గుర్తుపట్టడం (కో,క.)



**పోకలు** వక్కలు (కో,క.)

**పోచమ్మ** మశూచికం (క,తె.)

**పోచీలు** ముంజేతులు; ఆభరణవిశేషాలని కూడా లోకంలో వాడుక వున్నది (క.)

**పోడువ్యవసాయం** (క.)

**పోడు** అడివికాల్చిచేసేసాగు (క.)

**పోతరం** కండకొవ్వు, అహంకారం, గర్వం (కో,క.)

**పోతరింపు** కొవ్వివుండటం (కో,క,తె.)

**పోరగాండ్లు** పిల్లలు (తె.)

**పోలెలు** బచ్చాలు (పిండివంట) (తె.)

**పోళీ** భక్ష్యం, బొబ్బట్టు, పూర్ణంపెట్టిన పోళీలనే భక్ష్యాలని అంటారు (క,కో,రా.)

**పోవ్వాకు** పొగాకు (క,తె,రా.)

**పోస్తది** పోస్తుంది (క,తె.)

**ప్రతిపచ్చికిత్స** వెంటనే విరుగుడుగా చేయాల్సిన చికిత్స (క.)

**ప్రత్యుత** బదులుగా, మారుగా, సమాధానంగా (కో,క.)

**ప్రియం** ఎక్కువ ఖరీదు, చౌకగా లభించక పోవడం (కో,క,రా.)

**ప్రయోజనము** పని, అవసరం, సందర్భం; తద్దినమని నెల్లూరు ప్రాంతంలో వాడుకవున్నట్లున్నది (కో,ద,రా.)

## ఫ

**ఫక్తు** ఒకేరీతి, ఒకేవరస, అదేవిధంగా నియమించు (తె.)

**ఫయిసలు** ముగింపు (కో,క,రా.)

**ఫరకు** తేడా (కో,తె.)

**ఫరజ్ అంజామ్ చేయటాన్కి** కర్తవ్య నిర్వహణకు (క,తె.)

**ఫరష్** నేల (తె.)

**ఫరార్** పరారీ, పారిపోవడం (తె,కో,క.)

**ఫరారైపోవు** పారిపోవు (తె,కో.)

**ఫర్మానా** రాజశాసనం (తె.)

**ఫర్మాయింపు** పురమాయింపు, ఒకపనిలో

**ఫసల్** పంట (కో,తె.)

**ఫామేదా** నిబ్బరం, హుందాతనం, (కో,తె.)

**ఫారా** పహరా (కో,క.)

**ఫికరు** దిగులు, సమాచారపు భోగట్టా, ఉనికి, వార్త (కో,రా,తె.)

**ఫిరాయించటం** తలపడడం, ఢీకొనడం ఉదా॥ కుడీ, ఎడమా అనకుండా ఫిరాయిస్తున్నారు (కో,తె,క.)

**ఫౌరాన్** తక్షణం, తక్షణమే (తె.)

## బ

**బంకు** కొలువుకూటం, కక్ష్య, వృద్ధుడు, కావలివాడు, శూరునివలె నటించేవాడు (క.)

**బంగారపుపిచుక** ధనవంతుడు (కో,క.) కృష్ణుడు (క.)

**బంగుబాయి** తూగుటుయ్యాల (క.)

**బంగ్ల** మిద్దె, మేడ (తె,క.)

**బండారం** లోగుట్టు (కో,క.)

**బంతి** పంక్తి, వరుస (కో,క.)

**బంద** చెరువు వంటిది, కాని అంత విస్తారం లేదు, చిన్న చెరువు; జలాధారం, బురదనేల (బందం కింద భూమి అంటారు) (కో,క.)

**బందా** కాలికి కాలికి కలిపికట్టుట; లొంగిన వాడు, సేవకుడు (క.)

**బందుకావటం** మూసివేయటం (తె.)

**బంధూక్** తుపాకీ, తుపాకి గుండు (తె.)

**బందె** బందెదొడ్డి; చెరలో బడిన పశువు (బందెలో పడిన పశువు)ను విడిపించుకొనుటకు చెల్లించు దండుగ సొమ్ము (తె.)

**బందోబస్తు** అజమాయిషీ అధికారం, వాకబు (కో,క,తె.)

**బశాళి** చల్ది, చద్ది (క.)

**బశాలు** పల్లెటూరి అమాయకుడు, మొరటు వాడు, పల్లెటూరి బైతు (కో,తె,క.)

**బగర్త** ఒకరివద్ద (క.)

**బగాది** గాలివాన (బగాది సంవత్సరం-గాలి వాన వచ్చిన సంవత్సరం) (క.)

**బగోని** గిన్నె (తె,క.)

**బగ్గంపాడు** సర్వనాశనం, భస్మీపటలం, తగల బెట్టడం (కో.)

**బజనిక** బదనిక (క.)

**బజాన్** పాట, మేళం (క.)

**బజాయించడం** బెదరించడం (క.)

**బజీతు** మోసం, కించ(పరచడం) (ద,కో, క.)

**బటువు** ఉంగరం (కో.)

**బడుద్ధాయి** నిష్ప్రయోజకుడు, పనికిమాలిన వాడు (కో,ద,తె.)

**బడెఉన్నవు** బాగున్నావ్! మహావున్నావు (తె.)

**బత్తిఖర్చు** బాటా, దినకూలి (తె,క.)

**బదనాము** పేరుచెడగొట్టటం, నిందపాల్జేయటం (తె.)

**బదవలు** ఇబ్బందులు, తాపత్రయాలు (తె.)

**బద్దించు(పు)** విభాగించు; బద్దింపుపద్ధతి, బద్దింపులెక్కలు (కో,క.)

**బద్మాషు** దుర్మార్గుడు (తె,కో.)

**బనాయించు** ఏదైనా ఒకవిషయం మరిఒకరిపై చెప్పు, హేళనచేయు (కో,తె.)

**బన్యాగాడు** వైశ్యుడు (తె.)

**బయికాలు** వేవిళ్ళు, గర్భిణీలక్షణములు (తె.)

**బయిరూపులోడు** నాటకాలవాడు (క.)

**బరణిక** బెత్తం, బరికె (రువ్వబరిణక) (క,కో,తె.)

**బరబర** గబగబ (కో,క.)

**బరాతం** తరువు (క.)

**బరాయించు** భరించు (కో,క,తె.)

**బరితెగించడం** సాహసించడం, లెక్కచేయక పోవడం (కో.)

**బరిబాతల** దిగంబరంగా (క,తె.)

**బరుసుబరుసు** మోట, మోటు (తె.)

**బలిమిచేయటం** బలవంతం చేయటం (తె.)

**బలిస్పం** పరువు, మర్యాద, బతుకుతెరువు (తె,కో.)

**బస్త** సంచి, ఒకగిన్నెలో రొట్టెలు, వగైరాలు కలిపి మూటలాగాకట్టటం (తె.)

**బహదుర్‌పని** ధైర్య సాహసోపేతమైనకార్యం, వీరోచితమైన పని, మెప్పుపొందడానికి అర్హమైన కార్యం (కో,తె.)



**బాంచ** నౌకరు, సేవకుడు (తె.)

**బాంద్రుమనడం** బావురుమనడం (తె,క.)

**బాజరబందీ** బాదరబందీ (తె,క.)

**బాజాలు** మంగళవాయిద్యాలు (కో,క,తె.)

**బాజాల్లోండ్లు** మేళగాళ్ళు (కో,తె.)

**బాడవ** ఇసుకనేల (కో.)

**బాడు** ముసుగు, పరద, ప్రావరణం (తె,క.)

**బాడువ** ఏటిపక్క పల్లపుప్రదేశం (కో, తె,క.)

**బాణం** ఐదు అనే సంఖ్యను చెప్పేపరిభాష (కో,క.)

**బాణలి** భాండి (కో,తె,క.)

**బాణసంచా** దీపావళి సామాను (కో,క,తె.)

**బాత్‌చీత్** మాట్లాడితే (తె.)

**బాతఖాని(నీ)** ఊసుపోక కబుర్లు (కో, క,ద.)

**బాదరబంది** రూ. బాజరబంది, తగులం' అనవసరమైన తగులు (క,కో.)

**బానిసెరికం** బానిసతనం (క.)

**బాపతు** సంబంధించిన (కో,ద,క.)

**బాబెహుకూమత్** ప్రభుత్వం (తె.)

**బామనయ్య** బ్రాహ్మణుడు (తె.)

**బారికి** ఊరు కాపలా కాసేవాడు (క.)

**బారికిభూమి** ఊరి కాపలా నిమిత్తం బారికకిచ్చే భూమి (క.)

**బార్లా** పూర్తిగా, రెండు తలుపులూ పూర్తిగా తెరచి వుంచినట్లు (కో,ద,రా.)

**బాలతొడుగు** పెళ్ళికావల్సిన కన్య వొంటిమీద వుండే బంగారు ఆభరణాలు, అలంకారాలు (క.)

**బావండు** బ్రాహ్మణుడు (క.)

**బావనయ్య** బ్రాహ్మణుడు (తె,క.)

**బావురుమనడం** దుఃఖించడం, ఏడవటం (కో,క.)

**బాసండ్లు** వంటపాత్రలు (తె.)

**బాసంగాలు** వధూవరులకు నొసట కట్టేవి (తె.)

**బాసికం** బాసిపట్టు వేసి కూచోడం (క,కో.)

**బికారి** అనాథ, బీద (కో,క.)

**బిగరడం** వాగడం, వదరడం (క,తె.)

**బిగురు** బడాయి, కోత (క.)

**బిగులు** దిగులు, గుబులు (క.)

**బిగులుబిగులుగా** గుబులు గుబులుగా (క.)

**బిజిని** లోభితనం (కో.)

**బిజిలీ** విద్యుద్దీపం, విద్యుత్తు (కో,తె.)

**బిత్తలు** దిగంబరంగా (ద.)

**బిళ్ళిద్రం** అతిశయం, పొగరుబో(మో)తుతనం, కావరం, హుమ్మస్సు, గర్వం (క,ద.)

**బీరుపోవడం** ఫలించక పోవడం (ఇల్లంతా బీరుపోయినట్టుండటం, బీరుపోయి చూచేవారు) (కో,క.)

**బుకాయింపు** మోసగించటానికి ప్రయత్నించడం, చేసిన పనిని చేయలేదని బొంకటం (కో, క,ద.)

**బుక్కగులాలు** సువాసన భరితమైన పొడి, వేడుకలలో ఒకరిపై ఒకరు చల్లుకుంటారు (క, కో.)

**బుక్కపిండి** బుక్కాయి (క.)

**బుగ్గ** సెలయేటి ఊట (క,కో.)

**బుగ్గి** ధూళి, మట్టి, దుమ్ము (క.)

**బుజంపండు** ఒకఆట-ఉప్పేసుకోవడం, ఉప్పు కట్ట, ఉప్పుమోయడం-ఉప్పుఉప్పో, ఉప్పోయమ్మ ఉప్పో అని చిన్న పిల్లలను వీపున మూటలా మోస్తూ ఇలాటి ఆట అయిఉండొచ్చేమో-కళింగాంధ్రంలో ఈ పదప్రయోగం - శైశవ క్రీడా సంబంధి. (క.)

**బుజ్జగింపు** బతిమాలటం, అంగీకరింపచేయటం (కో,క.)

**బుదిరించడం** ఓదార్చడం, బుజ్జగించడం, నచ్చచెప్పడం అనే అర్థాలలో (క.)

**బుదిరింపు** బుజ్జగింపు (క.)

**బురదపనస** ఒకరకం పనస (క.)

**బుర్ర** ఏక్‌తార (పాటలు పాడుతూ మీటే సాధనం) (క.)

**బూకరించడం** తప్పించుకోవడం, మోసగించటం

**బూకరింపు** అబద్ధం, మోసం, మాయ (క, కో.)

**బూకరిగాండ్రు** బడాయికోరులు, గప్పా రాయుళ్ళు (క,కో.)

**బూరగాళ్ళు** ఏనుగుకాలు వ్యాధి (క.)

**బూరు** ఎక్కువ బొచ్చు (క.)

**బెజారు** భయం (తె.)

**బెట్ట** వెట్ట, వేడి, ఉష్ణం (క.)

**బెండు** మచ్చ (క.)

**బెండుటోపి** ఫెల్ట్‌హాట్‌కి తెలుగు కావచ్చు (క.)

**బెత్తాయించడం** అజ్ఞాపించడం, పురమాయించడం, వప్పజెప్పడం అనికూడా కావచ్చు (రా,క.)

**బెందడి** బురద [ఒంటికి పట్టించుకొన్న బురద గుత్తంగా బెందడి అయింది] (రా,ద,తె.)

**బెంబేలుపడటం** దిక్కుతోచక బాధపడటం, దిగాలుపడి తల్లడిల్లడం (రా,ద,కో.)

**బెల్లించడం** బెదిరించినట్లుగా మాట్లాడటం (రా,ద,కో.)

**బెల్లింపు** బెదిరింపు, పంతగింపు, బెల్లించిచూస్తూ (రా,ద,కో,క.)

**బెస్తలు** చేపలు పట్టేవారు (కో,క,ద,రా.)

**బేకడం** కొట్టడం (రా,ద.)

**బేకిండు** కొట్టాడు (రా.)

**బేఖుసూర్‌గ** నిర్దోషిగా (తె,రా.)

**బేగి** చప్పున, త్వరగా (కో,రా,ద.)

**బేగారి** వెట్టిపని (క,రా,ద.)

**బేగారేం** వెట్టిపని (రా,ద,తె.)

**బేగీరావులు** వార్తాహరులు, త్వరితంగా సమాచారాన్ని చేర్చే వార్తాహరులు (రా,ద,కో.)

**బేజారు** కుంగిపోవడం, మనస్సు వికలం కావడం, అధైర్యం, బెదురు, విసుగు (రా,ద,కో, క.)

**బేడెము** తలుపు గడియ (రా.)

**బేపి** కుక్క (క.)

**బేభాగా** బాగా లేకపోవడం, అసమర్థంగా ఉండడం (క,కో.)

**బేవఖూఫ్** తెలివి తక్కువ గాడిద (క.)

**బేవులు** తేనుపులు, త్రేపులు (క,కో.)

**బైరారి** అగసాలి (క.)



**బొక్కలు** ఎపుకలు, ఎముకలు (తె.)

**బొక్కెడు** ఒకసారి బొక్కడానికి తగిన పరిమాణం (కో,క.)

**బొంగపోవడం** చెరువుగట్టుకు బెజ్జంపడి నీరు కారడం (రా,క.)

**బొట్టు** తాళిబొట్టు (కో,క.)

**బొట్టె** పిల్ల (కో,క,తె.)

**బొట్టెడు** పిల్లవాడు (తె.)

**బొడిపి** బొపె, బొప్పి (కో,క.)

**బొంతఅనటి** ఒకరకం అరటి (కో,క.)

**బొందలు** సమాధులు, స్మశానవాటికలు (తె,క,కో.)

**బొమ్మలాపడడం** బొర్లగిలపడడం (క.)

**బొమ్మకా** అంబాడటం, పాకడం (క.)

**బొయ్యారం** కన్నం (క.)

**బొరిగ** దోకుడుపార (క.)

**బొరిగి** మట్టితవ్వే సాధనం (క.)

**బొల్లావు** తెల్లావు (క,కో.)

**బోకరించడం** బోర్లపడటం, ముందుకి వొరగడం, ముందుకి వొంగడం (క,కో.)

**బోడినేల** బయలునేల (చెట్టూ చేమా లేని మైదానం) (క.)

**బోర** రొమ్ము. గుండె, ఛాతీ (కో,క.)

**బోరవిరవడం** విరుచుకోవడం (క,కో.)

**బోరగలు** రాజందులు, బోరగద్దలు కావచ్చు (క.)

## భ

**భగ్గుండి** బుక్కాయి(పొడి) (క.)

**భరోసా** అభయం, నమ్మకం, హామీ, ధైర్యం, వాగ్దానం, మాట (కో,క,ద,రా.)

**భర్తీ** నిండి (పోవడం) (కో,క.)

**భామభా** పుట్టిగానె (తె.) (భామభా మారే సాబ్ - పుట్టిగానే కొట్టారండి)

**భారీ** మంచిఒడ్డూ పొడుగూగల అని దేహం విషయంలో, బరువైన, ఉరువైన, పెద్దప్రమాణంలో అని వస్తువిషయికంగాను (కో,క,తె.)

**భాషపెట్టు** బాసెంపట్టు, బాసీపట్టు (క.)

**భుక్త** (బుగత) (కో,క.)

**భూతాది(గా)** వెనకటికాలం నుంచీ, (తండ్రి కాలంనుంచి భూతాదిగా ఆయనకియ్యడం మామూలు) (కో,క.)

**భృగువు** పరిమాణం, కొలత, రాసి (కో.) (రేపటికి భృగువు యావత్తూ తెలుస్తుందిగా) అని మాలపల్లి

**భేటి** సమావేశం (కావటం) కలుసుకొని సంప్రదించటం (కో,తె,ద,క.)

**భైరియత్** క్షేమం (తె.)

## మ

**మంకు** మూర్ఖం, మొండి (కో,క.)

**మంకుతనం** చూ. మంకు (కో,క.)

**మంకుపట్టు** మొండిపట్టు, తనపట్టు విడువనే గట్టితనం (కో,క.)

**మంగాకె** తెప్పించు (తె.)

**మంత్రి** మంగలి, క్షురకుడు (క.)

**మందడి** మదురు (క.)

**మందలించు** హెచ్చరించు, జాగ్రత్తగా ఉండవలసిందనిచెప్పు (కో,క,ద.)

**మందహాసం** మందసం, పెట్టె (రా.)

**మందాకు** మూలిక (క.)

**మందిబీడుగాఉన్నారు** జనసమ్మర్దం ఎక్కువగాఉంది (తె,ప్రకీర్ణ.)

**మంపు** మాంద్యము, మత్తు, ఒంటిపై తెలియనిస్థితి, స్పృహతప్పినస్థితి, అపస్మారకం, విషం పురుగులు మొదలైనవి కుట్టినపుడు కలిగే మైకం (క,కో.)

**మగుడుపెళ్ళి** మర్లపెళ్ళి (తె.)

**మగ్దూరు** కరాఖండితంగా (కో,తె.)

**మచ్చు** మాదిరి, నమూనా (కో,తె,ద.)

**మచ్చుమందు** మర్లుపుట్టించే మందు (కో.)

**మచ్చుచూడడం** రుచిచూడటానికి కొంచెం తీసి నోట్లో వేసుకోవడం (క.)

**మచ్చుపిట్టలు** ఎర, ఎరపక్షులు (కో.)

**మచ్చెలు** చేపలు (తె.)

**మజిలీ** విడిదిచోటు, విడిది, ప్రయాణం మధ్య విడిదిచేసేతావు (కో,క,ద.)

**మట్టసం** పొదుపు, దూబరలేకుండా (కో.)

**మట్టేయటం** కాలరాయటం (క.)

**మఠం** బాసెంపట్టు, బాసేపట్టు (క.)

**మఠంవేసుకొను** బాసెంపట్టు వేసుకొని కూచొను (క.)

**మడతకానుపు** ప్రసవించిన కొద్దిమాసాలకే మళ్ళీ చూలు నిలవడం (క.)

**మడికట్లు** దుక్కులు (క.)

**మడిచెక్క** పొలంలో ఒక చెక్క (క.)

**మడి** పొలం (కో,క,ద.)

**మడికట్టు** పొలంగట్టు (క.)

**మడుపులు** శుభ్రవస్త్రాలు, ఉతికిశుభ్రం, చేసినబట్టలు (క.)

**మతింపు** గౌరవం, మర్యాద, మన్నన, పరపతి (ద.)

**మదర్స** పాఠశాల (తె.)

**మదిని** వదిన (క.)

**మద్దతు** అండ, సహాయం, బలం, దన్ను (కో,క.)

**మద్దతుదారు** అండనిచ్చేవాడు, సహాయకుడు, ప్రోత్సాహకుడు (కో,క.)

**మనుగుడుపులు** మరులు పెండ్లివేడుకలు, అల్లెం (కో.)

**మనుబోతు** ఒకజాతి మగజింక (తె.)

**మనువు** పెళ్ళి, పెళ్ళిసంబంధం (కో,తె.)

**మనోమలిక** మనోమాలిన్యం, మనసులోని వైకల్యం (కో.)

**మన్నా** అడ్డు, ఆటంకం, నిర్బంధం, శిక్ష (క,తె.)

**మన్నెవాడు** హరిజనులలో 'మాల' అనే తెగకు చెందినవ్యక్తి (తె,ప్రకీర్ణ.)

**మన్యం** కొండప్రాంతం (కో,క.)

**మప్పటం** నేర్పటం, బోధించటం (కో,క.)

**మప్పితం** మర్యాద, గౌరవం, విధేయత, మాటనేర్పు (కో.)

**మమేకం** కలిసిపోవటం, ఒకటైపోవటం (కో,క.)

**మమ్మ** గాలివాన, (పడవలవాళ్ళమాట) (కో.)



**మయిడులు** మాయమాటలు, మభ్యపెట్టడాలు (కో.)

**మరమేకు** చుట్టూ అరలగీరలచీల, మొల (కో.)

**మరమ్మతు(త్తు)** బాగుచేయటం, పాడైన దానిని శుభ్రంచేయటం (కో.)

**మరిడి** మారి, సంహారదేవత (క,కో.)

**మరుమన్నపిల్ల** సవతి బిడ్డ (తె.)

**మరువన్నపిల్లలు** సవతి పిల్లలు (తె.)

**మలక** ఒకకొలత, చిక్కు, మెలిక (తె.)

**మలప** జగడాలమారి, మూర్ఖుడు, అవివేకి, కపటి, మలప గేదె మానెడు పాలిస్తుంది, మలప సన్యాసికి మాచకమ్మకు జత అని సామెతలు (కో,ద.)

**మలికితం** మప్పిదం (కో.)

**మలుగులు** పిరుదు కీలుభాగం (కో,ద.)

**మల్ల** చిప్ప, బొచ్చె (ద.)

**మల్లె** కలుపుమొక్క, పంటకుచీడ, ఎక్కువగా పొగాకుచేలల్లో పెరుగుతుంది, పువ్వు పుట్టగానే తెలుస్తుంది మల్లెయిందీ ఉల్లయిందీ అని సామెత (కో,ద.)

**మషాలీచి** కాగడా (కో,క,తె,ద,రా.)

**మసాలా** భోజన పదార్థాలలో వాడుకచేసే జీలకర్ర, మెంతులు, మిరియాలు మొ॥ సామగ్రి (కో,తె,ద,రా.)

**మసూ్కరు** తలారి (తె.)

**మస్తీ** పొగరు, గర్వం (తె.)

**మస్తు** అధికం, చాలా (తె,కో,ద,క.)

**మస్రూఫ్** నిమగ్నత (తె.)

**మహజబీ** మత సంబంధమైన (తె.)

**మహసూలు** కుప్పనూర్పిళ్ళు (కో,క.)

**మాంజా** గాలిపటానికి కట్టే దారం, (పదునుగా ఉంటుంది) (తె.)

**మాగిలి** తరిభూమి, మాగాణి (కో,ద.)

**మాణిక్యాలు** దీపం ప్రమిదలు (తె.)

**మాదుం** నల్లమందు, మత్తుమందు (కో.)

**మానుషం** పరువు, ప్రతిష్ఠ. (క.)

**మాపు** కమ్మి, లేకుండాచేయడం (కో,క.)

**మాయలమల్లి** మాయలమారి (క.)

**మారం/మారాం** గారాబం, మంకుతనం, గారాబంతో కూడిన పట్టుదల (కో.)

**మారుపుంత** వేరేదారి, ఇంకోదారి (కో.)

**మారుబొట్టు** మజ్జిగచుక్క, తోడుమజ్జిగ, తోడుచాలు (ద,కో.)

**మాలపున్నమ** భాద్రపదపూర్ణిమ (రా.)

**మాలు** సరుకు, వస్తుసామగ్రి (తె.)

**మావత్తు** మావటి, మావటీడు (క.)

**మాష్టిడి** సాము గరిడీల వాళ్ళు, సరిజద్దల వాళ్ళు (కో,క.)

**మాసూలు** వసూళ్ళు (క,కో.)

**మింటమిద్దె** ఆకాశసౌధం (క.)

**మిండలు** నలికండ్ల పాము (తె.)

**ముడిమిడిజ్ఞానం** సగమెరిక (కో,ద,తె.)

**మిడిసిపాటు** అతిశయం, గర్వం, అహంకారం (కో,క.)

**మిడుతూమిడుమా** కళ్ళు చికిలిస్తూ అల్లారుస్తూ (రా,కో.)

**మిత్తి** వడ్డీ (తె,ప్రకీర్ణ.)

**మిత్తివీయటం** వడ్డీకీయటం (తె.)

**మిరాశీ** వంశపారంపర్యహక్కు (కో,ద.)

**మిశ్రుపల్లాలు** ఎత్తుపల్లాలు, ఎగుడుదిగుళ్ళు (క.)

**మిసిరి, మిస్రి** పటిక పంచదార, కలకండ చక్కెర, పటికబెల్లం, కలకండ (తె,ప్రకీర్ణ.)

**ముంగర** అడ్డబాస, ముక్కర (తె.)

**ముంగల** ముందర, ముందు, ఎదుట (తె.)

**ముంగలి** చూ. ముంగల (తె.)

**ముంజూరు** ఇంటిముందు వసారాచూరు (క.)

**ముండ్లకోల** మునికోల, ములుకోలు (ద.)

**ముంతమామిడి** జీడిమామిడి చెట్టు (కో,క.)

**ముకద్దం** అభియోగం (తె.)

**ముక్తసరి/సరు** సంక్షేపంగా, టూకీగా (కో,ద,క,రా.)

**ముచ్చిగ** ఉయ్యాలపీట వంటిపలక (రా.)

**ముచ్చిలాక్కాలు** పొలంకౌలు ఒప్పందం (కో.)

**ముజరా** ముదరా, తగ్గింపు, మినహాయింపు (క.)

**ముడుకులు** చీలమండలు, పిక్కలు రెండు, మోకాళ్ళు వంచి కూచొని ఉన్న ప్పటి స్థితి (క.)

**ముత్తాడి** మూడుతాటిచెట్ల తరాలు చూసిన వాడు, మిక్కిలివృద్ధు, ముసలివాడు (కో.)

**ముత్తాళి** చూ. ముత్తాడి (కో.)

**ముత్తాళివాడు** చూ. ముత్తాళి (కో,క.)

**ముదరా** మినాహాయింపు (కో.)

**ముదలకింపు** సాకూతంగా ప్రశ్న, నిలదీయటం (కో,క.)

**ముదాము** అసలు (తె.)

**ముదుగు** ముతక, సున్నితంకాని, ముడి (కో,క.)

**ముదురుపాకం** అశ్లీలపు మాటలు (కో.)

**మునకాలుకర్ర** ముల్లుకర్ర (క.)

**మునాఫకు** కౌలుకు (తె.)

**మునికోల** ములుకోల, ములుగర్ర (కో,క.)

**మునియేడు** మొందటి సంవత్సరం, పోయినేడు, గతఏడాది (కో.)

**మురుకులు** జంతికలు (తె.)

**ముర్గి** కోడి (తె.)

**ముర్దారు** అపవిత్రం (తె,కో.)

**ములకుగిరి** అతిశయం, స్థానికబలం (ద.)

**ముల్కి** దేశం (తె.)

**ముల్జిమాన్** నేరస్తులు (తె.)

**ముసాఫిర్లు** యాత్రికులు (తె,ద,కో.)

**ముసిడి** ముష్టిచెట్టు (కో,క.)

**ముస్తాబు** అలంకరణ, సొగసు దిద్దుకోవటం (కో,ద,తె,క.)

**మూకుడు** బాణలి, భాండి (క,తె.)

**మూ** నోరు, మూతి (తె.)

**మూలగొట్టుమాట** మారుమూల పదం (తె,ప్రకీర్ణ.)

**మూలగ** ఎముకసారం (కో,క.)

**మెకాలు** మృగాలు (తె.)

**మెట్ట** కొప్పు, జుట్టుముడి (ద,క.)

**మెట్టవేదాంతం** పనికిరానిది, ప్రయోజనం లేనిది, పెదవులపైనుంచి మాత్రమే వెలువడేది (కో,క.)

**మెట్టుకు** చివరకు, పర్యవసానానికి (తె,ద, కో,క.)

**మెడపట్టీ** గొంతుకిపట్టి ముందువేలాడే పట్టీ, (న్యాయవాదులు మొదలైనవారి చిహ్నం)(కో,క.)



**మెడ్డివేయడం** తోసివేయడం, కాదనడం, నిరాకరించడం (క.)

**మెడ్డడం** కాళ్ళు నేలను తన్నిపట్టటం, కాదని గింజుకోవడం, తిరస్కరించడం (క.)

**మెడ్డెయ్యి** తోసెయ్యి, నిరాకరించు (క.)

**మెడ్డేయడం** ఆటంకపరచడం, నిరోధించడం (క.)

**మెడ్డేస్తావా?** తిరస్కరిస్తావా? ధిక్కరిస్తావా? (క.)

**మెత్త** దిండు, తలగడ (తె,క.)

**మెరవణి** తిరణాల, ఉత్సవం (ద.) జాతర (రా.)

**మెలత** కరణీకం (క.)

**మెల్లా** ఇంటి ఖాళీప్రదేశం, ఎగువప్రదేశం (ద.)

**మెహర్బానీ** అనుగ్రహం, దయ (తె.)

**మేలా** ఉత్సవం, తిరణాల, అశేష జన సందోహ తీర్థయాత్రస్థలి (కో,ద,క.)

**మెకం** మత్తు, అపస్మారకస్థితి (తె.)

**మొకరరు** నిర్ణయం (తె,ప్రకీర్ణ,ద.)

**మొక్కపొట్టలు** మొక్కజొన్నపొత్తులు (తె.,ప్రకీర్ణ.)

**మొక్కబుట్టలు** చూ. మొక్కపొట్టలు (తె.)

**మొక్కులపండుగ** సంక్రాంతి (రా.)

**మొగ** మొదలు, ప్రారంభం (క,కో,తె.) ముందు, బండినొగలు (క.)

**మొగదల** చేరువ, సమీపం, ముందర, ఆది, మొదలు, ప్రారంభం (కో,ద.)

**మొగదాళ్ళు** ముకుదాళ్ళు (కో,క.)

**మొగులు** మబ్బు, మేఘం (తె.)

**మొగ్గం** మగ్గం (తె.)

**మొబ్బతు** అనురాగం, ప్రేమ (తె.)

**మొరంగడ్డ** కందగడ్డ, చిలగడదుంప (తె.)

**మొరాయించడం** మొండికేయడం(కో,క.) విముఖతచూపడం (కో,క.)

**మొల** మేకు (కో,తె.)

**మొలజాల** మొలసంచి (క.)

**మొహరం** స్తంభం (కో,క.)

**మోంబత్తులు** కొవ్వొత్తులు (తె.)

**మోఖా** పెద్దసంతర్పణ (తె,ప్రకీర్ణ.)

**మోజా** విరిగిపడే సముద్రకెరటం (క.)

**మోట** ఎద్దులనుకట్టి నీరుతోడే ఏర్పాటు (కో,తె.)

**మోడీవిద్య** కనికట్టు, గారడీ (క.)

**మోతుబరి** పెద్దరైతు, పలుకుబడికలవాడు (కో,క,ద.)

**మోద** రెండువందల ఆకులుగల తమల పాకులకట్ట (కో.)

**మోపు** ఎక్కువ, అధికం, అతిశయం (కో.)

**మోయిను** పరిమాణం, కొలత (కో,ద,తె.)

**మోయిన్లు** తమఇంటభోజనాలు చేయటానికి వీల్లేని సందర్భాలలో ఇతర కులస్తులకూ గ్రామంలో వారు పంపే పప్పు ఉప్పు చింతపండు సంభారం (కో.)

**మోరీ** మురికినీరు పోయే గుంట (తె.)

## య

**యజమాని** భర్త, ఇంటాయన (క.)

**యతుబారీ** పూర్తినమ్మకం, యధేచ్ఛగా (కో.)

**యదాన** ముఖాన (క.)

**యసల** పిడత (తె, ప్రకీర్ణ.)

**యకవల** చూ. యాకావల (క.)

**యాకావల** వేకువ, తెల్లవారుఝామున (క.)

**యాడికి** ఎక్కడికి (తె, ప్రకీర్ణ.)

**యాద(ది)** జ్ఞాపకం (కో, తె.)

**యానాం** సముద్రం (క.)

**యానాపొడు** చెలియలికట్ట, సముద్రపుఒడ్డు (క.)

**యాయవారం** యాచన (కో.)

**యారాలు** తోటికోడలు (తె.) సవతి (క.)

**యావన్మంది** ఇంటిల్లిపాది, అందరు, అందరూనూ (కో, క.)

**యాష్ట** విసుగు, వేసట, వేదన, కష్టం (తె, ద.)

**యింగలం** నిప్పు (తె.)

**యింతెల్లం** ఇంతతొందరగా (తె.)

**యిడువులు** ఇడుములు, కష్టాలు (తె.)

**యినాము** కానుక, బహుమతి (తె.)

**యిస్తాళ్ళు** విస్తరంటలు. విస్తళ్ళు (తె.)

**యుద్ధపుంజు** కలహశీలి, దెబ్బలాటలకు ముందుండే వాడు (క.)

**యెగర్తించడం** ధిక్కరించడం (కో.)

**యెచ్చరాయితనం** హెచ్చరించే లక్షణం, బెదిరించేగుణం (కో.)

**యెట్టగొట్టు** దొంగనాణేలు తయారుచేయు (ద.)

**యెదపెట్టు** విత్తనాలు చల్లు (కో, తె.)

**యెర్రగా** కోపంగా (తె.)

**యెర్రమసి** యెర్రసిరా (రా.)

**యేతంపెట్టు** ఏతం తొక్కినట్లుగా (కో.)

**యోగం** మంచి ముహూర్తం, శుభశకునం (క.)

## ర

**రంగం** రంగూను (కో, క, ద.)

**రంజస్సు** గొడవ, ఆగడం, వివాదం, కోలాహలం, రజ్ఞు (కో.)

**రంధి** చింత, బాధ, బాధ్యత, అభిలాష, కోరిక, కామన (కో, క.)

**రఖమ్** డబ్బు, రొక్కం (తె.)

**రభస** కోలాహలం, గొడవ, దెబ్బలాట, కలహం

**రయిక** రవిక (తె.)

**రస్తా** దారి (తె, కో.)

**రహితం(కావటం)** నిశ్చయంకావడం (కో, క.)

**రాజాంగం** చాలా సంపదతో (కో.)

**రాట** పశువులకట్టు కొయ్య, గుంజ (క.)

**రాయితీ** నమ్మకం, గురి, విశ్వాసం (రా.) మినాహాయింపు (కో, ద.)



**రాళ్ళగెడ్డ** రాళ్ళవాగు (క.)

**రావణాసురుడి మీసాలు** సముద్రతీరంలో మొలిచే వెదురుజాతిసంబంధమైన కంప, ఈ కంప మట్టల చివరసూదుల్లాగా కోసుతేలిఉంటాయి (కో.)

**రిక్కపెట్టటం** నిక్కపొటవడం (క.)

**రిక్కపెట్టి** నిక్కపొడుచుకొని (క.)

**రివాజు** సంప్రదాయం, ఆచారం, అలవాటు (కో, క.) వాడుక, పద్ధతి, తీరు, ధోరణి (ద, రా.)

**రిసరిస** రుసరుస (క.)

**రిహా** వదిలివేయటం (తె.)

**రీవాజు** ఆనవాయితీ (తె.)

**రుకాయించు** ఆటంకపరచు, అపివేయు (తె.)

**రుక్కా** చిన్నచీటి, చిన్నలేఖ, రెండుమూడు వాక్యాలుమాత్రమే వుండేచీటి (కో.)

**రువ్వ** బెత్తం, బరికె (క.)

**రువ్వటం** హోరుమని గాలివీచటం (క.)

**రెట్ట** దండ, భుజం (కో, రా, తె.)

**రెట్టకాయలు** కుంకుడుకాయలు (క.)

**రెడ్డిగం** బాసెంపట్టు (క, కో.)

**రేక** తాటాకుబొక్కెన (క.)

**రేజా** వృథా, వ్యర్థం (కో.)

**రేడియోసినిమా** టెలివిజన్ (తె.)

**రేగ్లాడి** రైలుబండి (తె.)

**రేవటి** రేగటి (క.)

**రైకకన్ను** రవికగుడ్డ (తె.)

**రైగప్పడం** విజృంభించు, ఎగయు (కో.)

**రొంగులుబొడవడం** మొట్టడం (తె.)

**రొంత** కుసింత, కొంచెం (క.)

**రొంప** జలుబు, శైత్యం (కో, ద.)

**రొంపిదుక్కి** నీళ్లగట్టి అడుసుదున్నటం (ద.) కటకట (క.)

**రొఖాయించడం** అడ్డంరావడం, అపుజేయడం అటకాయించడం (తె, ప్రకీర్ణ.)

**రొజ** ఈదురుగాలి, చలిగాలి (క.)

**రొజ్జగాలి** చూ. రొజ్జ (క.)

**రొ(టొ)ట్టి** పుట్టివంటి జలయానసాధనం (కో, రా.)

**రొడ్డ** చూ. రొడ్డు (క.)

**రొడ్డు** ఎండిపోయిన ఆకూ అలమూ (క.)

**రొప్పడం** తరమడం, తరిమిపట్టుకునేయత్నం (క.) వేటాడటం, ఆదిలించడం, తోలడం, కారం వల్ల నోరుమండిపోగా ఉఫ్ఉఫ్మనటం (కో.)

**రొప్పుడు** వేట, పశువులను మందగా తోలడం (క.)

**రొయ్యి** నుసి, పొగచుట్ట తాలుకునుసి (క.)

**రోజ్నామ్చా** దినచర్యపుస్తకం (తె.)

**రోలంగి** రోడ్డురోలరు (క.)

**రోశిని** వెలుగు, వెల్తురు, దీపం (తె.)

**రాలీ (ర్యాలీ)** ఊరేగింపు ప్రదర్శన (కో, ద, తె, రా, క.)

## ల

**లంఖణాలబోటు** అతినెమ్మదిగా సాగేపడవ (కో.)

**లంగరు** సైనికవిడిది, సైనికశాల (తె.)

**లంటుకులంటు** చాలాలావుగా (తె.)

**లండాచోరీ** అనవసరమైనఇరకాటం, ఇబ్బంది (క.)

**లంపోడు** పనికిమాలినవాడు, నిష్ప్రయోజకుడు (తె,ప్రకీర్ణ.)

**లకోటా** కవరు, లిఫాఫా (క,కో.)

**లగాం** కళ్ళెం (కో,క,రా.)

**లగాయించు** తగిలించు (తె.) పరిగెత్తు, వేగంగా వ్యవహారం నిర్వహించు (కో.)

**లగ్గం** పెండ్లిముహూర్తం, పెండ్లిరోజు, పెండ్లి (తె.)

**లగ్గపోలు** లగ్నానికిముందు శుభప్రారంభ సూచనగా పెట్టేపోలు (తె.)

**లగ్తీ** లంకె, జోడీ (రా.)

**లట్టాలు** చిక్కులు, సంకటపరిస్థితులు (కో.)

**లపుక్కున** క్షణంలో, గబుక్కున, చప్పున, దబ్బున (క.)

**లబ్జులు** టక్కులు, వేషాలు, టక్కరి చేష్టలు (కో.)

**లబ్బలు** చొంగలు (కో,క.)

**లయప్పిక్కట్టు** ప్రధానమైనఅంశం (కో.)

**లస్కరు** భోజనశాల, సైనికస్థావరం (తె.)

**లాకదబ్బ** వెదురుదబ్బ (తె.)

**లాకలకట్ట** పడుగులో అక్కడక్కడ చొప్పించే వెదురుబద్ద, పక్షిఈక, రెక్క, మొక్క (తె.)

**లాకలూకాయ** పనికిమాలినవ్యక్తి, వ్యర్థవిషయం, నిష్ప్రయోజనమైన, దాంభికమైన, వ్యర్థమైన (కో.)

**లాకలూకాయలు** అనామకులు, వ్యర్థులు, నిష్ప్రయోజకులు (కో.)

**లాకుజారీ** పూర్వపు రెవెన్యూవిధానంలో ఒకతరగతికిచెందిన భూములు (ద,కో.)

**లాఠీమేరపొద్దు** బారెడుపొద్దు (క.)

**లాతు** తన్ను (తె,ప్రకీర్ణ.)

**లాయకి** కూడివచ్చు, కలిసివచ్చు, ప్రయోజనకరమగు (కో,తె.)

**లాయకు** చూ. లాయకి (కో.)

**లాయిలాసా** వ్యర్థప్రయాస, అనవసరమైన శ్రమ (కో.)

**లావు** ఎక్కువ, ఆధిక్యం (క.)

**లాష్** శవం, మృతశరీరం (తె.)

**లిగాడు** శంక, సందేహం, హెచ్చుతచ్చుల పదబంధంలోని తచ్చుఅర్థం (కో,క.)

**లిద్ది** పెద్దదైన ఇరుసురంధ్రానికి చదరవు కొయ్యబిళ్ళకొట్టి, మళ్లీ ఉలవాయబిగించటం (ద.)

**లుగసానా** నష్టం, శ్రమ (కో,తె.)

**లుటాయించటం** కాజేయడం, ఎగతన్నుకపోవడం (క.)

**లెస్స** భేష్; బాగు (తె.)

**లేవిడి** పరిహాసం, ఎగతాళి, గేలి (కో,క.)

**లొంగు** లోకువగు, వశపడు (తె,కో.)

**లొక్కడు** తీసిపోడు, తక్కువకాడు (కో.)

**లొచ్చు** హీనం, తక్కువ, న్యూనత (కో.)

**లొజ్జు** తీసికట్టు, నాసి, తగ్గిఉండడం, వెలితి (కో.)

**లొట్టిపిట్ట** లొటిపిట, ఒంటె (కో,క.)

**లొట్టె(ట్టి)** చెట్టుకుకట్టిన కల్లుకుండ (తె,కో.)



**లొడితెడు** వేలెడు (కో.)

**లొల్లాయిపదాలు** లల్లాయిపదాలు, కూనలమ్మపదాలు (కో.)

**లొల్లి** అల్లరి, గలభా (తె.)

**లొల్లిపెట్టటం** గొడవచేయటం, అధికమైన అల్లరిచేయటం (తె.)

**లొల్లకు** వాగకు, వాగవద్దు (క.)

**లోకాభిరామాయణం** పొద్దుపోకకు వేసుకొన్న ముచ్చట, లోకరీతి, లోకంనడుస్తున్న తీరు, లోకంపొకడ (కో.)

**లోగడి** లోగడ, ఇదివరకటి, గడచిన, పోయిన (ద.)

**లోపాయికారీ** రహస్యంగా కుదుర్చుకున్న, రహస్యంగా ఒడంబడిన, గుట్టుమట్టు (కో.)

**లోపుచేసుకోవటం** లోబరచుకోవటం (కో.)

**లోవ** లోయ (క.) చిత్తడిభూమి (కో.)

# వ

**వకాలతు** న్యాయవాదికి వాదించటానికిగాను అప్పజెప్పే వ్యవహారం (కో,తె,క.)

**వక్కచూర** వక్కపొడి (కో.)

**వక్తు** సమయం (తె.)

**వగదెగి** పూర్తిఅయి, ముగింపుకువచ్చి, ముగిసి (కో.)

**వగరుచ్చ** రొజు, రొప్పు, అతి ప్రయత్నం మీద ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నిర్వహించు (కో,తె.)

**వగర్పు** గుండెదడ, ఆయాసం (కో,తె.)

**వట్టం** తరుగు, లోపం, వెత్తి (క.)

**వట్టలుపడేట్లుకొట్టడం** దద్దుర్లులేచేట్లు కొట్టడం (తె,ప్రకీర్ణ.)

**వడగాలిదెబ్బలు** వడగండ్లదెబ్బలు (క.)

**వడసారం** లేత, పసివయస్సుకుచెందిన (తె,ప్రకీర్ణ.) (కో,క.)

**వడ్నింపటం** గర్భాధానం (తె.)

**వంటచెరకు** వంటకుపయోగించే కట్టెపుల్లలు (కో.)

**వంటపుట్టి** వంటమనిషి, వంటలక్క (కో,క.)

**వతను** రాబడి (కో,తె,ప్రకీర్ణ.)

**వతు** వలె, లాగా (కో,ద.)

**వదరటం** వాగటం, ఎక్కువగా మాట్లాడటం (కో,క.)

**వద్దీ** అంగీకారపత్రం, సమ్మతి (కో,తె,క.)

**వద్దే** మిక్కిలి సమృద్ధిగా, చాలా ఎక్కువగా (కో.)

**వనొర్సలు** యజమానులు (తె.)

**వందమూడుటోళీలు** ఎగతాళిచేయడం, నవ్వులుపుట్టించడం, నిర్లక్ష్యం, అపహాస్యం చేయడం, (క.)

**వన్నెవేయటం** రంగువేయటం (తె.)

**వయి** పుస్తకం, పొస్తకం (తె,ప్రకీర్ణ.)

**వరక** ఎగుడుప్రదేశం, దూరపుమలుపు (క.)

**వరడ/వరడు** ముసలినక్క (క.)

**వరళ్ళు** నక్కగుంపు (క.)

**వరదక్షిణ** వరకట్నం (తె.)

**వరవ** ప్రవాహం (కో,క.)

**వరవదారి** పారుదల ప్రాంతం (కో,క.)

**వరుంబడి** రాబడి, ఆదాయము, ఆయము (కో.)

**వరువు** కరువు, దుర్భిక్షం (క.)

**వర్ధంతి** ఎవరైనా మహాపురుషుల, సంస్కర్తల, దేశనాయకుల మృతి స్మృత్యర్థం జరుపుకొనే సంస్మరణం (కో,ద,రా,క,తె.)

**వగ్ర** కారం (క.)

**వలం** స్థూలం, లావు, దొడ్డు, బలం (క.)

**వలంపటి** వెదురులో ఒకరకం, ఒకరకం వెదురుబొంగు (క.)

**వలపక్షం** పక్షపాతం (కో,క,ద.)

**వలపట** కుడివైపు (కో,క,ద.)

**వలపోత** తలపోత, ఆవేదన (తె,కో.)

**వల్లకపోవు** వద్దను, అంగీకరించకపోవు (తె.)

**వల్లు** శకునంకా లేదు (తె,ప్రకీర్ణ.)

**వషట్కారం** చీవాట్లు పెట్టటం, మందలించటం (కో.)

**వాకపండ్లు** వాక్కలెక్కాయలు (క.)

**వాఖయా** సంగతి, విషయం (తె.)

**వాజమ్మ** వ్యర్థుడు, పనికిమాలినవాడు, చవట, దద్దమ్మ, అసమర్థుడు (కో,క,ద.)

**వాజిమి** సబబు, సరిపోవు (తె,రా.)

**వాడ** ఓడ (ద,క.)

**వాడకట్టు** వీధి (కో,తె.)

**వాణీ** ఓణీ, ఉత్తరీయం, పురుషులు ధరించే వల్లెవాటు (క.)

**వాతప్రోతంగా** సునాయాసంగా, శ్రమ లేకుండా

**వానకోయిల** పాటలుపాడే పిట్ట (క.)

**వాపస్** తీసుకున్న దానిని వెనక్కు ఇచ్చు, తిరిగి ఇచ్చివేయు (కో,తె,క,రా.)

**వాపస్‌రావడం** తిరిగిరావడం (రా.)

**వాయాడి** వదరుబోతు (ద.)

**వాయి** ఓయి (తె,ప్రకీర్ణ.)

**వాయిద** వాగ్దానం (తె.)

**వారడ** తేడా, అంతరం, వ్యత్యాసం, వార (క.)

**వాలకం** ఉత్సవాలు, తిరుణాళ్ళలో వేసేవేషం (క.)

**వాలగ** వాలుగ, పొడుగుతోక గల ఒకరకం చేప (కో,ద.)

**వాసి** అంతరం, ప్రశస్తి, తేడా, హస్తవాసి మొ॥ ప్రఖ్యాతి (కో,క,ద.)

**వాహలాత్ల** అదుపులో, అజమాయిషీకింద (తె.)

**విజోడు** జోడుకుదరని, విడివడిన (క.)

**వినాయించు** మినహాయించు, వదిలివేయు (కో.)

**వినాయింపు** మినహాయింపు (కో,ద.)

**వినికిళ్ళు** చెప్పుడుమాటలు, కేవలం వినుకలి వల్లనే తెలిసినవి (కో,రా.)

**విప్పన్నం** విస్పష్టంగా, పూర్తిగా, (కో.)

**విలాతి** విజాతి (క.)

**వీగిపోవటం** ఓడిపోవడం, పరాజయం పొందటం (కో,క,ద,రా.)

**వీటిసాని** దొమ్మరాటలు ప్రదర్శించే స్త్రీ (క.)

**వీరకత్తె** వియ్యపురాలు (క.)

**వీరకాడు** వియ్యంకుడు (క.)

**వుండ్రాళ్ళు** బియ్యపురవ్వ, శెనగపప్పు మొదలైనవాటితో చేసే కుడుములు

**వుంబళి** ఈనాము, సర్వకర పరిహార భోగ్యమైన గ్రామదానం (ద.)

**వుక్కరోశం** ఉక్రోషం, అనుచిత కోపోద్రేకం (కో.)

**వుడ్డూలం** విపరీతం, విడ్డూరం (కో.)

**వుబిరీ** హెచ్చు, అధికం (కో.)



**వుయ్యు** పూన్చు (క.)

**వూసి** పూన్చి (క.)

**వుసలాయింపు** తీరిక, కాలుకూడదీసుకోవటం (క.)

**వుసుక** ఇసుక, ఇసక, (తె,ప్రకీర్ణ.)

**వూళ** కేక, అరుపు (క.)

**వెంకులాడటం** వెదకటం (తె,ప్రకీర్ణ.)

**వెచ్చగొట్టటం** వేడిచేయడం, వెచ్చచేయడం (కో.)

**వెట్టి** క్షురకుడు, మంగలి (క.)

**వెదురుకంజి** వెదురు మొలక, రెమ్మ (క.)

**వెన్నెలకుప్ప** వెన్నెలలో బాలబాలికలాడే ఆట (కో,క )

**వెఱ్రికుట్టి/వెఱ్రికుట్టు** జడుడు, మందుడు బుద్ధిహీనుడు, అవివేకి (కో,క.)

**వెరబొమ్మ** దిష్టిబొమ్మ (క.)

**వెసులు** తీరిక, అవకాశం (కో,క.)

**వేగిరం** తొందరగా, త్వరగా (క.)

**వేగుళ్ళు** వేవిళ్ళు (క.)

**వేగుళ్ళు వెలక్కాయలు** గర్భవతుల వేవిళ్ళకుగాను చేసే తీపి పిండివంటలు, రస్కోరా ఉండలు, వేగుళ్ళ వెలక్కాయలు, చూలింత చుట్లు అని నుడికారం, చూలింత చుట్లు, అంటే చక్కిలాలు (క.)

**వేరుపనస** భూమిలో కాయలు కాసే పనసజాతి (క,కో.)

**వేళంబం** లంపటం, వేడబం (కో.)

**వేవిలిచేను** ధనంపంట (కో.)

**వేసరిక** మొగంమొత్తడం, అనిష్టత, అప్రీతి (రా,కో.)

**వైనం** ఒప్పిదం, అమరిక, కుదిరిక, (రా, కో.)

**వేలుదారు** బేలుదారు (రా.)

**వొంటించటం** కుదర్చటం (తె,ప్రకీర్ణ.)

**వొంత** వొండుమట్టి (క.)

**వొండలు** చూ. నొండ (క.)

**వొడిసిపోవడం** అయిపోవడం (తె,ప్రకీర్ణ.)

**వొయ్యి** పొస్తకం, పుస్తకం (తె,ప్రకీర్ణ.)

**వొరక** కొండచరియ, ఏటవాలు ప్రాంతం (క.)

**వొరకదారి** కనుమదారి (క.)

**వొర్లటం** గట్టిగా మాట్లాడటం, బిగ్గరగా అరవటం (తె,ప్రకీర్ణ.)

**వొర్లుడు**వాగుడు, వదరుబోతుతనం (తె.)

**వోకలేక** దగ్గలేక ఏమీ చెయ్యలేక (కో,క.)

**వోడు** లోపం, లోటు, వెలితి (కో,క.)

**వోడించుకొనిరా** భోజనానికి వస్తానని అనిపించుకొనిరా (తె,ప్రకీర్ణ.)

**వ్యక్తురాలు** పెద్దమనిషి అయిన పిల్ల (కో.)

**వ్యాపకం** వ్యాసంగం, పని, వ్యావృత్తి (కో, క.)

**వ్రాయిక** వ్యాసం, రచన (క.)

## శ

**శక్తిపట్టటం** భూతావేశం, దయ్యంపట్టటం (ద, రా.)

**శక్రం** చక్రం (తె.)

**శతమానం** తాళిబొట్టు, మంగళసూత్రం (కో.)

**శరీకు** కలిసిపోవు, మద్దత్తు ప్రకటించు (తె.

**శర్తుచేయు** పందెంకాయు (తె.)

**శలవు** ఖర్చు (ద.)

**శలవుచేయు** వ్యయంచేయు, ఖర్చుపెట్టు (ద.)

**శాగ** చేవ (ద.)

**శాణతనం** గడసరితనం, జాణతనం, నేర్పు (తె,కో.)

**శాణం** బేడఎత్తు మందు (కో.)

**శాన్** బడాయి, పటాటోపం (తె.)

**శాన్‌చేయు** బడాయికొట్టు, అతిశయం ప్రకటించు (తె.)

**శానతనం** ఆధిక్యత (తె.)

**శాపనాకారాలు** శాపనార్థాలు (క.)

**శారెడు** చారెడు (తె.)

**శాస** పారాణి (తె,ప్రకీర్ణ.)

**శింగు** చెంగు (తె.)

**శికారి** వేటకాడు (క.)

**శిట్టశిట్ట** తొందరతొందర (తె.)

**శిరోభారం** జలుబు, తలనొప్పి (కో.)

**శిలుకొయ్య** చిలక్కొయ్య (తె.)

**శివాలు** చిందులు, చిందులుతొక్కే ఆవేశం (కో,క,ద.)

**శిష్టుకరణాలు** కళింగాంధ్రంలోని ఒకకులం ముసద్దీలు, వ్రాతగాండ్రు (క.)

**శీటికొట్టు** ఈలవేయు (తె.)

**శురు/శురువు** ప్రారంభం, మొదలుపెట్టటం

**శెల్క** జీబురుమంట (తె.)

**శేఖరం(చేయడం)** పోగుచేయడం, ధాన్యాదులు కుప్పలుగా నిలువచేయడం (ద.)

**శైత్యం** జలుబు, పడిశం (క.)

**శోభనంగర్భాధానం** (కో.)

**శేకోత్తపుకాయ** పంపర పనసకాయ (తె, ప్రకీర్ణ.)

## ష

**షరతు** పందెం (కో,క.)

**షలాకు** శలాకా (క.)

**షికాయతు** ఫిర్యాదు, నిందారోపణ (తె.)

**షుక్రియా** కృతజ్ఞత వెల్లడించే మాట (తె.)

**షుబా** అనుమానం (తె.)

**షోలంగిముచ్చు** పోకిరి, అల్లరి చిల్లరి వ్యక్తి (క.)

## స

**సంక్రామకవ్యాధి** సామూహికవ్యాధి, అంటువ్యాధి (రా,కో.)

**సంగం** సంఘం (తె.)

**సంగిడి** కసరత్తుచేసే సాధనం (క.)

**సంగిడి పొడవడం** సంగిడి అనే సాధనం గానుగరాయి ఆకారంగా ఉంటుంది. మధ్యన పట్టుకోవటానికి దొలిచిఉంటుంది. సాముగరడీలు చేయటానికి పనికివచ్చే సాధనం (క.)



**సంగోరు** సగభాగం, సగం (క,కో,తె.)

**సంజాయించు** గ్రహించు, అర్థంచేసుకొను (తె.)

**సందు**[1] అవకాశం (కో.)

**సందు**[2] నుంచి, వ్యవధానార్థకపదం (తె.)

**సందెడు** వాటేసుకొనడానికి తగినప్రమాణం (క.)

**సంబరువు** దినుసు, పదార్థం (రా,ద,కో.)

**సంబళం** రాబడి, నెలజీతం (క,ద.)

**సంబారాలు** వస్తుసామాగ్రి (క.)

**సంభావన** దక్షిణ, కట్నం (కో,తె.)

**సంసారి** రైతులు, వ్యవసాయపనులుచేసే అన్నికులాలకుచెందిన వ్యక్తి (కో.)

**సంసార్లు** కాపులు, వ్యవసాయికులు (కో,ద.)

**సకిలం** చకిలం (తె.)

**సక్కలిగిలి** చక్కలిగిలి (తె.)

**సజావు** సూటి, సక్రమం, తగిన, ఉచితం (కో,క,ద.)

**సజ్జరొట్టెలు** తప్పేలచెక్కలు (రా.)

**సడక్** రోడ్డు, బాట, మార్గం (తె.)

**సడక్కు** చూ. సడక్ (ద.)

**సత్తుపిండి** పేలాలపిండి (తె.)

**సత్తువ** శక్తి, బలం, సామర్థ్యం (కో,తె.)

**సత్తెనాశ్** సర్వనాశనం (తె.)

**సదావర్తి** సత్రం, మఠం, మొదలైనచోట్ల భోజనంచేయటానికి యాత్రికులకిచ్చే చీటి, అనుమతిపత్రం (కో,ద.)

**సదావృత్తి** చూ. సదావర్తి, భోజనం ఉచితంగా పెట్టే ఏర్పాటు, ఇందు నిమిత్తం ఇచ్చేచీటి మొదలైనవి (క,ద.)

**సదును** చదును, సమమట్టం (కో,క,తె.)

**సనుగు** ప్రతి (తె,ప్రకీర్ణ.)

**సన్నవిడి** సన్ననిస్వరం, మంద్రస్వరం (కో.)

**సన్నసన్నగా** నెమ్మది నెమ్మదిగా, మెల్ల మెల్లగా (కో,క.)

**సన్నికల్లు** గుండ్రాయి (కో,తె.) రుబ్బురోలు (తె.)

**సన్నెకల్లు** చూ. సన్నికల్లు (కో.)

**సన్నెగంటి** (సరసాలు) సానుల సరసాలు, విలాసవేషాలు (క.)

**సప్పగ** చప్పగా (తె,కో.)

**సప్పచెముడు** నాగజెముడు (క.)

**సప్పుడు** చప్పుడు (తె.)

**సప్లయి** సరఫరా (కో,రా,తె.) పంపిణి (ద,క.)

**సబబు** క్రమము, సరిఅయినతీరు (కో,క,తె.) సరియైనరీతి (ద.)

**సబవు** చూ. సబబు (కో,క.)

**సబేరీగది** వస్త్రాలు భద్రపరచేగది, వస్త్రభాండారం (ద.)

**సబోరీ** నమ్మించడం, నచ్చపల్కటం (కో.)

**సబోరీమాటలు** నమ్మించే మాటలు (కో.)

**సమజాయించు** అవగాహన అగునట్లు చెప్పు, అర్థమయ్యేట్లు చెప్పు (తె.)

**సమందం** సంబంధం (తె.)

**సమజ్ (కావటం)** అర్థంకావటం, విషయం తెలియటం (తె.)

**సమావర్తనం** పెళ్ళికి పూర్వాంగంగా జరిగే స్నాతకం (రా.)

**సముర్త** దాలిక రజస్వల కావటం, సమర్త (తె.)

**సమేతూ** సహితం (కో.)

**సయించడం** సహించడం, ఓర్పువహించడం (క.) ఆహారపదార్థలు నోటికి రుచించటం (కో.)

**సయోద్ది** సయోధ్య, సమరసభావం (కో,తె, క.)

**సరంబీ** ఇంటికప్పుకు లోపలిభాగం (కో.)

**సరాసరి** సగటు (కో,ద,తె,రా,క.) నేరుగా, సూటిగా (కో.)

**సరిబద్దలు** వింటిబద్దలు (క.)

**సరువ** పాత్ర (తె,ప్రకీర్ణ.)

**సర్కారు** ప్రభుత్వం, అధికారం, గవర్నమెంటు (తె.)

**సర్భా** దోపిడి, దొంగతనం (తె.)

**సర్ది** రొంపు, జలుబు, శైత్యం (తె,ప్రకీర్ణ.)

**సర్వదుంబాలా** సర్వనాశనం, చెల్లా చెదరు, కకావికలు (క.)

**సర్వెడు** పరిమాణార్థకం, (కడివెడులాగా) సరవనిండుగా (తె.)

**సర్సర** మిక్కిలి వేగంగా, తొందర తొందరగా, చరచర (తె.)

**సలుపు** ఒళ్ళునొప్పి పుట్టడం, ఒళ్ళుతీపులు (కో.)

**సల్తను** పరివారం, పటాటోపం, వస్తువాహన పరివారం (ద.)

**సల్ది** చద్ది (తె.)

**సల్ల** మజ్జిగ, చల్ల (తె.)

**సవారికచ్చడం** ఎద్దుబండి, సుఖప్రయాణానికి హంగుచేసినది (తె.)

**సవాలక్ష** మిక్కిలిఎక్కువ, అధికసంఖ్య, మహా భారతమంత అని చెప్పటానికి ప్రయుక్తం (కో,క,తె,ద,రా.)

**ససేమిరా** పూర్తిగా, బొత్తిగా, సర్వానంగీకార సూచక ముఖచేష్ట (కో,క,రా.)

**సాగదోలు** సాగనంపు (తె.)

**సాగిలపడు** సాష్టాంగా నమస్కరించు, బోర్లపడి మొక్కు (క.)

**సాగువళీ** సాగుబడి, వ్యవసాయ భూముల పరిమితి (రా.)

**సాతచేయించడం** గుడ్డలు చలవచేయించడం (తె,ప్రకీర్ణ.)

**సాదాసీదా** సక్రమం, సరిఅయిన (క.)

**సాదరు** పప్పు ఉప్పు చింతపండు మొ॥ వస్తువులు (తె,కో.)

**సాధీ** జట్టు, జతకాడు, నేస్తం, స్నేహితుడు (క,తె.)

**సాసు** జాగు, ఆలస్యం, విలంబన (తె.)

**సానుపుచల్లడం** కళ్ళాపు చల్లడం (తె, ప్రకీర్ణ.)

**సాన్పు** అలుకు, కళాపు (తె.)

**సాపరాళ్ళు** చాపరాళ్ళు, నాపరాళ్ళు (క.)

**సాపు** శుభ్రం, సూటిగా, సక్రమంగా, వడిదుడుకూలేమీ లేకుండా (తె.)

**సాయించు** ప్రకటించు, బోధించు, ఇష్టము, ప్రీతి, ఆహారాది పదార్థాలు రుచించు (కో,రా, ద,తె.)



**సాయితా** సహాయం, అండ (కో.)

**సాయిదుపెట్టి** సాదుఉండే చిన్న పెట్టె, చుక్కబొట్టు నించిన గిన్నె (తె.)

**సారటు** గుర్రపు బగ్గీ (కో,క,ద.)

**సార్థా** సర్దుబాటు, ప్రయత్నసాఫల్యం, లభ్యత (క.)

**సాలతు** అవకాశం, సమయం, సందర్భం (తె.)

**సాలు** సంవత్సరం (కో,క,తె.)

**సాలెం** అన్నీ (తె,ప్రకీర్ణ.)

**సాలె** బరి, భావమరిది (తె,ప్రకీర్ణ.)

**సావకాశం** నింపాదిగా, నెమ్మదిగా, ఏమీ తొందర లేకుండా, నిదానంగా (కో,ద.)

**సావలు** చామధాన్యం (క.)

**సికమరులు** ఎద్దుల కొమ్ములకు అలంకరించే పూసల అలంకారాలు (కో.)

**సిటిక** చిటిక, క్షణం (తె.)

**సిట్టవులి** చిరుతపులి (తె.)

**సిఫార్సు** ఫలాని వ్యక్తికి చేతనైన సహాయం కాని, మేలుకాని చేయవలసిందనీ, ఆ వ్యక్తికి కావలసిన పనులు చేసిపెట్టవలసిందని అర్థిస్తూ రాతపూర్వకమైన శ్లాఘన (కో,తె,క,రా,ద.)

**సిబ్బంది** ఉద్యోగ బృందం, పరివారం (కో, క,ద.)

**సిమిటి** సిమెంటు (తె.)

**సిరసిర** చిరచిర, వేగిరపాటు (క.)

**సిరుతిండ్లు** చిరుతిండ్లు, ఉపాహారాలు (తె.)

**సివ్వలు** చివ్వలు, కడ్డీలు (తె.)

**సీకటి** చీకటి (తె,ప్రకీర్ణ.)

**సీతారామ** సర్వ మనోహర ప్రకృతి సౌందర్యం, కనులపండువైన దృశ్యం, ప్రకృతి (క.)

**సీదాగా** పూర్తిగా, కచ్చితంగా, అంతా (క.)

**సీదా** చూ. సదావర్తి (ద.)

**సుంకు** పీడ, దరిద్రం, బాధ (క.)

**సుంత** కొంచెం, కొద్దిగా (కో.)

**సుత** మొదలుకొని, అదికూడా (తె.)

**సుతరామూ** ఎంతమాత్రమూ, ఏమాత్రమూ, ఏకొంచెమైనా, కొంచెంగాకూడా (కో.)

**సుతలామూ** చూ. సుతరామూ (క.) బొత్తిగా (కో.)

**సుతారం** సుకుమారం, మృదువు (కో,తె.)

**సుదరాయించు** ఒక విషయమైన యోచన, ఆలోచన, తలపు (తె.)

**సున్‌సాన్** మౌనంగా (తె.)

**సునార్లు** స్వర్ణకారులు, సొన్నారులు (తె.)

**సున్ని** కమ్మపొడుము, కమ్మసున్ని, కంది పొడుం (కో.)

**సుర్మాకలం** పెనసలు, పెన్సిలు (తె, ప్రకీర్ణ.)

**సుత్లి** పురికొస (తె.)

**సువారం** కోటలోకొలువు (ద.)

**సువ్వం** మూడోతరగతి (తె.)

**సూతిక** బాలింత జబ్బు (కో.)

**సుబ్బరం** శుభ్రం (క,కో,తె.)

**సూదిగా** కోసుగా, కూచిగా, సూదిమొనవలె (క.)

**సెల** కొండధార, ఊటనీటి ప్రభవ స్థానం (కో,ద.)

**సెలకట్టనీయక** వికసించనీయక, పైకి రానీయక (కో.)

**సెలవు** వీడ్కోలు చెప్పేటప్పుడు అంగీకారార్థన (కో,క,తె,ద,రా.)

**సెలవేయడం** మానుతున్నపుండు మళ్ళీవచ్చి కావడం (కో,ద,తె.)

**సెలిగి** చివ్వి, సన్నంచేసి (కో.)

**సేగా** విభాగం, శాఖ (తె.)

**సేవమోళ** గుడిలో దేవర ఎదుట నృత్యగానాదులు (కో.)

**సైంధవవధ** దుష్కరకార్యసాధనం, కష్టమైన పనిని సాధించడం (కో,క.)

**సైదం** మెత్తని గోధుమ పిండి (తె,ప్రకీర్ణ.)

**సైరు** షైరు, వ్యాహ్యాళి (కో,క.)

**సైసు** గుర్రాల పనివాడు (తె,ప్రకీర్ణ.)

**సొంచాయించు** ఆలోచించు (తె.)

**సొగటాలపాలీ** జూదపుపలక (క,రా.)

**సొగటాలు** జూదపు పావులు పాచికలు (క,రా.)

**సొట్ట** అవుడు, అంగవైకల్యం, కుంటి (క.)

**సొడ్డు** నెపం, ఆక్షేపం (క,కో.)

**సొన్నారి** స్వర్ణకారుడు (క.)

**సొమ్ములు** పశువులు, గొడ్లు, (క.)

**సోండీ** వేశ్య, వెలయాలు, పడపుపడతి (క.)

**సోద్యం** వింత, చోద్యం (తె.)

**సోనా** బంగారు (తె.)

**సోపతి** స్నేహం, మైత్రి (తె.)

**సోల్పు** దర్జా, హుందా, పరపతి(తో), కీర్తి ప్రతిష్టలతో (కో.)

## హ

**హంగామా** చిందర వందర, అస్తవ్యస్తం (క.)

**హంగామాచేయు** లోకువకట్టు, పరిభవించు, తృణీకరించు (క.)

**హజార్** వెయ్యి, సహస్రం (తె.)

**హమేషా** ఎల్లప్పుడు (తె.)

**హమ్లా** దాడి (తె.)

**హలాలు** పవిత్రం (ద.)

**హవా** గాలి, వాయుప్రసారం (తె.)

**హవాలా** అప్పగింత, స్వాధీనత (క,కో.)

**హవేలీ** భవనం (క.)

**హాజరుబాషి** సమక్షంలోనే ఉండటం, పిలిస్తే పలికే విధంగా సమీపస్థుడై ఉండటం (ద.)

**హాజరు** సిద్ధంగా, ప్రత్యక్షంగా, ఎదుట (కో.)

**హానీహానీగా** సరిపోయీ సరిపోనట్లు, చాలీ చాలకుండా, నిక్కచ్చిగా (కో.)

**హింకాయించడం** నిరోధించటం (కో.)

**హింకాయింపు** నిరసన, అసమ్మతి (కో.)

**హిఫాజత్** రక్షణ (తె.)

**హిరాసత్** నిర్బంధం, కట్టడి (తె.)

**హిస్సలు** భాగాలు (తె.)

**హుకుం** ఆజ్ఞ, అధికారపత్రం, అనుమతి (తె.)



**హుజుర్** ప్రభువు, అధికారి (తె.)

**హుూణం** నలిగి పోవడం (కో,క.)

**హెక్తారీ** హుషారు, హెచ్చరికగా (క.)

**హేపరకట్ట** చీపురుకట్ట (క.)

**హైరాను** ఆయాసం, విపరీతమైన బడలిక, శరీరశ్రమ, కిందుమీదయ్యే శ్రమ (కో,క.)